# చతుర

ఆగస్ట్ 2004

రూ. 7/-

౩౧౯ వ సంచిక





ప్రియదర్శినీ యల్లాప్రగడ

## ఐ లవ్ యూ మై చైల్డ్ !

31-07-04

## సచిత్ర విచిత్రం



# దీపోత్సవం

బీజింగ్‌లో ఏటా దీపాల పండగ జరుగుతుంది. పండుగలను పురస్కరించుకుని ఆ సందర్భంలో ప్రజలు ఘనంగా జరుపుకునే వేడుకలు, ఉత్సవాలు, సంబరాలు పరిశీలిస్తే కొన్ని ఆనందం కలిగిస్తే, కొన్ని వింత గొలుపుతాయి. బీజింగ్ ప్రజలు దీపాలపండుగనాడు దీపాలతో వింత వింత అలంకరణలు చేస్తారు. పైబొమ్మను చూస్తే కళాత్మకంగా రూపొందించబడిన ఓ అద్భుత హర్మ్యంగా అనిపిస్తుందిగానీ, నిజానికది రంగురంగు కాగితాలతో రమణీయంగా తీర్చిదిద్దబడిన అతి పెద్ద లాంతరు. బీజింగ్ పార్క్‌లో ఏర్పాటు చెయ్యబడిన భూతలస్వర్గంలా దీన్ని భావిస్తున్నారు సందర్శకులు.

# చతుర కతలు

## స్వరాజ్య పోరాటం

తెల్లని పుచ్చపువ్వులాంటి వెన్నెల. పిండార బోసినట్లున్న ఆ వెన్నెల్లో, వాకిట్లో పట్టెమంచాలపై పరుపులమీద తెల్లటి దుప్పట్లు పరచి దిండ్లు పెట్టి, "అయ్యగారండీ, పక్కలేశాను. వచ్చేయండయ్యా!" అరిచాడు పాలేరు.

"వస్తున్నాం రంగయ్యా! మవ్వెళ్లి తిండి తినరా. ఇంత రాత్రయింది" అని "రాజ్యం వీడికి తిండి పెట్టు" అరిచి "రండర్రా పిల్లలూ" అని వచ్చి వాకిట్లో మంచంపై వాలారు రాఘవయ్యగారు.

"తాతగారూ! కథలు చెప్పండి. కబుర్లు చెప్పండి" కూతురు పిల్లలు, కొడుకు పిల్లలూ చేరి గోలగోలగా అరుస్తున్నారు.

లోపలినుండి "ఏమర్రా! తాతగార్ని ఊపిరి తీసుకోనివ్వరా? " లోపల నుండి పెద్ద కోడలి మందలింపు.

"పర్వాలేదులేమ్మా! సెలవులయి మీ అందరలా వెళ్లిపోతే మీ మామగారు, నేను తీసుకొనేది విశ్రాంతేగా" అత్తగారి సమర్థింపు.

"కథలు వినివిని బోర్ కొడుతోంది తాతగారూ! స్వతంత్ర పోరాటం గూర్చిగాని, ఏదైనా రియల్ స్టోరిగానీ చెప్పండి" కూతురు కొడుకు తాతగారి హాస్యధోరణి, ఉత్సుకత కల్గించే విధంగా కథలు చెప్పడంలో దిట్ట అని తెలిసి అడిగాడు.



"మీరూ స్వరాజ్య పోరాటంలో పాల్గొన్నారా తాతగారూ? " ఆశ్చర్యంగా అడిగాడు చిన్న కొడుకు కొడుకు కుందన్.

"ఆ పోరాటం చేశా! స్వరాజ్యం కోసమే" ఆగారు రాఘవయ్యగారు.

"జైలుకెళ్లారా? సత్యాగ్రహాలు చేశారా? దెబ్బలు తిన్నారా? మీ పెద్దాళ్లు ఏమన్నారు" ప్రశ్నలవర్షం కురిపించారు పిల్లలు.

"మరే. కాలేజీకి ఎగనామం పెట్టి స్వరాజ్యం కోసం తిరుగుతున్నానని తెలిసి

కవర్ ఫొటోగ్రాఫర్: **మధు** మోడల్: **శారిక**

మా తాతగారు కాళ్లువిరగ్గొడతానన్నారు. మా నాన్నగారు ముందు చదువు సంగతి చూడు, స్వరాజ్యం, గిరాజ్యం అన్నావో, చెమ్డా లూడగొడతానని వార్నింగిచ్చారు"

"ఛీ! మీ పెద్దాళ్లకి కొంచెం కూడా దేశభక్తి లేనట్లుంది తాతగారూ" ముక్తకంఠంతో అన్నారు పిల్లలు కోపంగా.

"ఆగండర్రా పిల్లలూ! అంత మాటనకండి. మా నాన్నగారూ, తాతముత్తాతలు మహాదేశభక్తులు. మరి 'చిన్నవాడు వీడెందుకు అనుకొని అలా అనుంటార్రా!" పెద్దకొడుకు చిన్న కూతురు ఆరిందాలా అంది.

"కాదులేవే! మీరు చెప్పండి, తాతగారూ!" మిగతా పిల్లలు ఉత్సుకతతో అన్నారు.

"చెపుదామనే. వినండి. మా వాళ్లెంత చెప్పినా నే స్వరాజ్యంకోసం పోరాటం మానలేకపోయేను. గోడలు దూకాను, సత్యాగ్రహాలు చేశాను. దెబ్బలుతిన్నాను. ఒకటేమిటి ఎన్నో విధాలుగా పోరాడాను"

"జైలుకెళ్లావా తాతయ్యా? " రాఘవయ్యగారి మాటలకు మధ్యలో అడ్డొచ్చాడు చంటాడు సారధి.

వాడితో రాఘవయ్యగారు "లేదు నాన్నా! ఆ పనీ అవ్వాల్సిందే, మా నాన్నగారు కలగజేసుకోబట్టి ఆగింది" కష్టంపై అన్నారు.

"అదెలా? " అన్న కుందన్‌తో "ఏముంది నా అవస్థలు చూడలేక మా బామ్మ, అమ్మ మా నాన్నగార్ని, తాతగార్ని పోరీపోరీ "పిల్లాడిలా అవస్థలు పడుతుంటే మీరేం మనుషుల్రా! మీరేం పాట్లు పడతారో మాకు తెలీదు. ఆ స్వరాజ్యాన్ని వాడికి అప్పజెప్పండి" అన్నారు.

"మీ వాళ్లెలా అప్పజెప్తారు, తాతయ్యా!" పిల్లలు సందేహంగా ముఖాలు పెడితే రాఘవయ్యగారు గుబురు మీసాలచాటునుండి గుంభనంగా నవ్వుతూ, "మరేంటనుకున్నారు? మా వాళ్లు గొప్ప దేశభక్తులని చెప్పానా! మనకు స్వాతంత్ర్యం వచ్చిన రోజునే స్వరాజ్యం వాళ్ల నాన్నగారి దగ్గరకెళ్లి నాకు స్వరాజ్యాన్ని ఇయ్యడానికి ఒప్పించారు"

"మీకు స్వరాజ్యాన్నియ్యడమా? " పిల్లలంతా సస్పెన్స్ భరించలేక సామూహికంగా అరిస్తే

"అదేనర్రా మీ నాయనమ్మ స్వరాజ్యాన్ని నాకిచ్చి పెళ్లి చెయ్యడానికి ఒప్పించారన్న మాట. మీ నాయనమ్మ పేరు స్వరాజ్యలక్ష్మిగదా!" అన్నారు రాఘవయ్యగారు.

"ఓస్ నాయనమ్మ కోసం నువ్వు సాగించిన పోరాటమా! మేం నిజమే గాబోలని ఎలా ఊహించుకున్నాం. యు ఆర్ గ్రేట్ తాతయ్యా భలే చెప్పావు. బామ్మ (నాయనమ్మ) నాన్నగారు డిక్టేటరా? " పిల్లలు నవ్వుతూ అంటుంటే "ఒరేయ్ నన్నేమన్నా అనండి. మా నాన్నగారిని అన్నారో జాగ్రత్త" స్వరాజ్యలక్ష్మిగారు వస్తూ నవ్వుతూ బెదిరించారు.

"వాళ్ల నాన్నగారే కాదు ఈవిడా పెద్ద డిక్టేటరే నర్రా" రాఘవరావుగారు నవ్వుతూ అంటుంటే పిల్లలు శృతికలిపి అంతా హాయిగా నవ్వుకున్నారు.

– ఎ. విశాలాక్షి

---

## అనూహ్యం

ఫస్ట్ ఫ్లైట్ కొరియర్ సర్వీసెస్ వారి అసిస్టెంట్ మేనేజర్ పోస్టుకోసం ఇంటర్వ్యూకు పిలుపు అందుకుని కోరమాండల్ ఎక్స్‌ప్రెస్‌లో హౌరానుండి మద్రాసుకు స్లీపర్‌క్లాస్ టిక్కెటు తీసుకుంటే ఆర్.ఎ.సి. వచ్చింది. కన్ఫర్మ్ అయిపోతుందని కౌంటర్ క్లర్క్ అభయమిచ్చాడు. ఇంటర్వ్యూ ఇరవయ్యవ తారీఖున అయినా మద్రాసులో మేనేజిమెంటు కోర్సు చేస్తున్న మిత్రుడు సత్యానందం 'వారంరోజులు ముందుగా బయల్దేరి వచ్చేయ్... ఎంజాయ్ చేద్దాం'

అని ఫోన్లో ఆర్డర్ వేస్తే మొదటిసారి మద్రాసు వెళ్తున్న నేను 'ఓ.కే.' అన్నాను.

జర్నీ రోజుకు టిక్కెట్టు కన్ఫర్మ్ అయింది. ఎస్ నైన్‌లో బర్త్ నెంబరు అరవై నాలుగు, సైడ్ అప్పర్ బెర్త్. తీసుకువెళ్తోన్న సూట్ కేసు మరీ తలకింద పెట్టుకోవడం కుదర్దు కాబట్టి సైడు బెర్త్‌కింద రింగ్‌ల సహకారంతో చైను వేశాను. ఖుర్దా రోడ్‌లో టిఫిన్ చేసి సైడు అప్పర్ బెర్తు ఖుష్వంత్ సింగ్ జోక్స్ చదువుతూ గుండెలమీద పుస్తకం పెట్టుకుని ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలీదు.



ఉదయాన్నే ఐదుగంటల ప్రాంతంలో 'టీ' వాడి కేకతో నిద్రలేచిన నేను, దిగుతున్న వారిని వాకబు చేస్తే వచ్చింది విశాఖపట్నం అని తెల్సింది. కిందకు చూశాను. గుండె గుభేల్‌మంది. సూట్‌కేస్ మాయం... చైను తెగిపడి వుంది. ఇలా జరుగుతుందని నేను ఊహించలేదు. చుట్టుపక్కల సూట్‌కేస్ కోసం వెదికాను. ఎక్కడా కన్పించలేదు. ఏం చేయాలో తెలియని అయోమయ స్థితి... 'బరంపురం దాటిన తర్వాత కాస్త అలర్ట్‌గా వుండాలి మేష్టారూ... అంత కేర్ లెస్ అయితే ఎలా?' లెక్చరిచ్చేస్తున్నాడు కింది బెర్త్‌వాడు. ఈలోగా ట్రైన్ కదిలే చప్పుడుకు గబుక్కున కిందకు దిగాను. నీరసంగా జి.ఆర్.పి. స్టేషనుకు వెళ్ళాను కంప్లయింట్ చెయ్యడానికి. ఎస్సై ఆరాలు తీసి, వివరాలు రాసుకుని ఒక డైరీ నెంబరు ఇచ్చాడు. పాకెట్లో ఆరు వందలతో జర్నీ టికెటు మిగిలింది. బాధంతా ఇంటర్వ్యూకు హాజరు కాలేనిపరిస్థితి. సర్టిఫికెట్లన్నీ పోయాయి. అనూహ్యం...

రెండుగంటలు ఆలస్యంగా నడుస్తున్న హౌరా వెళ్ళే ఫలక్‌నుమా ఎక్స్‌ప్రెస్ మరి కొద్దిసేపట్లో రాబోతోందని తెలిసి టిక్కెట్లు తీసుకున్నాను తిరుగు ప్రయాణానికై. మెదడు మొద్దుబారింది. ఏం చేయలేని నిస్సహాయత. ఒంటినిండా నీరసం ఆవహించింది. సర్టిఫికెట్ల డూప్లికేట్లు సంపాదించాలంటే తల ప్రాణం తోకకొస్తుంది. భగవంతుడా ఏమీటీ శిక్ష అని తల బాదుకున్నాను. బంగారంలాంటి అవకాశం మిస్సయినందుకు గుండె బరువెక్కింది.

అదే రాత్రి పదిగంటలకు హౌరాలో ఇంటికి చేరిన నన్ను చూసి అమ్మ ఆశ్చర్యపోయింది. 'ఏమైందిరా' అని ఆందోళనగా అడిగింది. 'విశాఖనుండి ఫోన్ చేస్తే ఇంటర్వ్యూ పోస్ట్‌పోన్ అయిందని సత్యా

నందం చెప్పాడు' అని అమ్మకు సర్దిచెప్పి మంచంమీద వాలిపోయాను.

రెండు రోజుల తర్వాత నాకు కొరియర్‌లో ఒక కవరొచ్చింది. విప్పి చూస్తే నా ఇంటర్వ్యూ కాల్ లెటర్‌తో సహా సర్టిఫికెట్లు...! ఆశ్చర్యపోయిన నాకు తెల్లకాగితంపై తోడుగా ఒక ఉత్తరం.

"సార్... నమస్తే. ఇంటర్వ్యూకు ఇంకా టైం ఉందని చూసి వెంటనే కాల్‌లెటర్‌తో సహా సర్టిఫికెట్లను పంపిస్తున్నాను. సూట్‌కేసులో సైడు పర్సులో దాచి ఉంచిన మూడు వేల రూపాయలు, ఫ్లస్ బట్టలు వాడుకుంటున్నాను. డిగ్రీ చదివి ఉద్యోగాల వేటలో అలసిపోయి ఓడిపోయినవాణ్ణి. అర్థంలేని నా బతుకుకన్నా ఆశలతో నిండిన మీ జీవితం వ్యర్థం కాకూడదని కోరుకుంటూ ఈ కవరు కొరియర్లో పంపిస్తున్నాను. తప్పక ఇంటర్వ్యూకు హాజరుకాగలరు. మీకు ఉద్యోగం తప్పక లభించాలని నా కోరిక. ఇకముందు జర్నీలో సైడ్ బెర్తుని 'ఎవాయిడ్' చెయ్యండి... శుభాకాంక్షలతో...

మీ సూట్‌కేస్ దొంగ"

ఇంటర్వ్యూ లెటర్‌తోసహా పోయిన సర్టిఫికెట్లు తిరిగి చేతికి రావడంతో ఉబ్బితబ్బిబ్బయి ఇంటర్వ్యూకు హాజరయ్యే అవకాశం కల్గించిన దొంగగారికి మనసులోనే ధన్యవాదాలు అర్పించుకుంటూ మరోసారి రిజర్వేషన్ టికెటుకోసం హౌరా రైల్వేస్టేషనుకు బయల్దేరాను.

**– జోగారావు జి**

---

## గురువుకి తగ్గ శిష్యులు

క్లాస్‌రూమంతా... గోలగోలగా ఉంది. ఆ గోలను విన్న శంకరం మాస్టారు ఆఫీస్ రూంలోంచి గోల జరుగుతున్న క్లాస్‌రూం వైపు బయలుదేరి మెట్లు దిగుతున్నారు కోపంగా.

"రేయ్! శంకరం మాస్టారుగారు మన క్లాస్‌రూంకే వస్తున్నారు. అంతా నిశ్శబ్దంగా ఉండండి" క్లాస్‌రూంలో ఎవరో విద్యార్థి హెచ్చరిస్తున్నట్లు పెద్దగా అన్నాడు.

అతడి మాట వినగానే మిగిలిన విద్యార్థులంతా, కరెంటు పోగానే మాట్లాడటం ఆగిపోయిన టేప్‌రికార్డర్‌లా ఎక్కడివాళ్ళు అక్కడే నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు.

శంకరం మాస్టారు క్లాస్‌రూంలోకి వచ్చారు. "గుడ్‌మార్నింగ్ సార్" విద్యార్థులంతా కలిసి ముక్తకంఠంతో అన్నారు. "ఆc... అందరికీ గుడ్‌మార్నింగ్... గుడ్ మార్నింగ్" అన్నారు విద్యార్థులను ఉద్దేశిస్తూ శంకరం మాస్టారు. అటెండెన్స్ వేయటం పూర్తి అవగానే, "చూడండి పిల్లలూ! ఈరోజు నేను మీ అందర్నీ కొన్ని జనరల్ నాలెడ్జ్ ప్రశ్నలు అడుగుతాను. మీరంతా నేనడిగిన దానికి నిర్మొహమాటంగా సమాధానాలు చెప్పాలి" అన్నారు.

"అలాగేనండి" అన్నారు విద్యార్థులంతా.

"ఒరే రాము! పాలిచ్చే జంతువుల పేర్లు ఓ ఆరు చెప్పు" అడిగాడు శంకరం మాస్టారు.

వెంటనే రాము లేచి "మేక, గొర్రె, గేదె, మూడు ఆవులు!" అన్నాడు రాము.

క్లాస్‌రూమంతా నవ్వులతో ప్రతిధ్వనించింది.

"ఆపండి మీ నవ్వులు. ఒక బరువైన పెద్ద రాయిని నీ కుడిచేతి వైపు నుండి, నీ ఎడమ చేతివైపుకు మార్చుకోవాలంటే... ఏం చేయాలిరా" రాజేష్‌ని అడిగాడు మాస్టారు.

"ఏముంది మాస్టారు! చాలా సులభం!! ఆ రాయికి ఎడమచేతివైపు కెళ్ళి నుంచుంటే సరి!" అన్నాడు రాజేష్ వెటకారంగా.

"నీ మొహం కూర్చో" శంకరం మాస్టార్ అన్నాడు చిరాకుపడ్తూ.

"ఒరేయ్! డాక్టర్ గారబ్బాయ్! నీ పేరేంటి" అడిగాడు శంకరం మాష్టారు.

డాక్టర్‌గారబ్బాయి "సమరసింహప్రసాదండీ!" అన్నాడు.

"మంచిది. నేను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పు. ఏ నెలకు 28 రోజులుంటాయి? " శంకరం మాష్టారు అన్నారు.

"అన్ని నెలలకూ 28 రోజులుంటాయ్ గదా సార్" అన్నాడు.

"పిల్లలూ! స్కూల్ మొత్తంలో మీకు ఎవరంటే ఇష్టం"

ఉండేది" అన్నాడు సురేష్.

"అబ్బే! సురేష్ నీకు అంతగా లెక్కలు తెలియవనుకుంటా. హరీష్ నువ్వు చెప్పరా" అన్నాడు.

"పది రూపాయలేనండీ ఉండేది. సురేష్ వాళ్ళ నాన్న పిసినారండి! ప్రాణం పోతున్నా పది రూపాయలివ్వరండి" అమాయకంగా అన్నాడు హరీష్.

"సోమూ! ఇంగ్లీష్ ఛానల్ ఎక్కడ ఉంది చెప్పు" శంకరం మాష్టారు అడిగాడు.

"ఏమో తెలియదు సార్! మా టి.వి. లో



"ఇంటిబెల్ కొట్టే ప్యూన్ అంటే మాకెంతో ఇష్టం" అన్నారు పిల్లలు ఒకేసారిగా.

ఆ మాట విన్న శంకరం మాష్టారు నోటి మీద వేలు వేసుకునేంతపనైంది. 'ఈ ప్రశ్న పిల్లల్ని అడగకుండా ఉండవల్సింది' అని మనసులో అనుకున్నాడు.

"సురేష్! నీ దగ్గర పదిరూపాయలు ఉన్నాయనుకో... మీ నాన్ననడిగి మరో ఇరవై రూపాయలు తీసుకున్నావనుకో... అప్పుడు నీ దగ్గర ఎంత డబ్బు ఉంటుంది? కరెక్ట్‌గా సమాధానం చెప్పు" అని అడిగాడు.

"పది రూపాయలేనండీ నా దగ్గర

లోకల్ ఛానెల్స్ మాత్రమే వస్తాయి"

"నక్షత్రాల పేర్లు చెప్పరా? " శ్రీనివాస్‌ని అడిగాడు మాష్టారు.

"అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, ఆత్రేయ, సి.నా.రే., వేటూరి, కొసరాజు..." చెప్పాడు.

శంకరం మాష్టారు "ఏ యుద్ధంలో హర్షవర్ధనుడు మరణించాడో చెప్పరా కిరణ్"

"ఆయన చేసిన చివరి యుద్ధంలోనండీ!" నీరసంగా చెప్పాడు కిరణ్.

"ఏడిశావ్‌లే కూర్చో ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చెప్తే అది ఏ అలంకారం అవుతుందో చెప్పు" రేఖని అడిగాడు మాష్టారు.

"తికమక అలంకారం అవుతుంది సార్" అంది.

కమల్ లెక్కల నోట్స్ తీసుకుని, శంకరం మాష్టారు దగ్గరకు వెళ్ళి నోట్స్ చూపిస్తూ "ఇంత పెద్ద లెక్క చేసినా చివర్లో ఆన్సర్ జీరో వచ్చింది సార్" అని అతడికి వచ్చిన అనుమానం చెప్పాడు కమల్.

అప్పుడు శంకరం మాష్టారు "అవును. అది కరెక్ట్ ఆన్సరేగా" అన్నాడు.

"అది కాదండీ, కేవలం జీరోకోసం, ఇంత సేపు కష్టపడాలా? " మాష్టార్ని అడిగాడు కమల్.

"గాడిదకు మాత్రమే ఉండి, మిగతా జంతువులకు లేనిదేమిటో చెప్పండి చూద్దాం? " అడిగాడు.

"గాడిదపిల్ల సార్" అన్నాడు ఒక విద్యార్థి.

"చూడు రాంబాబు! 'శుభ్రము'గా. అనే మాటను ఉపయోగించి ఒక వాక్యం చెప్పరా" అడిగాడు మాష్టారు.

"మీరు శుభ్రంగా పళ్లను తోముకోవాలి మాష్టారూ!" అన్నాడు రాంబాబు.

"ఒరే రాము! నీ పక్కన బెంచీలో నిద్ర పోతున్న సోమును కాస్త లేపరా!" అన్నాడు.

"ఎందుకు సార్!? మరో పది నిమిషాల్లో ఇంటి బెల్ కొడతారు వాడే లేస్తాడు" శంకరం మాష్టారుతో అన్నాడు రాము.

"మే ఐ కమిన్ సార్" అని క్లాస్‌రూం బయటినుండి ఇద్దరు (పిల్లల) విద్యార్థుల గొంతు వినిపించింది.

ఆశ్చర్యపోతూ అటువైపుకు చూశాడు శంకరం మాష్టారు. "కమిన్ ఇంతసేపటివరకూ ఏం చేస్తున్నారు" అని అడిగాడు.

"నా రూపాయి బిళ్ల రోడ్డుమీద పడిపోతే దాన్ని వెతకడంకోసం ఆలస్యమైందండీ" అన్నాడు గోపీ.

"మరి నీవెందుకు ఆలస్యంగా వచ్చావురా మూర్తి" అడిగాడు మాష్టారు.

మూర్తి "నేనండి. ఆ రూపాయి బిళ్లమీద నుంచున్నానండీ" అన్నాడు.

"కూర్చోండి. ఇంటి బెల్లు కొట్టే టైం కూడా అయింది" కోపంగా అన్నాడు శంకరం మాష్టారు.

"రోయ్ గోపీ! ఒలింపిక్ గోల్డ్ మెడల్ సాధించాలంటే, గుర్రపు స్వారీలో మనవాళ్లకి ఒక చిట్కా చెప్పరా"

"సరే చెబుతానండి., కాస్త ఆలోచించాలి ఆగండి" అంటాడు గోపి.

"త్వరగా ఆలోచించి చెప్పరా? ఇప్పటికే... ఆలస్యమైంది" శంకరం మాష్టారు అన్నాడు.

"ఆఁ... గుర్తొచ్చిందండీ! చిట్కా"

"చెప్పరా అయితే"

"మనవాళ్లకి తప్ప మిగిలిన వాళ్లందరికి గాడిదల్ని ఇవ్వాలిసార్" అన్నాడు గోపి.

"శభాష్ కూర్చో" శంకరం మాష్టారు అన్నాడు.

"మాష్టారూ! నాదో చిన్న సందేహం. నన్నయ్య ఏ శతాబ్దానికి చెందిన వారండీ? మీరు తెలుగు మాష్టారు కదా! కాస్త చెప్పండి" అడిగాడు మూర్తి శంకరం మాష్టార్ని.

అప్పుడు శంకరం మాష్టారు "నోర్మూయరా వెధవ. హిస్టరీ మాష్టార్ని అడగాల్సిన ప్రశ్న నన్ను అడుగుతావేంట్రా. కూర్చో" కోపంగా అన్నాడు.

"అబ్బాయ్ సునీల్! ఒకటి ప్లస్ ఒకటి, రెండు కదా. అలాగే రెండు ప్లస్ రెండు ఎంత...? చెప్పరా" అడిగాడు శంకరం మాష్టారు.

"పొండి మాష్టారు! తేలికవి మీరు చెప్పి... కష్టమైనవి నన్ను అడుగుతున్నారు" శంకరం మాష్టారువైపు చూస్తూ చెప్పాడు సునీల్.

ఇంతలో "ఘణఘణ"మని ఇంటి బెల్లు మోగింది. క్లాస్‌రూంలోని పిల్లలు కేరింతలు కొడుతూ... బయటకు వచ్చారు.

– యస్.కె. యం.డి. జానీబాషా

# చతుర

319వ సంచిక
ఆగస్టు: 2004 సంపుటి: 27 సంచిక: 7

ఆమెకు అతడు ప్రాణ సమానం. చట్టరీత్యా, సంఘరీత్యా ఆమె భార్య కాకపోవచ్చు. కానీ ఆమె ప్రేమ ఈ చట్టాన్నీ, సంఘాన్నీ, ఆ నియమాల్నీ అతిక్రమించి ఆకాశమంత విశాలమయింది.

పెళ్లి ఒకచోట, ప్రేమ మరొకచోటగా గడిపే అతడికి మాత్రం రెండు పడవల్లో కాళ్లు పెట్టినట్లయింది జీవితం. ఇటు ప్రేమించిన స్త్రీ, ఆమె కొడుకు... అటు పెళ్లాడిన స్త్రీ, ఆమె బిడ్డలు.

తండ్రి తమని ఆదరణగా చూడటం లేదనీ, ఇలా వచ్చి అలా వెళ్లిపోతాడని ఫిర్యాదు చేసే కొడుక్కి తండ్రి మంచితనం గురించి వివరించి చెప్పేదామె.

**ఆఖరి క్షణం వరకూ ఆమె అతడిని తన ప్రేమ సామ్రాజ్యానికి చక్రవర్తిగా చూసుకున్నా చివరికి ఆమెకి మిగిలింది ఏమిటి?**

ప్రేమ మత్తులో పడి వివాహేతర సంబంధాలకు పరుగెత్తే స్త్రీల అగచాట్లను మనసుకు హత్తుకునేలా అక్షరబద్ధం చేసిన

ప్రియదర్శినీ యల్లాప్రగడ రచన

# ఐలవ్ యూ మై చైల్డ్!

ఈ నెల చతుర సమగ్ర నవల.

గ్రే కలర్ లాన్సర్ కారు కంట్రీక్లబ్బు మెయిన్ గేటులోంచి లోపలికి మెత్తగా దూసుకుపోయింది. లోపల పెద్ద ఖాళీస్థలంలో ఎడమవైపు పార్కింగ్ కోసం వదలబడ్డ స్థలంలో ఆగింది ఆ కారు రాజహంసలా. డోరు తెరుచుకుంది.

డ్రైవింగ్ సీటులోంచి కుడికాలు కిందపెట్టిన ప్రాణేష్ రెండోకాలును కూడా కారులోంచి తీసి బయట నేలమీద పెట్టి, నిటారుగా నిలబడి టక్‌చేసిన వైట్ షర్ట్‌ను ఒకసారి ఆత్మవిశ్వాసంతో సర్దుకున్నాడు. కళ్లకి పెట్టుకున్న రేబాన్ గ్లాసెస్‌ని తీసి ఎడమవైపున్న చొక్కాజేబులో పెట్టుకుని, ఆటోమేటిక్ లాకర్‌తో కారు లాక్‌చేసి, కీ చైన్‌ని పాంటు జేబులో పెట్టుకుని ప్రసన్నవదనంతో నలువైపులా చూసుకుంటూ అడుగులు ముందుకేస్తున్నాడు.

మెంబర్స్ కార్డును గేట్ దగ్గర చెక్ చేయించుకుని క్లబ్బుకి చేరువగా నడుస్తున్నాడు వడివడిగా. సడన్‌గా ఎవరో పిలిచినట్లనిపించి తలను కుడివైపుకి పంకించి మరోసారి వినడానికి ప్రయత్నించాడు నిజంగానే ఎవరయినా తనను పిలిచారా అని. ఒకవేళ పిలిచినా తననేనా? అనుకుంటూ. అదేవైపు గబగబా వెళుతూ అతన్నే అనుసరిస్తూన్న మిసెస్ చక్రధరరావు పిలిచింది. "ఏం ప్రాణేష్... నువ్వేనా కాదా అనుకుంటూ నీ వెంటే వస్తున్నా, నువ్వు కారు దిగినప్పటి నుంచీ. నిజంగానే ముమ్మాటికీ నువ్వే సుమా... అవునూ నాకు తెలీకడుగుతాను గానీ ఎంత మారిపోయావ్. ఎంత పెద్దవాడవయ్యావ్. ఎన్నేళ్లయింది నిన్ను చూసి. ఎప్పుడో నువ్వు ఇంటర్మీడియట్ చదివేప్పుడనుకుంటా నిన్ను చూసింది- అన్నట్టు... మీ మమ్మీ బాగున్నారా?" అంటూ ఎడతెరిపి లేకుండా గుక్కతిప్పుకోకుండా కక్కేసింది అడగాల్సిన ప్రశ్నలన్నింటినీ.

ఆమె వెనకాలే ఆమెను అనుసరిస్తూ నడుస్తున్న ఆమె భర్త చక్రధరరావు "అబ్బబ్బ అవునులేవే పాపా... నువ్వు తెలిసడిగినా తెలీకడిగినా అతను ఖచ్చితంగా మన ప్రాణేషే. ఖచ్చితంగా మన దుష్యంతరావుగారబ్బాయే. ఐమీన్ మన పద్మినిగారి కొడుకులేవే" అంటూ నసుగుతున్నాడు. 'హెన్‌పెక్‌డ్ హజ్‌బెండ్' అనే పదానికి తాత్పర్యం తనేనన్నట్టు. షాక్ తగిలితే ఉలికిపాటు కలిగినట్టు ఉలిక్కిపడి చూశాడు వెనక్కి తిరిగి ప్రాణేష్ చక్రధరరావువైపు. కారణం ఆయన తన భార్యని ముద్దుగా 'పాపా' అని సంబోధించినందుకు కాదు. ఆ సంబోధనని ఆయన నోటినుంచీ కొన్ని వందలసార్లు విని వుంటాడు ప్రాణేష్ తన చిన్నతనంలో వాళ్ళ నెయిబర్‌గా. కానీ ఇప్పుడు కలిగిన ఉలికిపాటుకు కారణం 'మన దుష్యంతరావుగారబ్బాయే' అని నొక్కి వక్కాణించినట్లుగా అన్న మాటలకి. అతని ఉలికిపాటులోను, అతను వెనుతిరిగి చక్రధరరావును చూసిన చూపులలోను, అతని కళ్లలోను ఎన్నో అర్థాలు కనిపించాయి.

ఎందుకంటే- మామూలు పెళ్లి, పెళ్ళిళ్లలోని సంబంధాలు, కాపురాలు, పిల్లలు వీటిలో జనాలకి ఎలాటి ఉత్సాహంగానీ సరదాలుగానీ పుట్టవు. ఇలాటివన్నీ చప్పగానూ, రుచివిహీనంగానూ, సర్వసాధారణంగానూ వుంటాయి. వివాహేతర సంబంధాలు, దానికి సంబంధించిన మనుషులు, వాళ్ళకి కలిగిన సంతానం... ఇవన్నీ జనాలకి ఉత్సాహాన్ని కలుగజెయ్యడమేగాక నూతనోత్సాహాన్నో లేక నూతన చైతన్యాన్నో పుట్టించి, ఆయా సంబంధాలు, మనుషులపట్ల యావ చూపించుతారు. ఇది మానవనైజం. బాలీవుడ్‌కి సంబంధించిన మాగ్‌జైన్స్‌కి విపరీతమైన మార్కెటింగ్ మన దేశంలోనే కాకుండా ఇతర దేశాలలో కూడా వుండటానికి కారణం ఈ రహస్యమే.

ప్రాణేష్ చూసిన చూపులకి చక్రధరరావు ఒక్కక్షణం తమాయించుకున్నాడు దొంగలా. ఇదే ప్రాణేష్‌నీ, అతని తల్లి పద్మినినీ చిన్న

ప్పుడు తన పక్క ఇంట్లో వున్న చక్రధరరావు ఎంతగానో బాధించాడు అతని మాటలతో. అతని భార్య అయితే సరేసరి. ఆమె వాగుడు, ఆమె ధోరణి తెలియనివాళ్ళకయితే చెప్పాలిగానీ తెలిసినవాళ్ళకి చెప్పే అవసరం వుండదు. ఎన్నోసార్లు ఆమె తనముందు తన తల్లిని అవమానించిన సందర్భాలు న్నాయి. రెండిళ్లకీ మధ్యన వున్నది ఒక్క గోడే అవడంవల్ల ఆమె అనే మాటలు తన ఇంట్లోనుంచే అంటూన్నట్టుగా వినిపించేవి. తన తండ్రి దుష్యంతరావు వచ్చే రాకపోకల గురించి ఎన్నోసార్లు ఆమె తన పనిమనుష లతో అంటే తను విన్న సందర్భాలున్నాయి. ఆ మాటలు విన్న తన తల్లి ఎన్నోసార్లు మూగగా గుడ్లనిండా నీళ్లు కుక్కుకోవడం తను కళ్లారా చూశాడు చిన్న వయసులో. ఒకసారి తన తల్లిని ఏదో పేరంటానికని పిలిచిన ఆమె పేరంటంలో తోటి ఆడవాళ్ల ముందు కనీస మానర్స్ అయినా లేకుండా సూటీపోటీ మాటలతో అసహ్యకరంగా విమ ర్శించింది. ఆరోజున తన తల్లి మంచంమీద పడుకుని ఎంతగా విలపించిందో తనెప్పటికీ మరచిపోలేడు. నిజానికి ఆరోజు తనకి తండ్రిమీద కూడా చాలా కోపం, ద్వేషం కలి గాయి. వీటన్నింటికీ కారణం తన తండ్రికి తను రెండో భార్య కొడుకవడం. తనయినా, తన తల్లయినా చేసిన నేరం ఇదే. ఇదిజరిగి చాలా కాలమవుతోంది. కనీసం పదిహేను సంవత్సరాలయినా అయుంటుంది ఆ పేరంటం ఇన్సిడెంట్ జరిగి. రెండో భార్య అవడమే కదా తన తల్లి చేసిన నేరం. అద్దె ఇంట్లో వుండటం కూడా. ఆ రోజుల్లో ఎ.ఎ స్.రావునగర్‌లో వుండేవాళ్లు తను, తన తల్లి. తరువాత సైనిక్‌పురిలో తన తండ్రి సొంత ఇల్లుకొని, అక్కడ వుంచినప్పటినుంచీ మళ్లీ తన తల్లి ఎవరి ఇంటికీ పోలేదు దేనికీ కూడా. మధ్యలో ఒకటి రెండుసార్లు ఎక్కడో కూరగాయలు కొనేచోటో ఇంకెక్కడో తను వాళ్ళని చూశాడు గానీ వాళ్ళని గుర్తుపెట్టు కోవడం తనకి ఇష్టంగా అనిపించలా.

ఇన్ని సంవత్సరాల తరువాత ఇప్పుడు కంట్రీ క్లబ్బులో చూస్తున్నాడు ఆ జంటని. వయసులో మార్పు వచ్చినా, వాళ్లిద్దరి ధోర ణిలో మాత్రం కొంచెం కూడా మార్పు రాలేదు.

"అవును అంకుల్. నేనే... బావున్నారా మీరు? దినేష్ ఎలా వున్నాడు? మెడిసిన్ అయిపోయిందా? ప్రాక్టీస్ చేస్తున్నాడా?" అడిగాడు నిష్కల్మషంగా.

"అయిపోయింది ప్రాణేష్. మొన్ననే ప్రాక్టీస్ పెట్టాడు. చక్రధరరావు చెబుతుండ గానే మాటల మధ్యలో ఆమె అడ్డుపడి, "ఇది తెలుసా నీకు ప్రాణేష్. వాడు అచ్చం వాళ్ళ డాడీలాగే అచ్చు గుద్దినట్టున్నాడు కానీ..." కాస్త సిగ్గు అభినయిస్తూ, భర్తవైపు ఎగతాళిగా చూస్తూ "ఈయనకంటే నాలు గంగుళాలు పొడుగు. వాడు చాలా చక్కగా తయారయ్యాడీమధ్య. నువ్వు తప్ప కుండా ఒకసారి మా ఇంటికి రావాలి మీ మమ్మీని తీసుకుని తెలుసా? అసలు మీరు మమ్మల్ని మర్చిపోయారు సైనిక్‌పురి వెళ్ళిన తరువాత. మాకయితే నువ్వూ, మీ మమ్మీ ఎప్పుడూ గుర్తొస్తుంటారు. మీ మమ్మీ నిజంగా ఎంత బాగా పెయింటింగ్స్ వేసేది. ఎంత బాగా ముగ్గులు పెట్టేది" అంటూ లేని ఆత్మీయతను తెచ్చిపెట్టుకుంది.

"అన్నట్టు మేము అదే ఇంట్లో వుంటున్నాం ప్రాణేష్ ఎ.ఎస్.రావునగర్‌లో. ఎందుకయినా మంచిది ఫోన్ నంబర్ నీ దగ్గర పెట్టుకో" అంటూ భర్త జేబులోకి చివాల్న చెయ్యి పోనిచ్చింది. జేబులో వున్న విజిటింగ్ కార్డ్సులో ఒకటి తీసి అతనికి చ్చింది.

"గుర్తుంది ఆంటీ... నాకెందుకు గుర్తుం డదు? చిన్నప్పుడు నేను పెరిగిన ఇల్లు. దాని పక్కనున్నది మీది. గుర్తుండక ఎలా వుంటుంది? వస్తాలెండి... చూద్దాం"

భర్తని రుసరుసా చూస్తూ, "అన్నట్టు.

మీరొకరూ. చెప్పరేం? సరే నేనే చెబుతా. మీరు ఖాళీ చేసిన ఇల్లు ఇప్పుడు ఇల్లుగా లేదు. పెద్ద అపార్ట్‌మెంట్స్ వచ్చాయి దానిలో. ఆ అపార్ట్‌మెంట్స్‌లో ఒక సూపర్ మార్కెట్టు కూడా వుంది" కష్టపడి గచ్చిబౌలీలో సీ.యమ్. స్టేడియం కట్టిస్తే భర్త ఆ విషయాన్నే ఎత్తకుండా ఆ వార్తకి అన్యాయం చేశాడన్న లెవెల్లో చెప్పిందామె ఆవేశంగా.

"సరే ఆంటీ... తప్పకుండా వస్తాలెండి. బై" అంటూ క్లబ్బు కారిడార్‌లోకి ప్రవేశించాడు వాళ్ళని బలవంతంగా వదిలించుకుంటూ.

ఆరడుగులకి ఒకటి రెండంగుళాలు తక్కువగా వున్న విగ్రహం. పొడవుకి తగిన లావు. గ్రేకలర్ పాంటు, వైట్ కలర్ హాఫ్ హాండ్స్ షర్టు. టక్ చేసుకున్న తీరు చూస్తుంటే స్టైలు తెలిసిన మనిషిలా కనిపిస్తున్నాడు. మరీ తెలుపు కాదు. అలాగని నలుపూ కాదు. చక్కటి చామనఛాయ. చూసేవాళ్ళనిట్టే ఆకర్షించగల చురుకైన కళ్లు. మాస్లీగా వుండే ప్రాణేష్ ఎవరినయినా సరే వెంటనే ఆకర్షించుకోగలడంటే అందుకు సందేహం వుండదు. ముక్కు సూటిగా వుండటమే కాకుండా ముక్కుసూటిగా వుండే అతని మాటలకి ఎవరయినా పడిపోవాల్సిందే. మాట్లాడే సమయంలో అతని మొహంలో కనిపించే సిన్సియారిటీ అతనికి పెద్ద ఎస్సెట్టని చెప్పాలి. మొత్తానికి అతని పోకడ చూసేవాళ్ళకి ఇంకా చూడాలనిపిస్తుంది.

నిటారుగా హుందాగా నడుస్తూ హాల్లోకి దారితీసి, నెమ్మదిగా కార్నర్ వైపున్న టేబుల్ దగ్గరగా వెళ్లాడు వచ్చేపోయేవాళ్ళు తనకి కనిపించేలా ఎంచుకుని. బేరర్ అతని దగ్గరకెళ్ళి మంచినీళ్ళ గ్లాసు అతని ముందుంచాడు. గ్లాసుని చేత్తో తీసుకుని "జీరా రైస్ ఒక ప్లేటూ... గ్రీన్ పీస్ మసాలా ఒక ప్లేటూ, చనామసాలా ఒకటి" చెప్పాడు.

"ఎస్ సర్" వెళ్ళిపోయాడు మర్యాదను హావభావాల్లో వ్యక్తం చేసి బేరర్.

వేడివేడి జీరారైస్ టేబుల్‌మీదకొచ్చింది. దానితోబాటు మిగతావి కూడా వచ్చాయి. వాటిని చూసిన అతను ఒక్కక్షణం ఊపిరి గట్టిగా బరువుగా పీల్చాడు. జీరారైస్‌లో వున్న వేడికంటే అతని రక్తంలో వున్న వేడి అధికమయింది. పెద్దగా ఒక నిట్టూర్పు వదిలాడు. చిన్నప్పటి సంఘటన ఒకటి కళ్ల ముందు తాజాగా మెదిలింది.

బహుశా అప్పుడు అతనికి పది సంవత్సరాలుండవచ్చు ఒకరోజు దుష్యంతరావు కొడుకు ప్రాణేష్‌ని కారులో ఎక్కించుకుని కంట్రీక్లబ్బుకి వెళ్ళాడు. ఇద్దరూ టేబుల్ దగ్గర కూర్చున్నారు. ఫుడ్ ఆర్డర్ చేశాడు దుష్యంతరావు. తండ్రితో మొట్టమొదటిసారి క్లబ్బుకి రావడం చాలా ఆనందం కలిగించింది చిన్న వయసులో వున్న అతనికి. ఆరోజు తన తండ్రి కూడా ఇవాల్టి ఫుడ్డే ఆర్డర్ చేశాడు. చిన్నపిల్లాడయిన ప్రాణేష్ ఆ ఫుడ్డు చాలా ఎన్‌జాయ్ చేశాడు. చివరకి ఐస్ క్రీమ్ కూడా తిన్నారు తండ్రీకొడుకులు. అంతా బాగానే వుంది. తిని బయటికొచ్చారు. పార్కింగ్ ప్లేస్‌కి గార్డెన్‌లోంచి వెళుతున్నారు. గార్డెన్‌లోకి అడుగు పెట్టారో లేదో దుష్యంతరావు కొలీగ్ మాధవశర్మ కనిపించి "హలో దుష్యంతరావుగారూ... ఏంటీ ఇలా వచ్చారూ. డిన్నర్‌కా? మీ అబ్బాయి చక్కగా వున్నాడు" అంటూ పరామర్శించాడు.

"అవునండీ... డిన్నర్‌కి వచ్చాను. మా చుట్టాలొస్తేనూ... వాళ్ళబ్బాయిని సరదాగా డిన్నర్‌కి తెచ్చా క్లబ్బుకి. మావాడు మీకు తెలుసుగా హెచ్.పీ.యస్‌లో మీవాడి క్లాసులోనేకదా చదివేది?" అంటూ "నాన్నా.. నువ్వు రెండు నిమిషాలు ఆ కుర్చీలో కూర్చో నేనిప్పుడే అంకుల్‌తో మాట్లాడి వస్తా" అంటూ కొడుకుని గార్డెన్‌లో వున్న

ఒక కుర్చీలో కూర్చోబెట్టి, ఫ్రెండ్‌తో మాట్లా డసాగాడు కొంచెం దూరంగా వెళ్ళి.

తండ్రి ఆ అంకుల్‌తో తన గురించి చెప్పిన మాటలకి షాక్ తిన్నాడు.

చిన్న ప్రాణేష్. ఒంటరిగా కుర్చీలో కూర్చుని చాలాసేపు ఏడ్చాడు తన తండ్రి తనని పరాయివాడిగా చేసి ఎవరితోనో చెప్పినందుకు. అదీకాక పుండుమీద కారం చల్లినట్టు తన తండ్రికి తను కొడుకు కాదని చెప్పడమే కాకుండా హెచ్.పీ.యస్.లో తన కొడుకు చదువుతున్నట్టు చెప్పిన ఆ మాటలు అతన్ని ఎంతో కుంగదీశాయి. తండ్రిమీద అతనికి కోపం, అసహ్యం కలి గాయి. తొందరగా ఇంటికెళ్ళి, తల్లి ఒడిలో తలపెట్టుకుని తన బాధను చెప్పుకోవాలను కున్నాడు. కాసేపటికి తండ్రి వచ్చాడు. మౌనంగా తండ్రిని అనుసరించాడు కారు దగ్గరికి. తండ్రి మొహం దోషిలా వుంది. కారు బయలుదేరిన కాసేపటికి "నాన్నా... ప్రాణా... ఆ అంకుల్‌తో జోక్‌చేస్తే బాధప డ్డావా? అవతల మాట్లాడుకున్నప్పుడు చెప్పే శాలే జోక్ చేశానని" అన్నాడు దొంగలా తడుముకుంటూ. దుష్యంతరావు చెప్పిన మాటలు ఆ చిన్నమనసుని కన్విన్స్ చేయలే కపోయాయి.

దుష్యంతరావు, కొడుకు ఇంటికి వచ్చారు ఎ.ఎస్.రావునగర్. పద్మిని భర్తకీ, కొడుక్కీ ఫ్రెష్ ఆరంజ్ జ్యూస్ ఇచ్చింది. చల్లటి జ్యూస్ తాగాడేగానీ కడుపులో మంట రగిలి పోయింది తండ్రిమీద ప్రాణేష్‌కి. క్లబ్బులో జరిగిన విషయం తల్లితో చెప్పాలనుకున్నా డుగానీ తల్లి ఒంటరిగా దొరకలా. చూసి చూసి ఎప్పుడు నిద్రపోయాడో తనకే తెలీదు. తెల్లారిన తరువాత తల్లి తన పక్కనే పడుకుని కనిపించింది. తల్లి గుండె మీద తలవాల్చి, రాత్రి జరిగిన విషయాన్ని ఆమెతో చెప్పి భోరుభోరుమని ఏడ్చాడు. రాత్రి భర్తకూడా తనకా విషయం గురించి ఏమీ చెప్పలేదు. అక్కడ ఏం జరిగివుం టుందో చూచాయగా ఆమె వూహించగలి గింది కానీ కొడుక్కి మాత్రం నచ్చచెప్పింది. 'నిజంగానే జోక్ చేసివుండచ్చు ఆయన కొలీగ్‌తో' అని పిల్లవాడికి సర్దిచెప్పిందిగానీ నమ్మించలేకపోయింది. భర్తననుమానిం చింది. కానీ ఏమీ చెయ్యలేని అసహాయ పరిస్థితి ఆమెది. ప్రాణేష్ మనసు చాలా గాయపడింది. పోనీ ఒకవేళ జోక్‌గా అన్నాడే కావచ్చు కానీ హెచ్.పీ.యస్.లో చదివేవాడి గురించి ఎందుకు చెప్పాలని పట్టుబట్టాడు తల్లిని.

ఆఫీసులో వున్న దుష్యంతరావుతో ఫోన్‌లో మాట్లాడింది పద్మిని. జరిగిన విష యానికి కొడుకు చాలా బాధపడి, మనసు చాలా కష్టపెట్టుకున్నాడని, అలిగాడని చెప్పింది. తన కొలీగ్ ఒకే ఆఫీసులో పనిచే స్తుండటంవల్ల తన ఇమేజ్ అందరిలో దెబ్బ తీస్తాడనే ఉద్దేశంతో అలా చెప్పడం జరిగిం దని తన వైపునుంచి సమర్థించుకున్నాడు. హెచ్.పీ.యస్.లో చదివే అతని మొదటి భార్య కొడుకు గురించి ప్రస్తావించకుండా వుంటే బాగుండేదని సలహా ఇచ్చింది. దుష్యంతరావు మూగమనసు దెబ్బతింది. ఏదో సర్దిచెప్పడానికి ప్రయత్నించాడు పెళ్ళా నికి. సాయంకాలం ఆఫీసునుండి ఇంటికి వచ్చిన దుష్యంతరావు కొడుకుని దగ్గరకు పిలిచి కూర్చోపెట్టుకున్నాడు. కాసేపు బుజ్జ గించడానికి ప్రయత్నించాడు. హెచ్.పీ.య స్.లో చదివే అన్న గురించి తను చెప్పినట్లు మమ్మీకి ఎందుకు చెప్పావని చిన్నపిల్లాణ్ణి కసిరాడు. ఏ విషయానికయితే తన మనసు బాధపడిందో ఆ విషయాన్ని గురించి ఆయన బాధపడకపోగా పైపెచ్చు తనకు కలిగిన బాధ తల్లికి చెప్పుకోవడం నేరమని ఆయన కసరడంతో ప్రాణేష్ మనసు మరింత బాధపడింది. ఈసారి తండ్రిమీద కోపం మరింత ఎక్కువయింది. తల్లిమీద కూడా మండింది. ఇంకెప్పుడూ తండ్రితో బయటికి వెళ్ళకూడదని నిర్ణయిం

చుకున్నాడు. కానీ తన ఇష్టంతో తండ్రికి పనిలేదన్న విషయం ఆ చిన్న మనసుకు అప్పటిలో తెలీలా.

ఆరోజు క్లబ్బులో జరిగిన సంఘటన తరువాత ఒకటి రెండుసార్లు మళ్ళీ క్లబ్బుకు రమ్మని పిలిచినా, ఏదోసాకు చెప్పి తండ్రితో వెళ్లడం తప్పించుకున్నాడు ప్రాణేష్. ఆరోజు తండ్రి తనని కసిరిన తరువాత నిర్ణయించుకున్నాడు. తను తొందరగా పెద్దవాడవాలనీ, తనకుగాతనే ఆ క్లబ్బుకెళ్లి, అదే ఫుడ్డు తినాలని. తనెలాగయితే అనుకున్నాడో అదేవిధంగా చేశాడు. పరిస్థితులలా కలిసొచ్చాయి ప్రాణేష్కు.



జీరారైస్‌తో గ్రీన్ పీస్ మసాలా, చనా మసాలా తిన్నాడు తృప్తిగా. ఒక ఐస్ క్రీమ్ కూడా తిన్నాడు కక్షగా. చిన్నతనంలో జరిగిన సంఘటన తనని ఎంతో బాధ పెట్టిందన్న విషయం ఇవాళ గానీ అర్థం కాలేదు. మనసంతా ఎందుకో వెలితయిపోయినట్టూ, జీవితమంతా ఖాళీ అయిపోయినట్టూ ఏదో తెలియని బాధ చోటు చేసుకుంది అతని మనసులో. తల్లి జ్ఞాపకాలు వచ్చినప్పుడు... తల్లి తనకోసం చేసిన ఎన్నో త్యాగాలనూ, తన కోసం పడ్డ ఎన్నో బాధలనూ తలుచుకున్నాడు. కళ్లు చమర్చాయి. నెమ్మదిగా లేచాడు చేతులు తుడుచుకుంటూ. ఇంటికి బయలుదేరాడు.

అది మైసూర్ మహారాజుకి చెందిన రాజ్ మహల్. ఆ రాజ్ మహల్‌ని సందర్శించడానికి దేశవిదేశాలనుండీ ఎంతోమంది జనాలు వస్తుంటారు ప్రతిదినం. ఆ రాజప్రసాదాన్ని తిలకించడానికి రెండు కళ్లు చాలవు. అందులో వున్న రవివర్మ పెయింటింగ్స్ చూడాలంటే అసలు ఎన్ని కళ్లున్నా చాలవు. రవివర్మ చేసిన అందమైన పెయింటింగ్స్‌ను తిలకిస్తున్నారు జనాలు. దేవకి, వసుదేవులున్న కారాగారంలో ఎనిమిది సంవత్సరాల చిన్నికృష్ణుడు నిలబడివున్నాడు. కొడుకుని చూసిన దేవకి ప్రేమలో తన్మయత్వం చెంది, చిన్నికృష్ణుడు తన తల వరకు వచ్చేలా మోకాళ్లమీద నుంచుని, అతన్ని పొదివిపట్టుకుని, అతని లేతబుగ్గల మీద సుతారంగా ముద్దు పెట్టుకుంటున్న దృశ్యమది. వాళ్ళిద్దరి వెనక వసుదేవుడు బలరాముణ్ణి పట్టుకున్న దృశ్యం. ఆ దృశ్యాన్ని రాజారవివర్మ ఎంతో హృద్యంగా చిత్రించాడు. ఆ చిత్రం ముఖ్యంగా తెలిపేదేమిటంటే చిన్నికృష్ణుడు తల్లిదండ్రులకోసం వారున్న చెరసాలకి వెళ్ళడం. ఆ తల్లీకొడుకుల్ని చూస్తూ పరిసరాలని మరచి, రెప్పవాల్చకుండా చూస్తున్న ఆమె వెనకనుంచి ఎవరో వీపు మీద తట్టినట్లనిపించి వెనుతిరిగింది.

"సారీ అండీ మిమ్మల్ని చూడలేదు. పెయింటింగ్స్ చూస్తూ వెనక్కి నడుచుకుంటూ వచ్చేశా. పొరపాటుగా తగిలింది మీకు నా చెయ్యి" అన్న ఆ అపరిచితవ్యక్తి మాటలను విని, అతను చెప్పిన విధానానికి అతని మాటల్లో అబద్ధాలేమీ లేవని నమ్మి, "ఓ... ఫరవాలేదులెండి" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయిందామె. పేరు పద్మిని. విమెన్స్ కాలేజ్‌లో బి.ఎస్.సీ. చేస్తున్న ఆమె కాలేజీ స్నేహితురాళ్లతో కలిసి కాలేజ్

మేనేజ్‌మెంట్ ఏర్పాటుచేసిన ఎక్స్‌కర్షన్‌కు వచ్చింది. ఆరోజు మైసూర్ పాలెస్ చూసే రోజు. మిగిలిన స్నేహితురాళ్లు అక్కడే వున్నా ఎవరిదోవన ఎవరికి నచ్చినచోట వాళ్లుండి, ఎవరి ప్రపంచంలో వాళ్లున్నారు. ఆ సమయంలోనే పద్మిని అక్కడ వుంది.

ఇంకొక గదిలోకి వెళ్ళి అక్కడ వున్న రాజ కుటుంబానికి సంబంధించిన వస్తువులు చూస్తున్నప్పుడు మళ్ళీ ఆమెకు అతను కనిపించాడు. ఆమె అతన్ని చూసింది. ఎందుకో అతన్ని చూస్తే అపరిచితుడిలా ఆమెకు కనిపించలా. తను బాగా ఎరిగున్న వ్యక్తిలా కనిపించాడు. ఆమె కాస్త చొరవ తీసుకుని అతన్ని 'హలో' అంటూ పలకరించింది. ముందు అతను సిగ్గుపడ్డాడు. తరువాత తమాయించుకుని 'దుష్యంతరావండీ నా పేరు. హైదరాబాద్‌లో జె.ఎన్.టి.యూ.లో ఇంజనీరింగ్ చేస్తున్నాను. ఫ్రెండ్స్‌తో ఎక్స్‌కర్షన్‌కి వచ్చా..." అన్నాడు.

"ఓ... మేం కూడా అంతేనండీ. బైదబై నా పేరు పద్మిని" అంటూ ఆమెనామె పరిచయం చేసుకుంది.

పాలెస్‌ని వదిలేలోగా వాళ్లు ఇంకా రెండు మూడుచోట్ల తలవని తలంపుగా ఇంచుమించు అలాగే కలుసుకున్నారు. కంగారుపడిపోయారు. నవ్వుకున్నారు. సిగ్గుపడ్డారు. తత్తరపడ్డారు. బిత్తరచూపులు చూసుకున్నారు. ఒకళ్ల మొహాలు మరొకరు ఎప్పుడు చూసుకున్నా ఉబ్బితబ్బిబ్బయి అబ్బురపడిపోయారు. మొత్తానికి యువతీయువకులు కలిసినప్పుడు, కొత్తగా పరిచయమైనప్పుడు వారిద్దరి మధ్య జరగాల్సిన వింతచేష్టలన్నింటినీ యధావిధిగా వారిద్దరికీ తెలియకుండానే చేశారు. చివరికి ఎవరి బస్సులలో వాళ్లు వెళ్ళిపోయే సమయంలో ఒకరి అడ్రస్సులు ఇంకొకరు ఇచ్చిపుచ్చుకున్నారు. బస్సులు కదిలాయి. ప్రేమ అగాధంలోపడి చెల్లాచెదరయిన వాళ్లిద్దరి మనస్సులు ముక్కలయిపోయాయి. ఇప్పుడు వాళ్లిద్దరూ ఒక విచిత్రమైన మెట్టులోకి అడుగుపెట్టారు. అది ప్రేమ మెట్టు. దానికి ఎల్లలు లేవు. అంతస్థులుండవు. దానికి సరిహద్దంటూ ఏదయినా వుంటే అది ఆకాశమే అవుతుంది. మనుషులిద్దరూ చెరొకళ్లుగా వున్నా వారి మనసుకు చెందిన విరిగిన ముక్కలు అటుదిటూ ఇటుదటూ పరస్పరం మారిపోయాయి. ప్రేమకు సంబంధించిన మజిలీలో ఇది మరొక మెట్టు. మనుషులు, మనసులూ ఈ మెట్టులోకి అడుగుపెడితే ఇక వాళ్ల జీవితాలే ఏకమయ్యేవరకూ ఈ యొక్క ప్రేమశక్తి వాళ్ళనొక పట్టాన బతకనివ్వదు. ఇది ఆనందమయిన అనుభూతే అయినప్పటికీ జీవితాలకు సంబంధించినంత వరకూ ఇదొక దుర్భరమైన పరిస్థితి.

బస్సులు కదిలాయిగానీ వారి ఇద్దరి పరిస్థితీ చాలా కంటకంలా వుంది. వారి మనసులగమ్యం ఒకటే అయినా, బస్సుల గమ్యం ఒకటే అయినా శరీరాలు మాత్రం తీరని వ్యధతో అవిశ్రాంతంగా వున్నాయి. బస్సులతోబాటు పోటీపడి, వారి మనసులు బస్సుల వేగాన్నధిగమించాయి.

★ ★ ★

మనసుంటే మార్గం అదే వస్తుందనే నానుడిని రుజువు చేస్తూ మైసూర్‌లో అయిన వారి పరిచయాన్ని స్నేహంగా మార్చాయి వారి మనసులు. దుష్యంతరావు ఫైనలియర్ బి.టెక్ చేస్తుంటే, పద్మిని రెండో సంవత్సరం బి.ఎస్.సీ. చేస్తున్నది. వారి స్నేహం టాంక్‌బండ్‌వరకూ, బిర్లా గుడి వరకూ, పబ్లిక్‌గార్డెన్స్ వరకూ సినిమాలూ, షికార్లు ఇలా చాలాదూరం వెళ్ళింది. పద్మినిది చక్కటి రూపం. పద్మిని అంటే చిత్తోడ్‌ఘర్ పద్మినిని దృష్టిలో పెట్టుకుని, ఆమె అందచందాలను, గుణగణాలను, తెలివితేటలనూ మనసులో పెట్టుకుని ఆ అపురూప లావణ్యవతిలా తమ పిల్లలు గుర్తింపబడాలనే ఉద్దేశంతో సాధారణంగా







# మృత్యుంజయురాలు

జనైస్ పాపర్డ్ (37) అనే స్కూలు టీచర్ వర్షం పడుతుండగా పార్క్‌లోని ఓ ఇనప వంతెనమీద నడుస్తుంటే అకస్మాత్తుగా ఆమెమీద పిడుగుపడింది. ఆ దెబ్బకి ఆమె మెళ్లోని బంగారుగొలుసు, బ్రాలోని ఇనప సపోర్ట్ వైర్ కరిగిపోయాయి. అదృష్టవశాత్తు ఆమె మరణించలేదు.

ఆమె భర్త తక్షణం ఆమెని హాస్పిటల్‌కి తరలించాడు. డాక్టర్లు ఆమెకి చికిత్స చేశారు. పిడుగు కుడిభుజం కిందిభాగంలోంచి ప్రవేశించి ఆమె పాదాల్లోంచి బయటకు వెళ్ళిపోయింది. ఒంటిమీద దుస్తులు అంటుకుని మండి కాళ్లు, తొడలు బాగా కాలాయి.

ఆమెకి ప్రాణహాని కలగలేదు. ఈ సంఘటన ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో జరిగింది.

పేర్లు పెడుతూంటారు తల్లిదండ్రులు. ఇప్పుడు ఈ పద్మినికి కూడా ఆమె తండ్రి అదే ఉద్దేశంతో పెట్టుంటాడా పేరు. అందులోనూ ఆయన నార్తిండియన్ కాబట్టి. ఈ పద్మిని చిత్తోడ్‌ఘడ్ పద్మినిలా వుండటం మాట అటుంచితే ఇంకో పద్మినిని గుర్తు తెస్తుంది. తిరువాన్కూర్ సిస్టర్స్‌లో రెండో ఆమె పద్మిని 'జిస్ దేశ్‌మే గంగా బెహతీ హై'లో ఓ బసంతీ పవన్ పాగల్... అంటూ పాడి, అశేషప్రజల ఆదరణను తన సొత్తుగా పొందిన పద్మినిని గుర్తు తెస్తుందీ పద్మిని. ఇలావుంటేనే నిజానికి మనకి కూడా సౌకర్యంగా వుంటుంది, ఆమె రూపు రేఖలను వూహించుకోవడానికి అనువుగా. ఈ పద్మినిలో ఆ రాజ్‌కపూర్ పద్మిని పోలి కలుండటం యాదృచ్ఛికం. చక్కటి పసిమి... బొద్దుగా పొందికగా వున్న శరీరం, నిండునవ్వు... చక్కటి ఆడతనం- ఇవన్నీ అతన్ని ఆకర్షించుకుంటే, అతని మంచితనం, రిజర్వ్‌డ్ నేచర్, నిజాయితీ ఆమెను ఆకట్టుకున్నాయి. చురుకయిన అతని కళ్లు, వెడల్పాటి నుదురూ, చక్కటి రూపం ఆమెను మరింత ఆకర్షించుకున్నాయి. అతని మాట తీరుకు, మాట్లాడేటప్పుడు కనబరిచే అతని హావభావాలకు ఆమె ముగ్ధురాలయిపోయింది. మొత్తానికి వారిమధ్య పూవింటివాడు వాడి పనిని వాడు మొదలుపెట్టి ఇద్దరికీ మానసిక విశ్రాంతి లేకుండా చేశాడు.

అతని ఇంజనీరింగ్ అయిపోయింది. ఆమె బి.ఎస్.సీ. కూడా అయిపోయింది. తరువాత దుష్యంతరావుకి ఇ.సి.ఐ.ఎల్.లో మంచి ఉద్యోగం వచ్చింది. ఆమె బి.యస్.సీ. చేసి, పెయింటింగ్ హాబీగా నేర్చుకోవడం మొదలెట్టింది. హాబీని సీరియస్‌గా నేర్చుకుంటూన్నది. అసలు కథ అక్కడే మొదలయింది.

దుష్యంతరావు ప్రేమకథ ఇంట్లో పెద్దవాళ్లదాకా వెళ్లింది. అసలే వాళ్ల కుటుంబం ఉప్పును కూడా కడగనిదే వాడని శ్రోత్రీయ కుటుంబం. తండ్రి జి.యల్.శర్మ ప్రివెంటివ్ మెడిసిన్‌లో సీనియర్ క్లర్క్‌గా. చేస్తూ, నలుగురు పిల్లలు, భార్య, తల్లిని చూసే బరువు బాధ్యతలు మోస్తూన్నాడు. దుష్యంతరావు ఆయనకి పెద్ద సంతానం. మగపిల్లవాడి తరువాత ముగ్గురూ ఆడపిల్లలే శర్మగారికి. గాంధీనగర్‌లో సొంతిల్లు. ఆయన పిల్లలకి ఇచ్చిన ఆస్తి ఏదయినా వుంటే అది వాళ్ల చదువులే. అందరూ బాగా, చదువుకుంటూన్నారు. ఇంటికి పెద్ద కొడుకూ అందులోనూ వంశాంకురం కాబట్టి శర్మగారు దుష్యంతరావుమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. తను రిటైరయ్యేలోపు కనీసం ఒక పిల్లకయినా పెళ్లి చెయ్యగలిగినా మిగిలిన ఇద్దరికీ కొడుకు చెయ్యాలని ఆయన ఊహ. పిల్లల చదువులకి చేసిన అప్పులు కొడుకు తీర్చి, ఇంటిని ఒక కొలిక్కి తెస్తాడని ఆయన నమ్మకం. తీరా ఇంజనీరింగయిపోయి మంచి ఉద్యోగం వచ్చింది గదా సంతోషించుదామనుకుంటే ఇదుగో ఈ ప్రేమాయణంగోల. పోనీ ప్రేమించిన పిల్ల వాళ్ల కులమా అంటే కులమేగాక గోత్రం, భాష అన్నీ వేరు. పద్మిని ఉత్తరప్రదేశ్‌కి చెందిన కాయస్థ కులానికి చెందినపిల్ల. తల్లి లేదు. ఒక తమ్ముడు. తండ్రి నారాయణ్ దత్ పెద్ద బిజినెస్ మాన్. రాణీగంజ్‌లో ఆయనకి ఒక పెద్ద క్లాత్‌మిల్ ఉంది. బాగా ఆస్తి సంపాదించి, బషీర్‌బాగ్‌లో దేవేంద్రభవనంలాంటి ఇల్లు కట్టుకుని సెటిలయ్యాడు. ఆ రోజుల్లోనే ఆయనకు ఒక ఎంబాసిడర్, ఒక ఫియట్ పద్మిని వుండేవి. ఫియట్‌ని ఆ రోజులో ప్రీమియర్ పద్మిని అనేవాళ్లు.

★ ★ ★

పద్మినిని పెళ్లి చేసుకుంటానని దుష్యంతరావు చెప్పినప్పుడు శర్మగారు మండిపడ్డాడు. ఆమె తన కులానికి చెందనిది కావడంవల్ల మిగిలిన ఆడపిల్లలకు పెళ్లిళ్లు కావని చికాకుప

డ్డాడు. ఆయనకి బీరకాయపీచు చుట్టరికంలో వరసకి చెల్లెలు ప్రభావతి గురించి తరచూ ప్రస్తావించడం మొదలెట్టాడు. నోరెత్తితే "పాపం ప్రభావతి ఎంతమంచిది. ఎంత యోగ్యురాలు, ఎంత ఉత్తమ ఇల్లాలు... భాస్కరం బావని ఆ రోజుల్లో వాళ్ల వూర యిన పెదనందిపాడులో రజాకార్లు క్రూరంగా చంపేస్తే పసిపిల్లలతో ఎంత అవస్థలు పడింది అది. ఎన్ని అష్టకష్టాలు పడింద‌ది. పాపం బావ! భాస్కరం బావ నా చదువు ఎఫ్.ఏ కోసం ఫీజుకట్టాడు. నా దగ్గర డబ్బులేదని చెబితే బాధపడకురా లక్ష్మీ (లక్ష్మణశర్మ) నేనున్నాగా నేకడతాలే. నువ్వు బాగా చదువుకుని వృద్ధిలోకి రావాలని నన్ను ఎంత ప్రోత్సహించేవాడు. ఆ రోజు నాకు ఇప్పటికీ బాగా గుర్తు... కాలేజీ ఫీజు తెచ్చి నన్ను సైకిల్ మీద కూర్చోబెట్టుకుని పొన్నూరుదాకా తీసికెళ్లి కాలేజీలో చేర్పించి భావన్నారాయణ హోటల్లో ఇడ్లీ పెట్టించాడు కడుపు నిండా. ఆయన చేసిన సహాయంవల్లే నేని వ్వాళ ఉద్యోగంలో వుండి నాలుగు రాళ్లు సంపాదించుకుని మిమ్మల్నందరినీ చూసుకోగలుగుతున్నాను నా కాళ్లమీద నేను నిలబడి. ఒరేయ్ అబ్బాయ్.. చూడు ఇప్పటికీ మించి పోయిందేమీ లేదు, నువ్వు మన ప్రభావతత్తయ్య కూతురు మోహినిని పెళ్లి చేసుకుని భాస్కరం మామయ్య ఋణం తీర్చుకో. నన్ను ఋణ విముక్తుణ్ణి చెయ్యరా. ఆల్ రెడీ నేను ప్రభావతత్తయ్యకి మాట కూడా ఇచ్చేశా. మా వాడి చదువు పూర్తయి, వాడికి మంచి పోస్టింగ్ రాగానే నీ కూతుర్ని నా కోడలిగా నా ఇంటికి తెచ్చుకుంటానే. నువ్వు దిగులుపడకు అని" శర్మగారు కొడుకు దగ్గర మాట్లాడాల్సినవీ, చెప్పాల్సినవీ అన్నీ చెప్పేశాడు.

యుక్తవయసుకొచ్చిన ఒక బాధ్యత తెలిసిన కుర్రాడి లేత మనసులో బాధ్యతలనే ముళ్లని ఒకదాని తరువాత మరొకటి నాటేశాడు గబగబా. మాటకి ముందు ఆయన నోట్లో నుంచీ తరచుగా వచ్చే మాటలు ప్రభావతత్తయ్య.. భాస్కరం మామయ్య పెదనందిపాడు, రజాకార్లు, పసిపిల్లలు, బాధ్యతలు, ఎఫ్.ఏ చదువు ఫీజు, సైకిల్ మీద పొన్నూరు... కొడుకును అడకత్తెరలో పెట్టేశాడు తండ్రి సెంటిమెంటుతో.

కొడుకు మెతకతనం, మంచితనం శర్మగారి చాదస్తానికి సునాయాసంగా బలయిపోయాయి. తల్లిద్వారా తండ్రికి చెప్పించడానికి చేసిన శతవిధాల ప్రయత్నాలు విఫలమైనాయి. దుష్యంతరావు బాధపడ్డాడు. తండ్రి ప్రభావతత్తయ్యకు మాటిస్తే నేను కూడా పద్మినికి మాటిచ్చాను. మరి నా మాటో? అనుకున్నాడు మనసులోనే. కానీ ఆ మాటలు ఆ ఇంటి గోడల్లో ఎప్పటికీ ప్రతిధ్వనిస్తాయనే ఆశలేదు. పద్మినికి అసలెలా చెప్పాలో తెలీలా. అసలామె మొహం తనెలా చూడాలో... తనను ప్రాణంకంటే అధికంగా ప్రేమించే ఆమె అమాయకమైన కళ్లని ఎలా ఎదుర్కొవాలో తెలీక సతమతమయ్యాడు. అతనికి చేతనయిన ప్రయత్నాలన్నింటిలోనూ విఫలుడయ్యాడు దుష్యంతరావు. అనుభవంలో ముదితేలిన శర్మగారు చివరి అస్త్రంగా ప్రయోగించాడు ఆత్మహత్య అనే బ్రహ్మాస్త్రాన్ని. దానితో ప్రేమ దయ్యం వదిలిపోయింది అపర దుష్యంతుడికి.

మోహిని మెళ్లో మూడుముళ్ల వేయించాడు శర్మగారు దుష్యంతరావుచేత. దుష్యంతరావుకి ఒక పీడా విరగడయింది. తండ్రి కనిపిస్తే చాలు ఆయన నోట్లో నుంచీ రొటీన్ మాటలు ప్రభావతత్తయ్య, భాస్కరంమామయ్య. రజాకార్లు సైకిల్ మీద పొన్నూరు, ఎఫ్.ఏకి ఫీజు...

కానీ అతని పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయింది. పద్మిని దృష్టిలో అతను నయవంచకుడు. తడిగుడ్డలతో గొంతులు కోసేవాడు. ఏ మెతకతనం ఏ మంచితనం దుష్యంతరావు తండ్రికి వరాలయ్యాయో ఆ మంచితనం, మెతకతనం పద్మినిపట్ల శాపాలయ్యాయి. అతని మంచి స్వభావానికి

ఆనందించాలో ఆత్మహత్య చేసుకోవాలో అర్థంగాలా ఆమెకి. విలపించింది. బావురుమంది. దుష్యంతరావుకిచ్చిన తన మనసు అతని మెత్తనికత్తితో తునాతునకలయిపోయింది. ఒకప్పుడు ఆమె ప్రపంచమంతా దుష్యంతరావుతో నిండిపోయింది. ఇప్పుడు తనకిలేని దుష్యంతరావుని తలుచుకుంటే ప్రపంచమంతా శ్మశానవాటికలా నిర్జీవంగా వుంది. గుండెల్లోని మంటల్ని మరింతగా ఎగదోస్తూన్నది ఆ శ్మశానం. దుష్యంతుడనే పేరులోనే వున్నదా వంచన. దుష్యంతుడనే పదానికి పరిభాష నయవంచనా అనే అనుమానంతో ఆత్మని ఆహుతి చేసుకుంటూన్నది. తిండి, తిప్పలు మానేసింది. చిక్కిశల్యమయింది. అంత డబ్బున్నా ఆమె తండ్రి ఆమెకు కావలసిన సంతోషాన్ని కొనివ్వలేని పరిస్థితిలో పడిపోయాడు. కన్నకూతురి పరిస్థితికి ఎలా స్పందించాలో పాలుపోవడంలా.

సంవత్సరం గడిచిపోయింది. ఆ సంవత్సరం ఆమెకి అతి దుర్భరమైన రోజులు. ఒక్కోరోజు ఒక్కో యుగంలా గడిపింది. మనోవ్యాధికి లోనయింది. ఇప్పుడు కనిపించే పద్మిని ఆ రాజ్‌కపూర్ పద్మిని కాలిగోటి అందం కూడా చెయ్యదు. నక్క, నాగలోకంలా అయింది ఈనాటి పరిస్థితి. చూపుల్లో పిచ్చివాలకం. మనిషి వాలకం కూడా పిచ్చిగా అయింది. దుష్యంతరావు ధైర్యం చేశాడు ఒకసారి పద్మినిని చూడాలని. అతని మంచితనం మరోసారి పద్మిని వైపు తిరిగింది. దానితో అతని ప్రవర్తనలో ఎంతో మార్పు కలిగింది. రెక్కలు కట్టుకుని పద్మిని దగ్గరకొచ్చి వాలాడు. మొదట ప్రియుణ్ణి చేజారవిడుచుకుని అసలే జీవచ్ఛవంలా మారిన ఆమెను తండ్రి మరణం మరీ మతిలేనిదాన్ని చేసింది. ఆ సమయంలో వచ్చిన దుష్యంతరావు ఆమె దయనీయమైన పరిస్థితికి ప్రకంపించిపోయాడు. అతనిలోని మానవత్వం అతను చేసిన పనికి అతన్ని నిలువునా నిలదీసింది. ఎప్పటికీ తనకు కనిపించదనుకున్న తన ప్రియాతిప్రియుడు దుష్యంతరావు కళ్ల ఎదుట కనిపించడాన్ని నమ్మలేకపోయింది. బహుశా చరిత్రలోని శకుంతల, తనకి తీరని మనస్తాపాన్ని, అవమానాన్ని కలగజేసిన దుష్యంతుడు ఆమెను ఏలుకోవడానికి అతని సంకల్పాన్ని ఆమెకు తెలియజేసినప్పుడు కూడా ఇంత ఆనందించి వుండదేమో. ఆమెను చూసిన దుష్యంతరావుకు మతిపోయింది. ఆ సమయంలో అతను ఏం చేస్తూన్నాడో ఏం మాట్లాడుతున్నాడో అతనికే తెలీలా. తను ప్రియాతిప్రియంగా ప్రేమించిన అందాల రాణి పద్మిని చిక్కిశల్యమై ఎముకల బొమ్మలాగయి పేలవంగా అయిపోయిన ఆమెను అక్కున చేర్చుకున్నాడు. జడివానకి... సుడిగాలికి గమ్యం తెలీక రెపరెపలాడే తీగకు, వాడి వడిలి నిస్సారమైన లతకు గడకర్ర అనే ఆలంబన దొరికితే దాన్నెలా పెనవేసుకుంటుందో అలా పెనవేసుకుంది దుష్యంతరావుని పద్మిని. అదే ప్రేమంటే. నిజమైన ప్రేమకు పగ, ద్వేషం, ప్రతీకారం, అవమానం, మానం, సిగ్గు, లజ్జ లాంటి సరిహద్దులేమీ వుండవు. ఆ ప్రేమ ఎంతో నిష్కల్మషమైంది. ఆది అంతాలుండవు ప్రేమకి. దుష్యంతరావు చేసిన అంత అనర్థమైన పని ఆ నిముషంలో ఆమెకు గుర్తురాలా. తన పాత దుష్యంతే తన దగ్గరకొచ్చాడనుకొని ఆనందంతో వర్తమానాన్ని మరచిపోయింది. ఆవేదన, ఆనందం రెండూ వారిద్దరి మనసుల్లో ఏకమయి, ఒకళ్లఒడిలో ఒకళ్లు తలదాచుకుని భోరున విలపించారు కాసేపు. ఆమెను బయటకు తీసుకువెళ్లి కాస్త మంచి వాతావరణంలో తిప్పి ఆహ్లాదకరమైన చోట్ల తిప్పి, హోటల్లో భోజనం చేయించి సాయంకాలం వరకు ఆమెను నీడలా అంటిపెట్టుకుని ఆమెను బుజ్జగించి పసిపిల్లను సముదాయించినట్లు సముదాయించాడు. ఇంకెప్పుడూ ఆమెను

వదలనని మాటిచ్చాడు. దుష్యంతరావు మంచితనం ఏమిటో అతని తండ్రి శర్మగారికేకాదు తెలిసింది పద్మినికి కూడా బాగా తెలుసు. అందుకే అతని మాటలు నమ్మింది.

ప్రపంచమన్న తరువాత మనుషులుంటారు. ఆ మనుషుల్లో అనేక రకాలవాళ్లు, మంచివాళ్లు, చెడ్డవాళ్లు, చేతకానివాళ్లు, అసమర్థులు, అతితెలివిగలవాళ్లు ఇలా వుంటారు. సాధారణంగా మనుషులన్న తరువాత మోసాలు కూడా జరుగుతూనే వుంటాయి. ఆ మోసాన్ని చవిచూసిన మనుషులు బాధపడతారు. ఇలా బాధపడటం ఎప్పుడు జరుగుతుందంటే మంచివాళ్లనుకొన్నవాళ్ల దగ్గరనుంచీ మోసం బుసకొట్టినప్పుడు. దుర్మార్గుడనుకున్నవాడు మోసం చేసినా నాలుగు రోజులు బాధపడతాం. కాని ఎక్కడొస్తుందంటే బాధ మనం మంచివాళ్లని ఎవరికయితే కితాబులిచ్చి ఎవరి మంచితనాన్నయితే మనం మన మనసుతో చూస్తామో వాళ్లనుంచీ మోసం ఎదురయినప్పుడు కుంగిపోతాం. పద్మిని విషయంలో కూడా అదే జరిగింది. ఆమె ప్రేమించింది ఒక తుచ్ఛుణ్ణో, ఒక క్రూరుణ్ణో, ఒక దౌర్భాగ్యుణ్ణో అయితే ఆమెకంత బాధ, గుండెకోత వుండేది కాదు. దుష్యంతరావులాటి వ్యక్తి తన ఊహాపథంలో అందనంత ఎత్తుకెదిగిన అలాటి వ్యక్తినుంచి వూహించని విధంగా దెబ్బతినడంతో ఆమె ఆ బాధను తట్టుకోలేకపోయింది. ఇప్పుడు దుష్యంతరావుని పూర్తిగా నమ్మటం మొదలెట్టింది.

పద్మిని శరీరంలో నుంచి పోయిన ప్రాణాలు కాస్తకాస్త నెమ్మదిగా రావడం మొదలెట్టాయి దుష్యంతరావు రాకతో. ప్రేమ అనేది మనిషికి ఒక సంజీవిని మంత్రంలాటిదని పద్మిని విషయంలో మరోసారి ఋజువయింది. రోగిగా మారిపోయిన పద్మినికి ఆమె ప్రాణాలను కాపాడే సంజీవిని దుష్యంతరావయ్యాడు. రోజులు గడుస్తోన్నకొద్దీ పద్మినిలో ఆరోగ్యం కుదుటపడటం మొదలయింది. తిన్న తిండి ఒంటపడుతోంది. నెమ్మదిగా పాత పద్మినయిపోయింది. ఆ రాజ్‌కపూర్ పద్మిని పోలికలు ఈ పద్మినిలో కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి దుష్యంతరావు సేవలతో.

★ ★ ★

కాలచక్రం గిర్రున తిరిగింది. చూస్తూండగానే ఒక సంవత్సరం గడిచిపోయింది. ఈలోపు దుష్యంతరావు తండ్రి శర్మగారు చెయ్యాల్సిందిచేసి, ఇంకేదీ లేనట్టు అనంత వాయువుల్లోకి కలిసిపోయాడు. బిడ్డొచ్చిన వేళ గొడ్డొచ్చినవేళ అన్నట్టు మోహిని వచ్చి సంవత్సరం తిరగకముందే ఇంటికి పెద్దవాడయిన ఆయన కాస్తా పోయాడు. మనసులో ఈ అనుమానం వచ్చినా నోరు మెదపడానికి సాహసించలేకపోయింది శర్మగారి భార్య. కొడుకు దుష్యంతరావు మనసులో విషంలా పాతుకుపోయి, ఆ పిల్లను సరిగా చూసుకోడేమో అసలే వాడి ప్రేమ విఫలమయింది లోగడ అనుకున్నదామె. తండ్రి పోయిన తరువాత ఇంటి బాధ్యతల భారం, తల్లి భారం... ఇప్పుడు పద్మిని భారం అన్ని భారాలూ దుష్యంతరావు మీద ఒక్కసారిగా బరువుగా పడిపోయాయి. ఇన్ని బరువు, భారాలున్నా అతని మనసుకు నచ్చిన పద్మినితో గడిపిన సమయం అతనికి స్వాంతన నిస్తుంది. ఆ విషయం అతనికీ తెలుసు. ఆమె బాధ్యతకూడా పూర్తిగా తనే తీసేసుకుంటే సరిపోతుంది. పద్మినికి కూడా మనసులో అనుమానాలు, భయాలు వుండవని రహస్యంగా ఆమెని గుళ్లో పెళ్లి చేసుకున్నాడు. ఆమెకు వున్నది ఒక్క తమ్ముడే కాబట్టి ఇంట్లో ఎవరి అనుమతుల ప్రమేయం కూడా అవసరం లేకపోయింది. బషీర్‌బాగ్‌లో తండ్రి కట్టించిన అంత గొప్ప భవనాన్ని వదిలి తను నమ్ముకున్న వ్యక్తితో నడిచింది ప్రేమ జీవితాన్ని గడపడానికి. చట్టరీత్యా, సంఘరీత్యా ఆమె అతనికి భార్య

కాదని ఆమెకు తెలుసు. కానీ తను అతనికోసం మంచానపడిన సందర్భంలో ఈ చట్టం, ఈ సంఘం తనను ఆదుకోలేకపోయాయి సరికదా అసలామె అంత అనారోగ్యంలో చిక్కుకున్న విషయం కూడా బయట మానవమాత్రుడికి తెలీలా. దుష్యంతరావే ఎలాగో తెలుసుకుని తనంతట తనే ఆమెకోసం వచ్చి ఆమెను మామూలు మనిషిని చేశాడు. అందుకే దుష్యంతరావుపట్ల ఆమెకంత గురి. అతను ఆమెను కాపాడుకుంటాడన్న నమ్మకం ఆమెకు నూటికి నూరుపాళ్లువుంది. అందుకే చట్టరీత్యా ఆమె అతనికి భార్య కాకపోయినా అతడు ఆమెకి భర్త అని ఆమె నమ్మకం. అతనికోసమే ఆమె మూలపడింది. అతనే వచ్చి ఆమెను కాపాడుకున్నాడు. అప్పుడే ఆమెకు విశదమయింది. ఆలంబనకి లత అవసరంలేదనీ, లతకే ఆలంబన అవసరమని.

★ ★ ★

దుష్యంతరావు ఎ.ఎస్.రావునగర్‌లో ఆఫీసుకి దగ్గరలో ఒక అద్దె ఇల్లు తీసుకుని దానిలో పద్మినిని పదిలంగా పెట్టాడు. తల్లినీ, అంతకుముందు చేసుకున్న భార్య మోహినినీ, ముగ్గురు చెల్లెళ్లనీ నెమ్మదిగా గాంధీనగర్ నుంచీ ఖాళీ చేయించి గాంధీనగర్‌లోవున్న ఇంటిని అమ్మి, ఆ డబ్బుతో సైనిక్‌పురిలో ఒక ఇంటిని కొని వాళ్లందరినీ దానిలో వుంచాడు. రెండు ఇళ్లలోనూ ఏలోటూ లేకుండా చూసుకోవడం మొదలుపెట్టాడు. పద్మినిని పెళ్లి చేసుకోవడానికి కాస్తముందు దుష్యంతరావు మోహినిద్వారా ఒక మగపిల్లవాడికి తండ్రి అయ్యాడు.

దుష్యంతరావు ప్రేమ వ్యవహారం, మళ్లీ పద్మినితో కలసి జీవితాన్ని ప్రారంభించిన విషయం అతని తల్లికి తెలిసింది. ఆమె చాలా బాధపడింది. కానీ భర్త లేకపోవడం వల్ల కుటుంబభారాన్ని మోసే కొడుకుని మాటలతో బాధపెట్టలేకపోయింది. పద్మినిని ప్రేమించిన రోజుల్లో ఆమెని అతను పెళ్లి చేసుకుంటాననడం, భర్త మొండివాలకం, కొడుకు ఆ పిల్లకోసం పడిన బాధ, భర్త పంతం అన్నీ చూసిన ఆమె అతని మనసులో పద్మినికి వున్న స్థానం ఎంతటిదో ఎరగనిదికాదు. అలాగని కొడుకు చేస్తున్న పని ఆమెకు నచ్చడంలేదు. కోడలి కాపురంలో నిప్పులు రాజుకోవడం, అందులోనూ పెళ్లి అయి మనవడు పుట్టి ముద్దూ ముచ్చటలు సరిగా తీరకుండానే ఇదొక పెద్ద సమస్య వచ్చిపడింది. ఈ విషయం బయటకి పొక్కితే తన కూతుళ్లకి ఎక్కడ పెళ్లిళ్లు కావోనని అనుక్షణం టెన్షన్‌లో గడపడం మొదలెట్టింది. కొడుకు మంచి మూడ్‌లో వున్నప్పుడు చూసి అతని దగ్గర మాట తీసుకుంది ఈ విషయాన్ని బయటికి తెలియనివ్వనని.

★ ★ ★

వ్యవహారాన్ని ఆనోటా ఈనోటా విన్న మోహినికి పరిస్థితి అంతుపట్టడంలా. భర్త ప్రవర్తనకి ఏం చెయ్యాలో ఆమెకు ఒక పట్టాన అర్థం కాక చంటిపిల్లాడి ఆలనాపాలనలో సరిగా శ్రద్ధ చూపలేక టెన్షన్ తట్టుకోలేక చివరికి తల్లిని పిలిపించింది మధ్యవర్తిత్వానికి. జరిగిన విషయాన్ని కూతురు ద్వారా తెలుసుకున్న ప్రభావతమ్మ కూతురి కాపరం చూసి ఆనందించాలో అల్లుడి రెండో సెటప్పు చూసి బాధపడాలో తెలీక తికమకలో పడిపోయింది. దుష్యంతరావుని చిన్నప్పటినుంచీ చూస్తున్నదయినా ఇప్పటి దుష్యంతరావు వేరు. చదువు, హోదాతోబాటు అన్నీ మారిపోయిందేగాక అల్లుడి హోదాలో అతను ఎవరికీ ఏదీ లోటు చెయ్యటంలేదు. తన కూతురి పెళ్లికి లక్ష్మణశర్మ వుండి అన్నీ ఆయనే చూసుకున్నాడు తనకేదీ ఇబ్బంది లేకుండానే. వయసులో తనకంటే చిన్నవాడయినా పెళ్లి విషయంలో అన్ని విషయాలూ పెద్దదిక్కులా చూసుకున్న తమ్ముడు, అతని కొడుకు ఇప్పుడు ఆమెకి అల్లుడి హోదాలో వుండి కూతురిని

ఇంత అన్యాయం చేస్తుంటే ఏం చెయ్యాలో ఆమెకేదీ పాలుపోవడంలా. ప్రస్తుత పరిస్థితిలో అల్లుడితో రాజీపడటం తప్ప మరో మార్గం లేదని నిర్ణయానికొచ్చింది. పిల్లలు పుట్టిన తరువాత మొగాడికి దూరమయిన ఆడదాని బతుకు చిరిగిన విస్తరవుతుందనే నగ్నసత్యం ఆమెకు బాగా తెలుసు. అదీగాక ఏదో అల్లరి చిల్లరవాడయితే అనుకోవచ్చు దుష్యంతరావులాటి మంచివ్యక్తి, తన అల్లుడిలాటి పని చేశాడంటే చిన్న విషయం కాదు. అతనివైపునుంచీ బలీయమైన కారణాలుండవచ్చని ఆమె అనుమానం. మొత్తానికి కూతురికీ సర్దిచెప్పింది కొంతకాలం ఓర్చుకోక తప్పదని. అల్లుడికేదయినా చెబుదామన్నా అతనితో ఏదయినా మాట్లాడదామన్నా అతను అత్తగారికి అలాంటి అవకాశాలేవీ ఇవ్వలేదు. విషయాన్ని చూచాయగా గ్రహించి. ఆ ఒక్క విషయం తప్పించి తన కూతురు అత్తగారింట్లో మహారాణిలా వుందని ఆమెకి బాగా తెలుసు.

ఎందుకయినా మంచిదని వియ్యపురాలి దగ్గరకొచ్చి "మనం మనం ఒకటి. తమ్ముడు లక్ష్మి వున్న రోజుల్లో నా కూతురి గురించి బాధపడలేదు. ఇప్పుడు మీ సంరక్షణలో వున్నప్పుడూ బాధపడటంలేదు నేను. నా బిడ్డని నీ కడుపులో పెట్టుకుని చూసుకో వదినా" అంటూ బావురుమంది.

"మోహిని నీకు కూతురుకాదు నాకు కోడలు. దాని గురించి నువ్వేమీ దిగులుపడాల్సిన అవసరంలేదు వదినా. నేను ఆడదాన్నికాదా? నాకు మాత్రం ఆడపిల్లలు లేరా నీ చాదస్తంగానీ. పిచ్చిదానా వూరుకో" అంది దుష్యంతరావు తల్లి.

"నువ్వు, అల్లుడు చాలా మంచివాళ్లు. నా ప్రారబ్ధమిలావుంటే ఎవరు మటుకు ఏం చేస్తారు? మనవడితో ఆనందంగా అయిదు నిముషాలన్నా ఆడుకునే అవకాశం కుదరలేదీ మానసిక ఆందోళనలో. ఇవి చేతులు. కాదమ్మా వదినా కాళ్లు" అంటూ మళ్లీ బావురుమంది ప్రభావతమ్మ. వియ్యపురాలిచ్చిన భరోసాతో తిరిగి వెళ్లిపోయిందావిడ.

★ ★ ★

దుష్యంతరావుకి ఆఫీసులో పని ఎక్కువయింది. అందులోనూ అతను క్లాస్‌వన్ ఆఫీసరవడంవల్ల బాధ్యత కలిగిన పోస్టవడంవల్ల ఆఫీసులో పనులతో సతమతమవుతున్నాడు. ఆఫీసవగానే అటునుంచి అటే పద్మిని దగ్గర కెళ్లి ఆమెతో కొన్ని గంటలు గడిపి అర్ధరాత్రో అపరాత్రో ఇంటికి పోయేవాడు. నిజానికి అతనివల్ల అతనికిగానీ ఇతరులకి గానీ ఎవరికీ ఆనందం లేదు. ఇంట్లోంచి ఉదయాన ఆఫీసుకని వెళ్లిన మనిషి రాత్రెప్పుడో రావడం, తెల్లారిలేచీ లేవగానే పరుగులు పెట్టడం. భోజనం కూడా ఇంట్లో చెయ్యడం అరుదయిపోయింది. ఆఫీసులో మంచి భోజన సదుపాయం వుండటంవల్ల రాత్రి భోజనం పద్మినితో చెయ్యడంవల్ల పేరుకే అతనికి ఇల్లు అది. అలాగని పద్మిని ఇంట్లో వుంటాడా అంటే అసలామాటే అనుకోవడానికి వీలులేదు. ఏదో చుట్టపుచూపుగా సాయంకాలం వచ్చి రాత్రికి వెళ్లే మనిషితో ఏమానందం వుంటుంది? ఏదో పేరుకి విడిగా లేరనేపేరు తప్పించి ఆమె అతన్ని పొందికూడా తను అతని మనిషననిపించుకున్నదేగానీ అతన్ని తనవాడుగా చేసుకోలేకపోయింది. అతని ఇంట్లోవాళ్లకి కనీసం అతని మనుషులుగా సంఘంలో గుర్తింపు వుంది. ఆమెకది కూడా లేదు. అలాగని అతనులేని జీవితాన్ని ఆమె వూహించుకోను కూడా వూహించుకోలేదు. అదెంత నరకమో ఆమె అనుభవపూర్వకంగా ఆల్‌రెడీ చవి చూసింది. మంచానపడ్డది. జీవితానికి సరిపడా అనుభవించింది నరకయాతన. దుష్యంతరావు అటు మోహిని దగ్గర దోషి, ఇటు పద్మినిదగ్గర దోషి. నిజానికి అతని జీవితం అందరికంటే దారుణంగా వుంది. ఏ భార్యకీ న్యాయం చెయ్యలేకపోతున్నాడు. ఎవరినీ బాగా చూసుకోలేకపోతున్నాడు. ఊ

అంటే ఒకళ్లకి కోపం ఆ అంటే ఇంకొకళ్లకి కోపం. ఒక్కోసారి అతను భోజనం చెయ్యక పోయినా అడిగే వాళ్లెవరూ వుండరు. ఎందుకంటే ఎవరికివాళ్లు రెండో చోట తిన్నాడని అనుకోవడం జరుగుతుంది. ఉండటానికి పేరుకి రెండిళ్లున్నా అతనికి ఒక్కోసారి పస్తులుండటం తప్పడంలేదు.

పద్మిని విషయం మరీ దారుణంగా వుంది. తను ప్రేమించిన వాడికోసం అందరినీ ఒదులుకుని వచ్చి ఇక్కడ అనామకమైన బతుకు బతుకుతోంది. ఆ బతుక్కి ఒక ఎదుగూబొదుగూ లేదు. ఖాళీగా వుంది కదా పోనీ ఏదయినా ఉద్యోగం చేస్తానంటే చెయ్యనివ్వడు కట్టుకున్నవాడు. ఆమె కష్టపడటం అతనికి ఇష్టంలేదట. మోహిని పరిస్థితి కూడా అంత మెరుగ్గా ఏమీలేదు. మొత్తానికి ముగ్గురి పరిస్థితీ ముళ్లకంపలా తయారయింది. ముగ్గురిలో ఏ ఇద్దరూ కలసి వుండలేని జీవితం. అలాగని విడిగానూ వుండలేరు. ఎవరికీ మనశ్శాంతి లేదు. ముగ్గురిలో ఎక్కువ నష్టం పద్మినికి. కానీ ఆమె సంఘం దృష్టిలో ప్రతినాయిక. ఇలాటి ముళ్లకంప జీవితాన్ని ముగ్గురిలో ఎవరూ కూడా కావాలని కోరుకోలేదు. వాళ్లెవ్వరికీ తెలియకుండానే ముగ్గురిమీదా బలవంతంగా రుద్దబడింది. భగవంతుడు ఆడే ఆటల్లో వీళ్లు పాత్రధారులు మాత్రమే. అసలు సూత్రధారి తనే అని నిరూపించాడు భగవంతుడు.

★ ★ ★

పెళ్లయి సంవత్సరం తిరక్కుండానే పుట్టాడు మగబిడ్డ పద్మినికి. ఆమె ఆనందానికి అవధులు లేవు ఆ సమయంలో. తనతో ఎప్పుడూ జీవితాన్ని గడపలేని తన దుష్యంతుణ్ణి కనీసం కొడుకులోనయినా చూసుకోవచ్చని ఉవ్విళ్లూరింది. పొత్తిళ్లలో వున్న కొడుకుని నర్సు ఆమెకి చూపించితే చూసుకుని మురిసిపోయింది. ఆమె మొహం విజయగర్వంతో ఒక్కక్షణం నాట్యం చేసింది. పక్కనున్న భర్తని కృతజ్ఞతతో చూసి కళ్లలో నీళ్లు నింపుకుంది. దుష్యంతరావు గర్వంతో చూసుకున్నాడు కొడుకుని. పసికూనలావున్న కొడుకుని తనివితీరా చూసుకుంది. ఆ సమయంలో ఆమెకి మైసూర్‌పాలెస్‌లోని ఆర్ట్‌గ్యాలరీ, దానిలోవున్న చిన్న కృష్ణుడి పెయింటింగ్ గుర్తుకొచ్చాయి. నిజానికి ఆ చిన్న కృష్ణుడే కదా వాళ్లిద్దరి కలయికకి కారణం అనుకుంది. దుష్యంతరావుని కళ్లారా చూసుకుంది. నిజానికి అప్పటి దుష్యంతకంటే ఇప్పుడు తన కళ్లెదుట వున్న దుష్యంత్ చాలా అందంగా కనిపించాడు. కాస్త ఒళ్లు చేసి హుందాతనంతో అందంగా నిండుగా కనిపిస్తున్నాడు. ఇంత అందమైన కొడుకుని తనకిచ్చినందుకు అతని గుండెలో తలపెట్టి అతనికి థాంక్స్‌చెప్పింది. అతను భార్యను గుండెలకి హత్తుకున్నాడు. సుతారంగా తల నిమిరి, ఆమెను దిండుమీద పడుకోబెట్టాడు. అతనిలోని ఇలాటి కన్‌సర్న్ ఆమెకి చాలా ఇష్టం. ఎక్కడో తెలీని ప్రేమ. అతనికి ఆమె పట్ల వున్న అనురాగం అతని మాటలతో ఎప్పుడూ చెప్పలేదు. అతనికి చేతకాదు కూడా. కేవలం అతని కళ్లలోనే ఆమె ఆ ప్రేమను చూడగలదు, . పొందగలదు. ఆ ప్రేమకోసం ఆమె చేసిన త్యాగాలు ఆమెకి లెక్కలేనివి. విలువలేనివి. తన ప్రాణానికి ప్రాణమైన దుష్యంత్ తనకిచ్చిన చిన్నికానుక ఆ పొత్తిళ్లలోని చిన్న ప్రాణం. ఆ చిన్న ప్రాణం ఆమెకు చిన్న కృష్ణుడిలాగా ఒకసారి చిన్న దుష్యంత్‌లాగా ఒకసారి పరిపరి విధాల కనిపిస్తుంది. ఏదో తెలియని ఓ అనుభూతి.

"మీరు నాకు ప్రాణమైతే ఆ ప్రాణంతో ప్రాణాలు పోసుకున్న ఈ చిన్న ప్రాణం ఇక నుంచీ మన ఇద్దరికీ ప్రాణం. అందుకే వీడికి ప్రాణేష్ అని పేరు పెట్టాలని వుంది దుష్యంత్. ఏమంటారు?" స్వప్నలోకాల్లో విహరిస్తూ చెబుతున్న ఆమె మాటలు రెప్ప

వాల్చకుండా వింటూ ఆమెనే చూస్తున్నాడు.

నిజంగా ఇంతగా ప్రేమించే ఈమెకు భర్తనవడానికి నేనెంత పుణ్యం చేసుకున్నాను అనుకున్నాడు లోలోపల.

"ఏంటి... ఏంచెప్పరు? " అడిగింది.

"నీఇష్టం మినీ" అన్నాడు. అతను ఆ పేరుతో ఆమెను సంబోధించాడంటే అతనికి ఆమెమీద విపరీతమైన ప్రేమపుట్టిందని అర్థం. ఆమెమీద ఎక్కువప్రేమ కలిగినప్పుడే ఆమెనలా పిలుస్తాడతను.



అతని సంబోధనకామె ఉబ్బితబ్బిబ్బయిపోయింది. అలా వాళ్లిద్దరి ప్రేమ ప్రపంచంలో ఇంకొక ప్రాణి జీవంపోసుకుని 'ప్రాణేష్'గా అవతరించాడు... ఆ కూన వాళ్లిద్దరి లవ్ చైల్డ్.

★ ★ ★

పద్మిని జీవితంలో ప్రాణేష్ అడుగుపెట్టిన తరువాత రోజులు గబగబా దొర్లిపోతున్నాయి. అంతకుముందు దుష్యంతరావు కోసం కళ్లు కాయలుకాసేలా ఎదురుచూసే



ఆమెకి అసలు అంత తొందరగా ఎలా పొద్దుపోతూన్నదో తెలియడంలా. ఆఫీసు నుంచీ ఎప్పుడెప్పుడు వస్తాడా అని ఎదురు చూసే ఆమె 'అప్పుడే సాయంకాలమ యిందా?' అనుకోసాగింది. ఆమెలో వచ్చిన ఆ మార్పుకు దుష్యంతరావు ఆనందించలా. కుళ్లుకున్నాడు కాస్త... బాధపడేవాడుకూడా. అయినా తన టర్న్‌కోసం ఎదురుచూస్తూండే వాడు. ఆమె తన తగ్గరకొచ్చి అంతకుముం దులా మాట్లాడే మాటలూ, ప్రేమ, సర దాలు, తమాషాలూ, చిలిపిచేష్టలకోసం. కొడుకుమీద అతనికి చాలా ఇష్టమే. కానీ అంతకుమించిన ఇష్టం అతనికి ఆమె మీద.

చాలాసార్లు ఆమెతో అనను కూడా అనేవాడు "మినీ... నేను బహుశా బాడ్‌ఫాద ర్నేమో... ఎందు కంటే వాడిమీద వుండాల్సిన ప్రేమ కంటే నీమీద ఎక్కు వవుతూన్నది డార్లింగ్! ఇది తప్పేమో నాకు తెలీదు" అంటూ చిన్నపిల్లాడిలా కన్‌ఫెస్ చేసుకునే వాడు.

ఆమె దానికి విస్మయంచెంది ఒళ్లోవున్న పసిపిల్లాడితోబాటు అతన్ని కూడా పాంప రింగ్ చేసేది. తన భర్తంటే గర్వపడేది. అప్పటినుంచీ కొడుకుని చూసుకునేలా అంత ప్రేమ, కేర్ భర్త మీద కూడా చూపించడం అలవాటు చేసుకుంది. అంత పెద్ద ఆఫీస రయి, అన్ని తెలివితేటలున్న వ్యక్తి చిన్నపిల్ల వాడిలా తన దగ్గర అలా ప్రవర్తించడం ఆమెకి అద్భుతంగా అనిపించేది.

పిల్లాడికి నెలలునిండి సంవత్సరాలు గడు



స్తున్నాయి. భర్తకి పిల్లాడితో పోటీకూడా ఎక్కువవుతూన్నది. పిల్లాడికి బట్టలు కొంటే తనకి కనీసం టీ షర్టయినా కొనలేదని అలి గేవాడు దుష్యంతరావు. పిల్లాడికి నాప్‌కిన్స్ కొంటే కనీసం తనకి కర్ఛీఫన్నా కొనలేదని పేచీలు పెట్టుకునేవాడు. రానురాను అతని ధోరణి ఆమె దగ్గర పసిపిల్లవాడి ధోరణిలా అవసాగింది. ఇప్పుడామె ఒక పిల్లాడికికాదు తల్లి... ఇద్దరు పిల్లలకిలా అయింది. ఒక్కో సారి మామూలుగా హుందాగానే ప్రవర్తించే వాడు. ఒక్కోసారి పిల్లాడితో పోటీ. పిల్లా డికి సెరిలాక్ పెడితే తనకి కూడా అన్నం కలిపి పెట్టమని పేచీ పెట్టేవాడు. ఇదంతా కావాలని తమాషాకి చేస్తూన్న డేమో అనుకునేది ఒక్కోసారి. కానీ కాదని వెంటనే తెలి సిపోయేది.



దుష్యంతరావు తనకితను బయట ఒక్కడే షాపింగ్‌కి వెళ్లి, ప్రాణేష్‌కి బట్టలూ, ఆమెకి మంచిమంచి చీరలు, నగలు తెచ్చి ఆమెని సంతోషంలో ముంచెత్తేవాడు. అప్పుడనిపిం చేది ఆమెకు తన భర్త మనసు చిన్నపిల్ల వాడి మనస్తత్వమని. కానీ ఇంటి బయటికి అడుగుపెడితే మాత్రం అతని ధోరణి మారి పోయేది. చిన్నపిల్లవాడి ధోరణి వున్నచోట హుందాతనం చోటుచేసుకునేది.

ప్రాణేష్‌కి ఐదు సంవత్సరాలొచ్చాయి. స్కూల్లో వేసింది పద్మిని. స్కూలు అప్లికేష న్‌లో తండ్రిపేరు రాయాల్సినచోట గార్డియ న్‌గా తనపేరునే రాసుకుంది. వాళ్లు మళ్లీ మళ్లీ ఆమెను ఎదురు ప్రశ్నవేసేందుకు కూడా అవకాశం ఇవ్వలేదామె. ఈలోపు దుష్యంతరావుకి మోహినితో ముందు పుట్టిన కొడుకుకాక మళ్లీ ఇంకో కొడుకు,

కూతురు పుట్టారు. ఈ ఐదు సంవత్సరాల్లో ఇద్దరు చెల్లెళ్లకీ కలిపి ఒకసారి, ఇంకొక చెల్లెలికి విడిగానూ పెళ్లిళ్లు చేశాడు తన హోదాకి తగినట్టుగా. పెళ్లిళ్లు... పేరంటాలు.. శుభసందర్భాలు జరిగిన సమయంలో కళ్యాణమంటపాలకి పద్మినినీ, ప్రాణేష్‌నీ కూడా తీసికెళ్లాడు రెండు కుటుంబాలనూ కలపాలనే సదుద్దేశంతోను, తనకి టెన్షన్ తగ్గించుకోవడానికిగాను. కానీ ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా రెండు కుటుంబాలూ కలవలేదు సరికదా, వాళ్లమధ్య అగాధాలు మరింత ఎక్కువయాయి. దానికి తగ్గట్టు తన తల్లి అగ్నిలో ఆజ్యంపోసినట్టు తన ఇద్దరి భార్యలమధ్య విలన్‌లా తయారయి, పొరపాటుగాకూడా ఇద్దరినీ కలవనియ్యకుండా చేసి, సమస్యను మరింత జటిలం చేసింది తెలిసో తెలీకో. ఇద్దరు భార్యలనీ కలపాలన్న కోరిక కూడా చచ్చిపోయిందతనిలో.

మోహినిని చూసినపుడు పద్మినికి కడుపు రగిలిపోతూండేది. తనా స్థానంలో వుండాల్సింది, తన స్థానాన్ని ఆమె తీసేసుకుందనే కసి కలిగేది ఆమెలో. నిజానికి ఆమె ఊహ నిజమేకానీ అనుకున్నవన్నీ జరగవుగదా-అన్యాయంగా తను తన దుష్యంత్ జీవితం లోంచి పక్కకు నెట్టివెయ్యబడినదానిలానో... తీసెయ్యబడినదానిలానో అనిపించి కడుపు రగిలిపోయేది. అంతకుముందు అసలు అలాటి ఆలోచనలే కలగని ఆమెకు మోహినిని చూస్తేమాత్రం కాలిపోయేది. వంటికి పచ్చిమిరపకాయకారం పూసుకున్నట్టనిపించేది. అందులోనూ అందరూ మోహినిని అతని భార్యగా గుర్తించి, గౌరవించినప్పుడు... తను మామూలు గెస్ట్‌లా మిగిలిపోయినందుకు మనసంతా ముక్కలయిపోయేది.

అలాగే మోహిని- పద్మినిని చూసినప్పుడు తనకీ తన భర్తకీ మధ్య పానకంలో పుడకలా కనిపించేది. తనేదో తన ఇంట్లో ఒక మంచి శుభకార్యాన్ని చేసుకుంటూంటే బియ్యంలో గులకరాయిలా ఈమెందుకిక్కడ అనిపించేది. సాయంకాలాలు ఆయన్ని తన దగ్గరకు రప్పించుకుని, రాత్రిళ్లు అన్నాలు తినిపించి పంపడమేకాక, తన కుటుంబానికి సంబంధించిన విషయాల్లో మళ్లీ ఆమె ప్రమేయమెందుకని మండిపడేది. ఏదయినా శుభసందర్భం వస్తూంటే ఆమె ఎక్కడ వచ్చి, తనకి కనిపించి, తనకీ తన భర్తకీ మధ్య ఎక్కడ అడ్డుగోడలా వుంటుందోనని చికాకుపడేది. ఆమె అదృష్టానికి తగ్గట్టు అత్తగారి వత్తాసు ఆమెకు బాగా పనికొచ్చింది. పెద్దావిడ అండ వుండటంవల్ల ఆమె స్థానం ఆమెకు పదిలమై, ఆమెమాట చెల్లుబాటు జరిగేది. భర్త బయట ఎవరితో రహస్యకాపురాలు చేస్తూన్నా అత్తగారి సాయంతో అతన్ని ఇంటిపట్టునే కట్టేసుకోగలిగింది. అతనికి పద్మినిపట్ల ఎంత ప్రేమ వున్నప్పటికీ ఫామిలీ, సెంటిమెంట్, ఇమేజ్... వీటిని తెచ్చి, అతని ముక్కుకు తాడువేసింది. ఏమీ తెలీని అమాయకురాలిలా కనబడుతూ, భూదేవంత భారాన్ని మోస్తూ ఎంతో కష్టాన్ననుభవిస్తున్నట్టు పైకి మొహాన్ని పెట్టినా, మనసులో మాత్రం ఎప్పుడూ చదరంగాన్ని ఆడుతూనే వుండేది రాజకీయనాయకురాలిలా. అలా కుటుంబంలో జరిగే ఫంక్షన్స్‌లో వచ్చిన పద్మిని పిలవని పేరంటానికి వచ్చినదానిలా బాధపడేది. అందులోనూ ప్రాణేష్‌ని చూసిన మోహినీ, ఆమె మనుషులూ కళ్లల్లో నిప్పులు పోసుకునేవారు. మొత్తానికి ఈ టెన్షన్ కంటే... ఈ బాధకంటే అసలు వాళ్లకు సంబంధించిన ఫంక్షన్స్‌కి వెళ్లకుండా వుండటమే అందరికీ శ్రేయస్కరమని అందరూ అన్నివైపులనుండీ నిర్ణయించుకున్నారు. అప్పటినుంచీ వాళ్లూ వీళ్లూ కలవడాలు ఆగిపోయాయి. ఇలాంటి సందర్భాలవల్ల ఎవరూ ఆనందపడలా చూసేవాళ్లు తప్ప

పిల్లలు నలుగురూ చిన్నచిన్నవాళ్లు. ముగ్గురు చెల్లెళ్ల పెళ్లి చేసేశాడు. జీవితం

మామూలుగా సాగిపోతున్నది దుష్యంతరావుకి అక్కడా ఇక్కడా కూడా.

★ ★ ★

ప్రాణేష్‌కి పది సంవత్సరాలు నిండాయి. ఒక్కోక్లాస్ దాటి వెళుతున్నాడు. ఇంకా ఎ.ఎస్.రావునగర్ అద్దె ఇంట్లోనే వుంటూన్నారు పద్మినీ, కొడుకు.

ప్రాణేష్ పెరిగి పెద్దవాడవుతూన్నకొద్దీ అతనికి తన ఇల్లు, జీవిత విధానం మిగిలిన తన ఫ్రెండ్స్‌లా కావని నెమ్మదిగా అర్థంచేసుకోసాగాడు. ఎందుకో అతనికి తల్లిదగ్గరున్న చనువు, ఆమె మీదున్న ప్రేమ తండ్రి మీద కలగడంలా. దానిక్కారణం... స్కూల్లో ఏచిన్న సమస్య వచ్చినా తన ఫ్రెండ్స్‌కి వాళ్ల తండ్రులు వస్తారు. తనకి మాత్రం తన తల్లే రావడం అతనికి నచ్చడంలేదు. తన ఫ్రెండ్సుని తీసికెళ్లడానికి వాళ్ళ వాళ్ల తండ్రులు వచ్చి పికప్‌చేసుకుని వెళతారు. ఒక్కసారన్నా డాడీ రాడన్న విషయం అతనికి కంటకంగా వుంది. అదే విషయం డాడీనడిగితే 'నేను రాకూడదు నాన్నా... అయినా మీ మమ్మీ వస్తే చాలు... నేను రానవసరంలేదు' అంటూ ఏవో సాకులతో తప్పించుకునేవాడు. తను కన్విన్స్ అవక తల్లినడిగితే ఆమె బాధనంతా కడుపులో పెట్టుకుని కొడుక్కి సర్దిచెప్పడానికి ప్రయత్నించినా, ఆమె కళ్లల్లోని భావాలనీ, బాధనీ అతను పసికట్టేసేవాడు. తనకు తెలియని బాధ ఏదో తన తల్లి మనసులో వుందనే భావం అతని పసిమనసులో ముద్రపడిపోయింది. దానిక్కారణం తన తండ్రనే విషయం కూడా అతనికి చూచాయగా తెలిసిపోయింది.

చాలాసార్లు అతని ఫ్రెండ్స్ కూడా అడిగారు, "మీ డాడీ ఎప్పుడూ స్కూల్‌కి రాడేంరా... అసలు మీ డాడీని మాకు చూపించవా?" అని. ఆ లేతమనసు ఆ మాటలకి విలవిల్లాడిపోయేది. ఒకసారి పక్క ఇంటి చక్రధరరావు కొడుకు దినేష్ అడిగాడు, "ఎందుకురా మీ డాడీ రాత్రిపూట ఎక్కడికో వెళ్లిపోతూంటాడు? మా డాడీ ఎంత లేటయినా మా ఇంటికే వస్తాడు. కానీ మీ డాడీ ఎంత లేటయినా ఎందుకలా దొంగలా వెళ్లిపోతాడు?" అడిగినప్పుడు చెంపమీద ఛెళ్లుమని కొట్టినట్టనిపించి, తల్లి దగ్గరకెళ్లి భోరుమన్నాడు. అతడడిగిన ప్రశ్నలకి ఆమె దగ్గర సమాధానాలు లేకపోయినా ఏదో ఒకటి చెప్పాలని చెప్పి, అతని మనసు ప్రశ్నార్థకంగానే వుంచగలిగింది. ఆఫీసునుంచి వచ్చిన దుష్యంతరావు దగ్గరకి చనువుగా వెళ్లడం లేకపోగా అతనికి దూరంగా వెళ్లి, ఏదో హోమ్‌వర్క్ చేసుకుంటూన్నట్లుగానో, ఏదో బిజీగా వున్నట్టుగానో నటించేవాడు. దుష్యంతరావుకి కూడా కొడుకుని దగ్గరకు తీసుకుని అనునయంగా మాట్లాడి, అతని పసిమనసుకి ప్రేమను పంచాలన్న ధ్యాస వుండేదికాదు. ప్రాణేష్‌కి ప్రపంచమంతా తల్లే అయిపోయింది. రానురానూ తండ్రిమీద ద్వేషం పెరగసాగింది. ఎందుకో తండ్రిమీద ఏవగింపు కలుగుతూన్నది. తల్లిమీద ప్రేమ ఎక్కువవడమేకాక తల్లంటే విపరీతమైన ఆరాధన బయలుదేరింది. తన తండ్రి మూలంగా తల్లి అవమానాల పాలవుతూన్నదనీ, చక్రధరరావు గారింట్లో ఆమెను చులకనగా మాట్లాడుతారనీ, దానిక్కారణం తన తండ్రేననీ... ఇలా ఏవేవో ఆలోచనలు అతనిలో. అంత బాధపెడుతూన్నా ఆమెకి తండ్రిమీద ఎక్కడలేని ప్రేమ ఎందుకో అర్థంకాదు. తండ్రి ఇంటికి వస్తే ఆమె అతనికి ఎన్నో రకాల సేవలుచేస్తుంది. బహుశా అందరు తల్లులూ అంతేనేమో. కానీ తన తండ్రి మాత్రం మరి అందరు తండ్రుల్లా ఇంట్లో ఎందుకు గడపడో అతనికి అర్థంకాదు. అసలు ఇల్లు, లైఫ్‌స్టైలూ అతనికి చికాకు కలిగిస్తూన్నాయి. ఏదైనా దూరమైన ప్రదేశానికి తల్లితో వెళ్లిపోవాలనీ, తండ్రినుంచీ పారిపోవాలనీ వుంది. కానీ అతను చిన్నపిల్లవాడు. ఇంకా స్కూల్లోనే

చదువు పూర్తవలా.

★ ★ ★

ఒకరోజు తల్లి, తండ్రి, తనూ ముగ్గురూ అబిడ్స్‌లో సినిమాకి వెళ్లారు ఫస్ట్‌షోకి. సినిమాచూసి, తాజ్‌మహల్ హోటల్‌కి వెళ్లారు భోజనానికి. భోజనాలయిపోయిన తరువాత దుష్యంతరావు పద్మినితో అన్నాడు, "నువ్వూ, ప్రాణేష్ ముందు వెళ్లి, కారులో కూర్చోండి...ఇవి గో కీస్... నేను వెనకాలేవస్తా.. ఎందుకంటే అమ్మకి దూరపు చుట్టం ఎవడో నన్ను చూశాడు" అని.

'సరే'నంటూ పద్మిని కారు కీస్ తీసుకుని, కొడుకుతో వెళ్లి, డోర్ తెరిచి, ముందుసీట్లో తను కూర్చుని, వెనకసీట్లో ప్రాణేష్‌ని కూర్చోపెట్టింది.

"మమ్మీ... ఎందుకు డాడీ అలా భయపడతారు? మనతో బయటికి రావడం తప్పా? ఎవరయినా చూస్తే ఏమవుతుంది? " అడిగాడు అమాయకంగా.

"కాదు నాన్నా... మనమూ, డాడీ కలిసి బయట ఎక్కువగా తిరగకూడదుకన్నా... అలా తిరిగితే డాడీకి ప్రాబ్లమ్స్ వస్తాయి"

"ఎందుకు మమ్మీ... అందరికీ అలాగే వస్తాయా? "

"కాదు కన్నా... డాడీకి మాత్రమే... ఎందుకంటే, చిన్నపిల్లాడివి నువ్వు. నీకర్థం కాదులే. పెద్దయిన తరువాత చెబుతా" అంటూ ఏదో మాటలోకి మార్చేసింది సంభాషణని. ఆరోజు కూడా ప్రాణేష్ చాలా చికాకుపడ్డాడు తండ్రిమీద. 'అసలు ఇదంతటికీ బదులు ఇంట్లో కూర్చోవటమే నయ'మనిపించేదతనికి. రానురాను అతనికి బతుకు మీద రోత మొదలయింది. బతుకు బరువు కాసాగింది నెమ్మది నెమ్మదిగా.

జీవితమంతా ఎప్పుడూ ఒకేలా వుండటం, రోజుకీరోజుకీ మధ్య తేడా లేకపోవడం-ఎటయినా హాయిగా తల్లిదండ్రులతో వెళ్లడం తన ఫ్రెండ్స్ వాళ్ల పేరేంట్స్‌తో వెళ్లినట్టు పెళ్లిళ్లకో, ఫంక్షన్స్‌కో లేక హాలీడేస్‌కని ఏదయినా బయటి వూరుకి వెళ్లి, నాలుగురోజులుండి రావడమో... ఇంటికెవరయినా గెస్ట్స్ రావడమో లేక తను తన పేరెంట్స్‌తో ఎవరింటికయినా లంచ్‌కిగానీ, డిన్నర్‌కిగానీ వెళ్లడమో- అసలు అలాటి సంఘటనలే లేవు బొత్తిగా జీవితంలో. కనీసం చుట్టాలింటికి వెళ్లాలంటే వున్నదొక మామయ్యా, ఫామిలీ. వాళ్లెప్పుడో తన తల్లినీ, తననీ వెలివేశారు. ఇంటికి రావాలన్నా ఇంక చుట్టాలెవ్వరూ లేరు. పెద్దవాడవుతున్నకొద్దీ జీవితం దుర్భరంగానూ, విసుగ్గానూ వుంది. స్కూలునుంచీ ఇంటికి వెళ్లాలంటే ఒక్కోరోజు వెళ్లబుద్ధవదు. సొంత తండ్రి గెస్ట్‌లా వచ్చివెళ్లడం అతనికి కంపరంగా... ముళ్లకంపమీద కూర్చున్నట్లుంది. ఈ జీవితానికి మొదలేదో తుదేదో కూడా కనుచూపుమేరలో కనిపించడంలేదు. అంతా అంధకారబంధురంగా కనిపించసాగింది బతుకు. తల్లిని చూస్తే మనసంతా వికలమైపోతూన్నది. ఆవిడ సహనానికీ, ఓర్పుకీ. తను తొందరగా పెద్దవాడయితే తల్లిని ఎత్తుకుని తనతండ్రికి అందనంత దూరం పారిపోవాలని వుంది. కానీ అదెప్పుడో తనకి తెలీదు. ఒకవేళ అలాటి సందర్భం కనుక వస్తే ఆ పార్ట్‌టైమ్ హజ్‌బెండ్ లేనిదే ఆమె బతకలేదనీ, అతన్ని విడిచి చావనైనా చస్తుందిగానీ అతనినుంచి విడిపోదని అతనికి తెలీదు.

ఒంట్లో ఎప్పుడయినా బాగాలేకపోతే అతన్ని ఆటోలో కూర్చోబెట్టుకుని హాస్పిటల్‌కి తల్లి తీసుకుపోవాలి తప్ప, కారు పెట్టుకున్న తండ్రి కారుతెచ్చి హాస్పిటల్‌కి తీసుకుపోవడంకానీ, కొడుకుని చెయ్యిపట్టుకుని ఓదార్చడంగానీ ఎప్పుడూ చూడలేదతను. ఆలోచించేకొద్దీ మనసులో యాజిటేషన్ బయలుదేరుతుంది తప్ప దానికి పరిష్కారం ఏంటో ఎప్పుడూ అర్థంకాలేదు ప్రాణేష్‌కి. ఒకవేళ తల్లికి ఒంట్లో బాగాలేకపోతే ఓర్చుకున్నంతసేపు ఓర్చుకుని, ఇక ఓర్చుకోలేన

ప్పుడు తప్పనిసరయి హాస్పిటల్‌కి వెళ్లాలంటే పనిమనిషిని తోడుతీసుకుని వెళుతుంది తప్ప తండ్రి స్వయంగా ఎప్పుడూ ఆమెను హాస్పిటల్‌కి తీసుకునివెళ్లడం అతని కళ్లతో చూడలేదు. ఈ దొంగ జీవితంలోని పాత్రలన్నీ దొంగవే. తండ్రి దొంగలావచ్చి దొంగలా వెళ్లడం... తల్లి దొంగలా ఎప్పుడూ ఇంట్లోనే కూర్చోవడం... అలా కూర్చోవడమేకాక బయటి మొహమైనా చూడకుండా రోజులూ, వారాలూ ఏవీ తెలియకుండా గృహనిర్బంధ జీవితాన్ని గడపడం... ఇక తను, చెప్పక్కర్లా. తనెవరో ఎవరికీ చెప్పకూడదు. తండ్రిని ఎవరికీ చూపించకూడదు. కనిపించే ప్రతివ్యక్తీ అతని కోణంనుంచి దొంగల్లా కనబడుతున్నారు.

ప్రాణేష్‌కి లైఫ్‌సిస్టమ్ చాలా తలనొప్పిగా తయారయింది. ఈమధ్య ప్రతిచిన్నవిషయానికీ కోపం అధికమవుతోంది. కనిపించిన ప్రతివాళ్లనీ కసురుకుంటున్నాడు. చదువుమీదికి బుర్రపోవడంలేదు. తనవాళ్లెవరో, పరాయివాళ్లెవరో అతనికి అర్థంకావడంలేదు. తనకంటూ అసలు తన మనుషులెవరో అతనికి తెలీదు. అతనికొక నాయనమ్మ వున్నదని తల్లి చెబితే తెలుసుకున్నాడు, కొన్ని సందర్భాల్లో ఆమెను చూశాడు. ఆమె అతన్ని పలకరించలేదు. అసలు నాయనమ్మదాకా ఎందుకు... నాయనే పరాయివాడయినప్పుడు ఆ నాయనికి అమ్మ పరాయి అవడంలో తప్పేముందని నిట్టూర్చేవాడు. చదువుమీదికి మనసు పోనప్పటికీ తల్లి కోసం కష్టపడి చదవాలని నిర్ణయించుకున్నాడు. పెద్దయి, తన తల్లిని సుఖపెట్టాలని కలలు కనేవాడు. తను అచ్చం తనతండ్రిలా వుంటాడనీ, అలవాట్లన్నీ తండ్రివే వచ్చాయనీ తల్లిచెబుతూంటే కారం పుట్టించే అన్ని వస్తువులూ నూరి, పేస్ట్‌లాచేసి, ఒంటినిండా పూసుకున్నట్లనిపించేది. తనమీద తనకే రోత పుట్టేది చిన్నవయసయినా. తండ్రి చాలా మంచి వ్యక్తనీ, చాలా జెంటిల్‌మాన్ అనీ తల్లి చాలాసార్లు చెప్పేది తను అన్నం తినేప్పుడు. మరి ఆమె ఎందుకలా చెబుతుందో అతనికి అర్థమయ్యేదికాదు. మంచివాడని చెప్పడమేకాక తండ్రిపట్ల తల్లికి విపరీతమైన ఆరాధనాభావం వుండటం అతనికి చిరాకు కలిగించేది. కానీ అలాగని ఆమెతో ఎప్పుడూ వ్యక్తపరచలా. తండ్రి మంచితనం, గొప్పతనం గురించి ఆమెకి వీలు దొరికినప్పుడల్లా ఆ అవకాశాన్ని ఆమె ఎప్పుడూ జారవిడుచుకోకుండా ఏదోఒకటి అతనికి చెబుతూనే వుండేది.

అన్నిటికంటే హాస్యాస్పదమైన ఇంకొక విషయం చెప్పేది ఆమె "పెద్దయిన తరువాత డాడీని బాగా చూసుకోవాలి నువ్వు... ఎందుకంటే ఆయన దేవుడులాంటివారు" అనేది. 'ఆయన్ని చూసుకోవడానికి నేనెందుకు? ఆయనకి మనుషుల్లేరా?' అనేవాడు వ్యంగ్యంగా. "ఉన్నప్పటికీ సమయం, సందర్భం ఎటొచ్చి ఎటెళ్లేదీ తెలీదుకదు ప్రాణా... చెప్పినమాట విను. గుర్తుపెట్టుకో... డాడీని నాతో సమంగా చూసుకోవాలి సుమా" అనేది. ఆమె అమాయకత్వానికి అతనికి నవ్వాలో ఏడ్వాలో అర్థమయ్యేదికాదు. "పిచ్చి మమ్మీ" అనుకునేవాడు మనసులో.

★ ★ ★

ప్రాణేష్ ఇంటర్‌మీడియట్‌లోకి వచ్చాడు. ఈ లోపల అతని జీవితంలో పెద్ద మార్పులు జరిగినప్పటికీ పరిసరాల్లో కూడా కొన్ని మార్పులొచ్చాయి. ఎ.ఎస్.రావు నగర్‌లో అద్దెకుండే ఇల్లు ఖాళీ చేశారు. తండ్రి కొత్తగా కొన్న ఇంట్లోకి షిఫ్టవడం జరిగింది. ఇల్లు బాగానేవుంది అన్ని వసతులతో. కానీ ఇంట్లోనే ఎప్పుడూ లోపాలూ లోట్లూ. అసలు లోటు తండ్రనేది అతనికి జీర్ణంకాని విషయం. అందులోనూ ఆ కొన్న ఇల్లు సైనిక్‌పురీలో వుండటంతో అతనికి అరికాలి మంట నెత్తికెక్కింది.

# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

శ్రీచంద్ర..

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర, ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఆగస్ట్ చతుర నవల **ఐ లవ్ యూ మై చైల్డ్**

చిరునామా: ____________________

ఇల్లు త్రీ బెడ్‌రూమ్ ఇండిపెండెంట్ హౌస్. పర్‌ఫెక్ట్ వాస్తుతో కట్టబడింది. బయట, వెనక కాస్త ఖాళీస్థలం. వెనకాల ములగ, మామిడి, పొన్న నిమ్మ, దానిమ్మ, కొబ్బరిచెట్లు వేయించుకుంది పద్మిని. ముందున్న ఖాళీస్థలంలో మాత్రం అన్ని రకాల పూలచెట్లు వేయించుకుంది చిన్నచిన్న మడులలో. చూడటానికి పొందికగా వుంది రంగురంగుల పూలు, ఆకులతో ఆ తోట. ఇంటిలోపల మాత్రం మీడియంసైజ్ బెడ్ రూములు... గోడల్లో ఆల్మైరాలూ... పెద్ద కిచెన్, పెద్దహాలు. మూడు బెడ్‌రూములలో ఒకటి తనకి వుంచుకుంది నైరుతిలోవున్న బెడ్‌రూమ్‌ని. ఇంకొకటి కొడుక్కిచ్చి, మూడోది కాస్త పెద్దది దేవుడికోసం, దాని లోనే ఒకవైపు పెయింటింగ్స్ సరదాగా వేసు కోవడంకోసం వుంచుకుంది. ఆమెకి కుదిరిన ప్పుడు, ఒంటరితనంగా అనిపించినప్పుడు, ఖాళీసమయం దొరికినప్పుడు ఆ గదిలో గడ పడం అలవాటు చేసుకుంది.

దేవుడు పూజకి పువ్వులు ప్రత్యేకించి బయటకొననవసరంలేకుండా ఇంట్లో పూసే పారిజాతం, గన్నేరు, మందార, దేవదారు, తులసి, మారేడు, వీటన్నింటితో పూజ జరి గిపోతుంది. ఇంట్లో ముందునుంచీ వున్న సోఫాలు, మామూలు ఫర్నిచర్, మంచాలు తప్ప కొత్తగా కొన్నవేవీ లేవు కొత్తింట్లోకి. ఇంట్లోకి కావలసిన వస్తువులేమిటో... ఎంత వరకు అవసరమో, ఎంతవరకు కాదో, ఇంకెంత డబ్బు ఖర్చుపెట్టాలో వాటి గురిం చిన ఫైనాన్షియల్ వ్యవహాలన్నీ దుష్యంత రావే చూసుకుంటాడు. పద్మిని ఎప్పుడూ కూడా 'ఇది'కావాలని అతన్ని అడగదు. అంతగా బాగా అవసరమని తోచినప్పుడు భర్తకి ఒకసారి చెప్పి వదిలేస్తుంది. అతనికి జ్ఞాపకం వున్నప్పుడు ఆ కావలసిన వస్తు వులు ఇంటికివస్తాయి. లేకపోతే కొంత కాలం పట్టచ్చు.

పెళ్లయి దాదాపు పదిహేను సంవత్స రాలు దాటింది. భర్తకి అన్నిసార్లు ప్రమో షన్ వచ్చి, అతనిజీతం చాలారెట్లు పెరిగి, మంచి హోదాలో వున్నప్పటికీ, అంత మంచి హోదాలో వున్న ఆఫీసర్‌కి సంబంధించిన ఇల్లని ఆ ఇంటిని చూస్తే అనిపించదు. చాలా నెగ్లెక్టెడ్ హౌస్‌లా కనబడుతుంది. వెల్‌ఫర్నిషడ్ హౌస్‌లాకానీ కంఫర్ట్స్‌తోగానీ వుండదా ఇల్లు. ఇల్లెప్పుడూ శుభ్రంగా వున్న ప్పటికీ ఇంట్లో అట్టే మనుషులు లేకపోవడం వల్ల ఆ ఇల్లు ఎప్పుడూ వెలితిగానే కనబడు తుంది. దుష్యంతరావు మోహినితోవుండే ఇల్లు చాలాపెద్ద ఇండిపెండెంట్‌హౌస్ అనీ, దానిలో చాలా పెద్ద గార్డెన్ వున్నదనీ, ఇంట్లో లేనివసతులు లేవనీ, అది మూడం తస్థుల భవనమనీ, ఎప్పుడూ మనుషుల తోనూ, పనివాళ్లతోనూ, వచ్చేపొయ్యేవాళ్ల తోనూ సందడిగా వుంటుందనీ వింది ఎవరో చెప్పగా.

కొడుకులిద్దరికీ విడివిడిగా కార్లు వున్నా యనీ, వాటిని వాళ్లే నడుపుకుంటూంటారనీ వింది. మరి తనకి అసలు కారేలేదన్న విష యాన్ని ఆమె గమనించలా. ఆ ఇంట్లో ఎన్నో రకాల వసతులున్నాయని వింది. చాలా విలాసవంతంగా వుంటుంది ఆ ఇల్లు అని వింది కానీ స్వయంగా తను చూడ లేదు. మరి ఇక్కడ ఈ ఇంటికి కావలసిన వస్తువుల విషయాల్లో భర్త ఎందుకు అశ్రద్ధ చేస్తాడో ఒక పట్టాన అర్థమయ్యేదికాదామెకి. వాటన్నింటి గురించి ఆలోచించుకుని, తన బుర్ర పాడుచేసుకుని, భర్తతో గొడవలు పెట్టుకోవడం తనకి ఇష్టమనిపించదు. అతన్ని ఏ విధంగానూ బాధ పెట్టటం ఆమెకి ఇష్టంవుండదు. బాధ కలిగించే విష యమేదయినా వుంటే ఆలోచించగలిగినంత ఆలోచించి, మిగిలినదాన్ని భగవంతుడికి వదిలేసి, ఖర్మను తలుచుకుంటుంది. భర్త ఏ పనిచేసినా దానిలో ఏదో నిగూఢమైన అర్థం వుంటుందని ఆమె నమ్మకం. అతని పైన అచంచలమైన విశ్వాసం.

కొడుకు ఇంటర్మీడియెట్‌కి వచ్చిన తరువాత తల్లితో తనకి ´టూ వీలర్ కావాలనీ, తన ఫ్రెండ్సంతా టూ వీలర్‌మీదే వస్తున్నారనీ చాలాసార్లు చెప్పాడు. స్కూల్‌లో చదువుకునే రోజుల్లో బస్‌లో వెళ్లేవాడు. ఇప్పుడు కాలేజ్. బస్సులో పోవాలంటే అతనికి నచ్చడంలా. అందరిలా తను కూడా డీసెంట్‌గా టూవీలర్‌మీద పెద్దమనిషిలా వెళ్లాలని అతని మోజు. తండ్రి దానికి ఒప్పుకోవడంలా "ఎందుకు టూ వీలర్... సేఫ్టీ కాదు... అందులో ఈ కాలం కుర్రాళ్లకి స్పీడ్ సెన్స్ వుండదు, బస్‌లో పో" అన్నాడు రెండు మూడుసార్లు తను అడిగితే. తండ్రి మీద మళ్ళీ మండింది ప్రాణేష్‌కి. తన స్టెప్ బ్రదర్స్ కార్లలో తిరుగుతూంటారన్న విషయం అతనికీ తెలుసు. కానీ తండ్రి ఎప్పుడూ తన విషయంలోనే ఎందుకిలా చేస్తాడో అర్థంకాదు. అదేవిషయం తల్లినడిగితే ఆమె అయోమయంలో పడిపోయింది.

స్కూల్లో ఎయిత్‌స్టాండర్డ్ చదివే రోజుల్లో ఒకసారి తన ఫ్రెండ్ సూర్య అడిగాడు. ఏరా ప్రాణేష్... హెచ్.పీ.యస్‌లో చదివే మీ వేరే బ్రదర్స్ రోజూ కార్లో స్కూలుకి వెళుతూంటే నువ్వెందుకు బస్సులో వస్తావ్. వాళ్లని రోజూ డ్రైవర్ దించుతాడట కారులో. ఒక్కోసారి మీ డాడీయే దించుతారట. వాళ్లక్లాస్‌మేట్ నందూ మీ ఇంటిపక్కనే వుంటాడు. వాడు చెప్పాడు. మరెందుకురా మీ డాడీ ఒక్కసారన్నా నిన్ను మన స్కూల్లో దించలేదు? ఒక్కసారన్నా స్కూలుకి రాలేదు?" కంప్లెయింట్‌గానూ, ఇన్‌ఫర్మేషన్‌గానూ చెప్పాడు ఏదో దొంగని పోలీసు ప్రశ్నించినట్టు కళ్ళలో కళ్ళు పెట్టి కన్నార్పకుండా చూస్తూ.

"అవునూ... మీ డాడీకి ఇంకో సెటప్పు వుందటగా?!" పెదవి విరుస్తూ "బాగానే వుంది.. అందరికీ ఒకే ఇల్లుంటే ఆయనకి మాత్రం రెండన్నమాట" వెక్కిరింపుగా అన్నాడు.

ప్రాణేష్ కోపంతో వణికిపోయాడు. రక్తం ఉడికిపోయింది. సూర్య అలా అడిగినందుకు మళ్ళీ ఎప్పుడూ అతనితో మాట్లాడలేదు. ఇంటికి వచ్చిన తరువాత తల్లితో చెబుదామనుకున్నాడు ఈ విషయం. మళ్లీ గుర్తొచ్చింది తల్లి దీనమైన మొహం. ఆమె బాధ... అతన్ని అనునయించి, బుజ్జగించి ఏదో తనకి నచ్చని సమాధానం చెప్పడం... ఇక ఆమెనడిగీ లాభం లేదనుకుని తండ్రి సంగతి తెలిసి ఏంచెయ్యలేని అయోమయంలో వుండిపోయాడు. తనలోతను కుమిలిపోయాడు జరుగుతున్న అవమానాలకి. తండ్రి తమతో లేకపోతే లేకపోయాడు గానీ కనీసం తమ అవసరాలు చూస్తూ కమ్‌ఫర్టబుల్‌గా పెట్టచ్చుగదా? ఎందుకీ అడుక్కుతినే బతుకు బతకాలి అంత పెద్ద ఆఫీసర్‌ని ఇంటి యజమానిగా పెట్టుకుని. ఆయన ఆఫీసరయినంతమాత్రాన తమకి ఒరిగేదేంటని చిరచిరలాడాడు. ఆఫీసువాళ్ళకు తెలియకూడదు. ఆయనకి రెండో భార్య వున్నదన్న విషయం అని ఆయన ఉద్దేశం. కానీ ఆఫీసువాళ్లు చెప్పలేదుకదా రహస్యంగా వున్న రెండో పెళ్లాంని బాగా చూసుకోవద్దని? ఆమె బిడ్డల్ని రోడ్డుకి వదిలెయ్యమని? ఇంటినీ, ఇంట్లోవాళ్ళనీ దిక్కులేనట్టు వుంచమని చెప్పలేదుగదా"లాంటి ప్రశ్నలతో ఎదురు తిరిగింది ఆ మొగ్గలాంటి మనసు.

తల్లిదగ్గర పోరితే చివరికెలాగో ఆమె దుష్యంతరావుని కన్విన్స్ చేసింది. బైక్ వచ్చింది. ఇంటికి రావడంమంచిరోజు వచ్చింది కాబట్టి ఆరోజే పసుపు, కుంకుమ పెట్టి, బైక్‌కి పూజ చేసింది పద్మిని, ఆ బైక్ మీద వెళ్ళే తన ప్రాణాన్ని, తన కొడుకుని సర్వదా కాపాడమని. ప్రాణేష్ తల్లిని పిలిచాడు. ఎందుకో అని వెళ్ళింది. "మమ్మీ... రా... ఒకసారి నువ్వు నా వెనక కూర్చో. ఒక్కచిన్న రౌండ్‌వేసి వద్దాం పక్కగల్లీవరకు" అన్నాడు. ముసిముసి నవ్వులు నవ్వుతూ

గర్వంతో కొడుకుని అనుసరించింది. అతను ముందు సీట్లో కూర్చున్నాడు బైక్ స్టార్ట్‌చేసి. ఆమె భయంభయంగా వెనకాల కూర్చుంది. "మమ్మీ... ఏం భయపడకు. నాకు బాగా వచ్చు నడపడం. జ్ఞానేశ్వర్ లేడూ మా క్లాస్‌మేట్. వాడికి ఆల్ రెడీ బైక్‌వుంది. వాడి దగ్గర నేర్చుకున్నా ధైర్యంగా కూర్చో" అంటూ ఆత్మవిశ్వాసంతో చెప్పాడు.

పద్మిని కొడుకుని చూసి, అతను మాటలు విని ఉబ్బితబ్బిబ్బయిపోయింది. కొడుకు స్టార్ట్ చేశాడు. ఆమె వెనక కూర్చుంది.

"మమ్మీ నా నడుము పట్టుకో. జాగ్రత్త!" అన్నాడు. ఆమె ఒక్కక్షణం నివ్వెరపోయింది. ఎక్కడో ఎప్పుడో ఇదేమాట విన్నట్టు. నిన్న మొన్న విన్నట్టనిపించింది. ఒక్కక్షణంలో గుర్తుకొచ్చిందామెకు దుష్యంత్‌తో కోర్ట్‌షిప్ జరిగేరోజుల్లో అతనికి స్కూటర్ వుండేది. అతను ముందుసీట్లో కూర్చుని నడుపుతూంటే, తను వెనకసీట్లో కూర్చునేది. "నా నడుం పట్టుకో మినీ. జాగ్రత్త" అనేవాడు. ఆశ్చర్యం. అదే మాటలు. అదేగొంతు. దీనికిమించి మరో ఆశ్చర్యమైన ఆనందం. కొడుకు వెనకాల కూర్చుంటే అచ్చం దుష్యంత్ వెనకాలే కూర్చున్న ఫీలింగ్ ఆమెకి. అచ్చం దుష్యంత్ లాగే వున్నాడు వెనకనుంచీ చూస్తుంటే. అతని తల వెనక హైర్‌కట్, చెవులు... మెడ. ఒకటేమిటి అన్నీ దుష్యంత్‌లా వుండటమే కాకుండా కొడుకు బాడీ ఓడర్ అచ్చం దుష్యంత్‌కి వున్నట్టనిపించడం. ఆమె ఆనందంతో పరవశించిపోయింది. కొడుకు నడుము ఇంకా గట్టిగా సుతారంగా పట్టుకుంది. తలను అతని వీపుకు ఆనించి, ఒక్కసారి భగవంతుణ్ణి తలుచుకుని ఆనందంతో నిట్టూర్చింది.

ప్రకృతి ఎంత గొప్పది. భగవంతుడు ఎంత గొప్పవాడు. ఎంత దయామయుడు. మగవాడు మళ్ళీ తననుతను సృష్టించుకుంటాడు కొడుకు రూపంలో. భార్య కడుపులో తన అంశ అయిన కొడుకు పుడతాడు. అందుకే భార్య తనకి తెలీకుండా అతనికి తల్లవుతుంది సృష్టిక్రమంలో. ఏవో ఆలోచనలు. ఇల్లెప్పుడొచ్చిందో తెలీదు ఆలోచనల్లో మునిగిపోయున్న ఆమెకి. ఇంట్లోకి వెళ్ళారు తల్లీకొడుకులు. ఇంట్లోకి వచ్చి, తలుపు తియ్యబోతే ఆశ్చర్యం! దుష్యంతరావు అంతకుముందే లోపల వున్నాడు బెడ్‌రూమ్‌లో. పడుకుని పేపర్ చదువుతున్నాడు. మంచి ఆనందమయిన మూడ్‌లో వచ్చిన ఆమె భర్తతో చెప్పింది కొడుకు ఎంత బాగా బైక్ నడిపినదీ... అతను ఎంతో పర్‌ఫెక్టని. చిన్నప్పటి దుష్యంతరావు గుర్తొచ్చిన విషయం కూడా చెప్పింది అతనితో.

అతను ముసిముసినవ్వులు నవ్వుకుని 'ఐసీ' అన్నాడు. కానీ మాటిమాటికీ ఎక్కకు బైక్. వాడు చిన్నపిల్లాడు వాణ్ణి ఒక్కణ్ణే వెళ్లనీ అన్న అతని మాటలకు నవ్వుకుంది అతని పొసెసివ్ నేచర్‌ని తలుచుకుని. 'కన్నకొడుకుమీద కూడా కుళ్లుకుంటాడీయన. వాడి వెనకాల కూచుని ఎప్పుడయినా బయటికెళితే ఏమవుతుంది?' అనుకుంది లోపలోపల.

"అయినా మినీ... నువ్వు బైక్‌మీద వెళ్ళడం బాగుండదు చూసేవాళ్ళకి" అన్నాడు ఆఫీసర్ హుందాతో.

'నాకూ బాగుండదు మీతో వెళితే తప్ప' అనుకుంది మనసులో. అలాగని బయటికి చెప్పి నాగింగ్ చేసేదనిపించుకోవడం ఇష్టంలేక 'ఓకే...' అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది అతనికి ఈవెనింగ్ శ్నాక్స్ ఇవ్వడానికి.

బెడ్‌రూమ్‌లో పేపర్ చదువుకుంటున్న తండ్రి దగ్గర కొచ్చాడు ప్రాణేష్. "డాడీ బైక్ టూ గుడ్‌గా వుంది డాడీ. నేనెలా నడుపుతున్నానో మమ్మీ చెప్పిందా?" అడిగాడు మంచంమీద కాళ్ళవైపు కూర్చుంటూ.

"అవునోయ్... బాగా నడిపావని చెప్పింది. రేపు ఆఫీసునుంచీ పీతాంబరం అంకుల్ వస్తాడు నీ దగ్గరికి. అతనితో

ఆర్.టి.ఏ. ఆఫీసుకెళ్లి అక్కడ ఫార్మాలిటీస్ చూసుకో. అంకుల్ వుంటాడు నీతో. బైక్‌కి సంబంధించిన పన్లన్నీ అయిపోయిన తరువాత నువ్వు ఇంట్లో దిగి, కారు పంపించెయ్" అన్నాడు దుష్యంతరావు. "సరే డాడీ..." అంటూ లేచాడు ప్రాణేష్.

"జాగ్రత్తగా నడుపుతుండు నాన్నా. ఎక్కువ స్పీడ్‌లో వెళ్ళకూడదు. ఓకే?" అన్నాడు కొడుకుమీద కనిపించని ప్రేమతో.

"ఒకే డాడీ" అని తన గదిలోకి వెళ్ళిపోయాడు ప్రాణేష్.

★ ★ ★

నిజం చెప్పాలంటే ప్రాణేష్ అనుకునేంత, వూహించుకునేంత దుర్మార్గుడు కాదు దుష్యంతరావు. కాకపోతే అతనికంటూ కొన్ని ప్రిన్సిపుల్స్, కొన్ని చాదస్తాలూ వున్నాయి. అంతేగానీ పద్మిని గురించిగానీ, ప్రాణేష్ గురించిగానీ పట్టించుకోనంత విలన్ కాదు. వయసులో ఉన్న పిల్లలకు, పెరుగుతున్న పిల్లలకు ఆలోచన తక్కువ. వాళ్ళనుకునేదే కరెక్టనుకుంటారు. ఎంతసేపటికీ వాళ్ల యాంగిల్‌నుంచే ఆలోచిస్తారు. ఎంతసేపటికీ వాళ్ళనుకునేదే జరగాలని పట్టుబడతారు తప్ప ఎదుటివాళ్ళ కష్టసుఖాలు ఆలోచించరు. అలా ఆలోచిస్తే వాళ్లు పిల్లలు కాదు పెద్దవాళ్లనబడతారు. అందుకే ప్రాణేష్‌లో తండ్రి పట్ల ఏర్పడేభావాల్లో అతని తండ్రి తనకి, తన తల్లికి తీరని అన్యాయం చేస్తున్నాడనీ, తమపట్ల ఆయన చాలా దారుణంగా ప్రవర్తిస్తున్నాడనీ అతని అభిప్రాయం. ఎందుకో అతనికి చిన్నప్పటి నుంచీ తండ్రి విషయమంటేనే పడదు. తండ్రి విషయం వస్తే అతనికి ఇరిటేషన్ వస్తుంది. అందులోనూ తల్లి ఆయనపట్ల చూపే ప్రేమ, గౌరవాలు చూస్తుంటే అతనికి ఇంకా కాలుతుంది. ఎవరితోనూ చెప్పుకోలేడు... అలాగని మనసులోనూ పెట్టుకుని భరించలేడు. అందుకే చిన్నతనం నుంచీ అతను అదోరకంగా తయారయ్యాడు. ఎప్పుడు ఎందుకు ఎవరిమీద ఇరిటేట్ అవుతాడో ఎవరికీ అర్థంకాదు. తండ్రి లేని సమయంలో తల్లితో ఎంతగా కలివిడిగావుండి, ఆమెమీద ఎంత ప్రేమ కురిపిస్తాడో చూస్తూంటే మతిపోతూంటుంది. అతని మనసులో 'తండ్రి అనే వ్యక్తి 'ఒకచెడ్డ వ్యక్తి' అనేది ముద్రపడిపోయింది. తండ్రి చేసిన మంచిపనులు ఎప్పుడూ గుర్తుకిరావు అతనికి. ఆరోజు కూడా ఎందుకు తండ్రి గదిలోకి వెళ్లి మంచంమీద కూర్చున్నాడంటే చాలాకాలంగా వున్న తన కోరికని తండ్రి తీర్చాడు కాబట్టి. అంతేగానీ ప్రేమతో దగ్గరికి వెళ్లలా.

మర్నాడు ఉదయం ఆర్.టి.ఏ ఆఫీసుకు వెళ్లడానికి తయారవుతున్న కొడుకు దగ్గర కొచ్చి, "చూశావా ప్రాణా... డాడీ ఎంత మంచివారో... నీకు బైక్ కొనిపెట్టి ఎంత మంచిపని చేశారుకదా! ఆయన పాపం చాలా మంచివారురా... నువ్వారికే ఆయన మీద అలిగి, ఆయనమీద కోపతాపాలు పెంచుకోకురా కన్నా... నా తండ్రివికదూ? డాడీకి నువ్వంటే ఎంత ప్రేమో తెలుసా? నీ గురించి ఎప్పుడూ నా దగ్గర చాలా బాగా చెబుతూంటారు తెలుసా?" అంటూ తండ్రీకొడుకుల మధ్య ఏర్పడుతున్న అగాధాన్ని పూడ్చటానికి ప్రయత్నించింది.

"తెలుసులే ఆయన మంచితనం... ఏంటి కన్నకొడుక్కి కాలేజ్‌కి వెళ్లడానికి బైక్ కొనిపెట్టడం మంచితనమా? మరి ఇంతకాలం నేను స్కూలుకి బస్సులో వెళితే ఒక్కరోజన్నా కారులో దింపాడా ఆయన? కనీసం పొరబాటున డ్రైవర్నయినా పంపాడా నన్ను స్కూలుకి పంపడానికి? ఆయన బైక్ కొనిపెడితే ఏంటట? పరాయివాడికి కొనిపెట్టాడా? నేనేమన్నా అడుక్కునేవాడినా ఆయన బైక్ కొనగానే ఆయన కాళ్లు పట్టుకోవడానికి? తెలుసుకో... ఇప్పటికయినా కళ్లు తెరుచుకో. అక్కడ వాళ్లు, వాళ్లు బైక్

లల్లో పోరు. అందరికీ కార్లు... కార్లు న్నాయి. అర్థమయిందా? ఏదో ఒక్క బైక్ కొనగానే ఓ తెగ ఆనందపడిపోతున్నావ్... అది కూడా ఎంత గొడవ చేస్తే కొన్నాడా యన? ఆపెయ్ మమ్మీ, మనిషిలా సెల్ఫ్ రెస్పెక్ట్‌తో బతకడానికి ప్రయత్నించు" లెక్చ రిచ్చాడు ఎంతకాలంగా మనసులో పెట్టుకు న్నాడో ఇన్ని విషయాలను. తల్లి బాధ పడుతుందని ముందూవెనకయినా ఆలోచిం చకుండా మాట్లాడేశాడు, అన్ని మాటలు మొట్టమొదటసారి ఆమె దగ్గర. ఆమె నిశ్చే ష్టురాలయింది కొడుకు మాటలకి. నిజంగా తన కొడుకేనా ఇన్ని మాటలంటున్నది? తనకు పుట్టిన ఆ పసికందేనా ఇప్పుడిలా తనని నిలదీస్తున్నదని. ఆమె అవాక్క యింది కొన్ని క్షణాలు. ఎలాగో తమాయిం చుకుంది. "నాన్నా... చూడరా... తప్పురా. ఆయన నీ కన్నతండ్రిరా. పరాయివ్యక్తి కాదురా. వాళ్లెవళ్లసంగతో మనకెందుకు చెప్పు? ఆయన మనమనిషి. మనక్కావల సింది ఆయన. ఆయన కార్లుకాదు. అయినా నాకు తెలీక అడుగుతాను, ఆయన మన బాగోగులన్నీ చూడటంలేదా? మనక్కావల సినవి ఇవ్వడంలేదా? మనమూలంగా ఆయన అవస్థలు, అవమానాలూ పడటం లేదా నలుగురిలో? మనమూలంగా ఇంట్లో వాళ్ల తిరస్కారానికి గురి అవటంలేదా? ఒరేయ్ ప్రాణా... ఆయన మంచివాడు కాబట్టి నన్ను చేసుకున్నాడు ఆయనకి పెళ్ళ యిపోయినా! లేకపోతే ఎందుకు అంత రిస్క్ చెయ్యాలి ఆయన నా కోసం? చెప్పు? ఆయన నన్నెప్పుడూ కష్టపెట్టలా? పన్నెత్తి ఒక్కమాట అనలా. ఒక్కసారయినా నన్ను కళ్లెర్రజేసి చూడలా తెలుసా? ప్రేమించడా నికి ప్రయత్నించు. మీ డాడీ చాలా గొప్ప వాడురా. ఆయన మంచితనాన్ని తెలుసుకో వడానికి ప్రయత్నించు. ఆయనపట్ల కృత జ్ఞత పెంచుకో. చిన్నపిల్లవాడివి. ఆయన తప్ప నీకెవరున్నారు చెప్పు? పెద్దయితే నాతో సమానంగా ఆయనను కూడా చూసు కోవాల్సిన నువ్వు ఇలా మాట్లాడితే ఎలా నాన్నా? " అంటూ కంటతడిపెట్టుకుంది. తల్లిని చూస్తుంటే విసుగు వస్తోందతనికి.

"అవును మమ్మీ... నీ కోసం ఆయన చాలా కష్టాలు పడ్డాడని నువ్వు చెబుతు న్నావ్. నువ్వెన్ని కష్టాలు ఆయన కోసం పడ్డావో నాకు... నాకు తెలుసు. నా కళ్లారా చూశా. చిన్నప్పటినుంచీ చూస్తున్నా. సాజ న్‌బినా సుహాగన్‌లా హజ్‌బెండ్ వుండి కూడా అతని గురించి చెప్పుకోలేని స్థితిలో వున్నావన్న విషయాన్ని గుర్తుంచుకో. ఏం, ఆయన చేసుకోకపోతే నీకు పెళ్లయ్యేది కాదా? నీకేం తక్కువ? కన్నొంకరా, కాలొం కరా? ఏదోపెద్ద అప్పటికి గతిమాలిన కురూపిని దయతలచి, ఆయన నిన్ను చేసు కున్నట్టు. లేకపోతే నువ్విప్పటిదాకా పెళ్లిగాక సన్యాసివయ్యేదానివన్నట్టు"

అతని మాటలకడ్డు వస్తూ, "తప్పు కన్నా... చాలా తప్పు మాటలు మాట్లాడు తున్నావ్. ఆయన లేకపోతే నువ్వెక్క డినుంచి వచ్చేవాడివి చెప్పు? ఆయన కొడు కువేకదా నువ్వు? "

చూడు మమ్మీ... నేను నీకు పుట్టకపోతే ఇంకొకడెవడో పుట్టేవాడు నీకు. నేను పుడ తానని ఆయన నిన్ను చేసుకోలేదుకదా? "

"ప్రాణా... తప్పురా. తప్పు! పాపం తగు లుతుంది దేవుడులాంటి మనిషిని పట్టుకుని అన్నేసి మాటలంటే. అందులో ఆయన నీ కన్నతండ్రి. కన్నతండ్రంటే సాక్షాత్తూ దేవు డని అర్థం...చూడు కన్నా ఇలారా నా దగ్గ రికి" అంటూ కొడుకు చెయ్యిపట్టుకుని, హాల్లోవున్న సోఫాదగ్గరకి తీసుకువెళ్లి, సోఫాలో కూర్చుంది. కొడుకుని పక్కన కూర్చోపెట్టుకుని, అతని చెయ్యి తన చేతు ల్లోకి తీసుకుని కొడుకుకున్న దురభిప్రా యాన్ని మార్చాలన్న ఉద్దేశంతో

కన్నయ్యా... నా తండ్రివికదూ... నీలో వున్న చెడు అభిప్రాయాలన్నీ మార్చుకో...

డాడీ సంగతి నీకు తెలీదు. విను, ఒక విషయం చెప్పనా? వాళ్లందరికీ ఆయన ఏవేవో చేస్తున్నాడని నువ్వు బాధపడుతు న్నావ్. ఆయన వాళ్లకి చెయ్యడం ఆయన డ్యూటీ.. ఆయన మనకి చెయ్యడం ఆయన ఔదార్యం. ఆయన వాళ్లకేం చేసినా ఆయన తన ధర్మాన్ని నిర్వర్తించడానికి చేస్తున్నాడు. కానీ ఆయన మనకే చెయ్యటమన్నది ఎవరి కోసమూకాదు... ఆయనకి మనమీదున్న ప్రేమకోసం చేస్తున్నాడు తెలుసా? ప్రేమకీ, డ్యూటీకీ తేడా తెలుసుకో నాన్నా... ఒక విషయం చెప్పనా? ఆయన వాళ్లకి చెయ్యకుండా మనకే అన్నీ చేస్తూన్నాడనుకో, ప్రపంచం ఏమంటుంది ఆలోచించావా? 'దుష్యంతరావు ఎంత దుర్మార్గుడు, భార్యాపిల్లల్ని ఒదిలేసి ఉంచుకున్నదానికోసం, దాని కొడుక్కోసం పడి ఛస్తున్నాడు. అది ఆయనకి మందుపెట్టింది. ఆయన చెడిపోయాడు' అంటారు. మమ్మీని అలా నలుగురూ ఆడిపోసుకోవటం నీకు బావుంటుందా చెప్పు? నామూలంగా డాడీ అందరిలో అవమానాలు పడటం ఆయనకి మంచిదా? మనకి మంచిదా చెప్పు? పోతే పోనీ... వాళ్లనే బాగుపడనీ... ఎవరికి ఎంతెంత ప్రాప్తమో అంతే ఇస్తాడు భగవంతుడు. నాకిలా రాసుంది కాబట్టి నన్ను పెళ్లి చేసుకోవాల్సిన డాడీ ఆమెను చేసుకుని, తరువాత నాకోసమని మళ్లీ పెళ్లిచేసుకున్నారు నన్ను. నాన్నా! ఒకమాట చెప్పనా? తలరాతనెవరూ తప్పించలేరురా... నీకు తెలీదు, నువ్వు చిన్నపిల్లాడివి. ఒకవేళ నన్నే గనక ముందుగా డాడీ పెళ్లిచేసుకున్నట్టయితే ఏంజరిగేదో తెలుసా? ఇంకొకళ్లని మళ్లీ ఆయన చేసుకోవాల్సి వచ్చేది. ఎందుకంటే ఇంకొకదానితో నా భర్తను పంచుకోవాల్సిన రాత నాకు రాసిపెట్టుంటే వాళ్లెవర్నో అనుకుని ఏంలాభం చెప్పు? మీ డాడీకి అందరూ ఎందుకు మర్యాదనిస్తున్నారు చెప్పు? ఆయన వాళ్లనొదలకుండా మనతో వుంటున్నారు కాబట్టి. ప్రపంచంరా ఇది..."

"మరి వాళ్లకిలా మనని ఎందుకు చూసుకోరు? మనకి కూడా కార్లు ఎందుకు కొనలేదు? నువ్వు మాత్రం ఆయనకి పెళ్లాంవి కాదా? ఉంచుకున్నదానివెలా అవుతావ్ మమ్మీ? సిగ్గెయ్యదా నీకలా అనటానికి?"

అతని అమాయకత్వానికి ఆమెకి నవ్వొచ్చింది. "ప్రాణా... మనది ఇస్లామిక్ కంట్రీ కాదు మగవాడు ఒకరికి మించిన భార్యలని పెట్టుకోవడానికి. ఇస్లామిక్ కంట్రీతప్ప ఏదేశస్థులయినా చూడు... ఎవరూ ఒకరికి మించిన భార్యలను పెట్టుకోవడం చట్టరీత్యా తప్పు. అలాగని అందరూ చట్టాన్ని మన్నిస్తున్నారా అని నువ్వడగచ్చు. ఈదేశంలో ఏ రాజకీయనాయకుడూ కరెక్ట్‌గా అతను చెయ్యాల్సినవి చెయ్యడంలేదు. ఏ పోలీసూ సరిగ్గా రూల్స్ ప్రకారం నడుచుకోడు. ఏ అధికారీ కరెక్ట్‌గా నిబంధనల ప్రకారం ఉండడు, చెయ్యడు డ్యూటీని. ఏ వ్యాపారీ చట్టరీత్యా అతని వ్యాపారాన్ని న్యాయంగాను, ధర్మంగాను చెయ్యడు. ఎందుకంటే చట్టంవేరు... స్థిరాస్తుల్ని వెనకేసుకోవచ్చు. అది తప్పవుతుంది. కానీ ఎప్పుడయితే అదే ముఖ్యమంత్రి దేశాన్నీ ప్రజల్నీ అమ్మి తన స్థానాన్ని, ఆస్తిపాస్తుల్నీ పదిలపరుచుకోవడానికి ప్రయత్నిస్తాడో అది నేరమవుతుంది. మనిషిని కొట్టటం తప్పు. చంపడం నేరం! అలాగే ఇది కూడా చట్టాలూ, న్యాయాలూ అన్నీ వుంటాయి. చట్టాలను కాపాడాల్సిన వాళ్లూ, న్యాయాన్ని పరిరక్షించాల్సినవాళ్లు కూడా చట్టానికి వ్యతిరేకమైన పనులను చేస్తున్నారు. కానీ న్యాయంవేరూ మనుగడ వేరు. మనిషి బతకటానికి చట్టాన్ని తయారుచేసుకున్నాడుగానీ, చట్టం బతకటానికి మనిషిని అది తయారుచెయ్యలా. చట్టం చెప్పింది మగవాడికి ఒక భార్య మాత్రమే వుండాలని. ఆఫీసర్లకి ఆఫీసు చెప్పింది రెండోభార్యను పెట్టుకోవడం తప్పని. అలాగే ఆఫీసర్లకి కావలసినవన్నీ ఆఫీస్

ప్రొవైడ్ చేస్తున్నది. మరి ఆ మగాడికి ఇన్ని సదుపాయాలను కల్పించే ఆఫీసుగానీ గవర్నమెంట్‌గానీ అతనికి సుఖశాంతులను ఎందుకివ్వదు? అతనిక్కావలసిన జీవితాన్ని ఎందుకివ్వడంలేదు? మెంటలపీస్‌ను ఎందుకివ్వదు? అతనిక్కావలసిన మానసిక ఆనందాన్ని ఎందుక్విదు? అతని శరీరానికి కావలసిన సదుపాయాలనిచ్చేది, మనసుకి కావలసిన వాటిని గురించి ఎందుకు పట్టించుకోవు ఈ చట్టాలు, ఆఫీసులు, గవర్నమెంటులు? చట్టం ఈవిషయాన్ని ఏ ఆఫీసునూ, ఏగవర్నమెంటునీ అడగదు, అడగలేదు కూడా. ఎందుకంటే మనిషికి కావలసినవన్నీ తనివ్వలేదు కాబట్టి. అందుకే మగవాడు రెండోభార్యను పెట్టుకున్నప్పుడు చూసీచూడనట్టు వదిలేస్తుంది చట్టం. దొంగలూ, దోపిడీకోరులూ, ఖూనీకోరులూ, సంఘవిద్రోహశక్తులూ ఎంతోమంది ఎన్నో నేరాలకు పాల్పడతారు. ఈ నేరాలేవీ కూడా పదిమంది ఎదురుగుండా చెయ్యరు వాళ్లు. అయినప్పటికీ అంతటి కరుడుకట్టిన నేరస్థులని కూడా క్రైం విభాగం పట్టుకోవడంలేదు. వాళ్లు చేసినవి ఏ రుజువూ, సాక్షి ముందు చేసినవి కావు. అయినా వాళ్లు పట్టుబడిపోతున్నప్పుడు ఇలాంటి మగవాళ్ళను పట్టుకోలేకనా? వీళ్ళు చేస్తున్నవి పచ్చినేరగాళ్లు చేస్తున్న నేరాలలాటివి గాదు. పైపెచ్చు ఎంత రహస్యంగా చేస్తున్నా ఆ రహస్యానికి కూడా కొన్ని రుజువులూ, సాక్ష్యాలూ వుంటాయి. మరెందుకీ చట్టవ్యతిరేకశక్తుల్ని శిక్షించటంలేదని నువ్వడగచ్చు. కానీ నాన్నా... ఆ నేరాలముందు ఇదంత నేరం కాదు. రూల్‌ని వయొలేట్ చెయ్యటం తప్ప. రూల్సనేవి మనం ఎప్పుడయినా మార్చుకోవచ్చు కానీ నేరమనేది ఎప్పుడయినా నేరమే అవుతుంది, దాన్నెంత మార్చినా. మీ డాడీ ఒక్కళ్లే కాదు ఇలా చేస్తున్నది, ఎంతో మంది రాజకీయనాయకులు పబ్లిగ్గా చేస్తున్నారు. ఎంతోమంది ఎన్నోరంగాల మనుషులు అందరికీ తెలిసేలాగానే చేస్తున్నారు. కాకపోతే ఇది పబ్లిక్ సీక్రెట్. అంతే- 60 ఏళ్లదాకా ఎందుకు. డాడీని ఎరుగున్న ప్రతి మనిషికీ తెలుసు నేనాయనకి సెకండ్ వైఫ్ నని. కానీ ఆయన నోటితో ఎవరితో ఏమీ చెప్పుకుని పబ్లిసిటీ ఇవ్వలేదు. అలాగని నిజాన్ని కప్పిపెట్టగలమా? ఎవరికీ తెలియదనుకుంటే అది కేవలం మన భ్రమ-

నువ్వన్నట్టు ఎవరినీ ఎవరూ వుంచుకోరు. అది చాలా తప్పుడు మాట. ఎవరో ఎక్కడో పడనివాళ్లో లేక జెలసీతోనో అనే మాట తప్పించి కామన్‌సెన్స్ వున్న ఏ మనిషీ అలాటిమాట అనరు. రాజులు, నవాబుల కాలంలో వాళ్లకి నచ్చిన ఆడవాళ్లని మెయిన్‌టెయిన్ చేస్తూ, వాళ్లకి కుదిరినప్పుడు ఆరునెలలకో సంవత్సరానికో ఒకసారి కనపడి పోయేవాళ్లు. అలాంటి పరిస్థితి కానప్పుడు ఎవరయినా ఎందుకుంటారు చెప్పు? అలాంటి తప్పు అభిప్రాయాల్ని మనసులోంచి తుడిచేసుకోవాలికన్నా నా కన్నయ్యవి కదూ..." అంటూ కొడుకు భుజాన స్నేహపూర్వకంగా చెయ్యి వేసింది.

"నువ్వు నన్ను డైవర్ట్ చెయ్యటానికి ఏవేవో చెబుతున్నావు మమ్మీ. నువ్వు చెప్పినవన్నీ కరెక్ట్‌గానే అనిపిస్తున్నాయి. కానీ ఏం చెయ్యను మమ్మీ. ఈ లైఫ్ నాకు నచ్చలేదు మమ్మీ. ఇంటికి రాబుద్ధవదు. ఇంట్లో వుండబుద్ధవదు. అసలు నాకు చాలా చికాకుగా వుంది మమ్మీ" తలదించుకుని మొహం చిట్లించుకున్నాడు.

"నా బంగారానివికదూ... ఇంట్లో వుండాలనిపించకపోతే నాతో ఎవరుంటారు చెప్పు? నీ మమ్మీని వదిలి నువ్వు కూడా వెళ్ళిపోతే నాకు తోడెవరు చెప్పు? కన్నా... ఒక్కమాట చెప్పనా? నువ్వు వాళ్ళని దృష్టిలో పెట్టుకుని, మనమేదో బాధలు పడుతున్నామనుకుని బాధపడుతున్నావ్... వాళ్లు కూడా మనల్ని దృష్టిలో పెట్టుకుని టెన్షన్‌లోనే వుంటారు తెలుసా? ఎవరి ఇన్

సెక్యూరిటీస్ వాళ్ళవి. ఎవరి భయాలు వాళ్ళవి. వాళ్లు మనకుగానీ... వనం వాళ్లకి గానీ ఎవరూ ఎవరికీ ద్రోహాలూ, మోసాలూ చెయ్యాలా. విధిచేసింది మనందరికీ ద్రోహం. మనమెవ్వరం కూడా ఇలాటి జీవితం కావాలని కోరుకోలా... ప్లాన్‌చేసు కోలా. కానీ ఇలా జరిగింది. చెప్పు, ఎవరు హేపీగా వున్నారు చెప్పు?

"పోనీ... డాడీ హేపీగా వున్నారా చెప్పు? ఇరవైనాలుగ్గంటలూ ఆయనకి టెన్షన్. వాళ్ల గురించీ, మనగురించీ టెన్షన్. అందరి ఫ్యూచర్ గురించీ ఆయనకి టెన్షన్. పేరుకి ఆయన అక్కడుంటారేగానీ ఆయన మన సంతా ఇక్కడే వుంటుంది మనిద్దరం ఆయ నకోసం ఒంటరిగా వుంటామని, తెలుసా? కన్నా... డాడీ గురించి నీకు తెలీదు నాన్నా... ఎప్పుడూ మన గురించే ఆయన బాధ తెలుసా? ఆయనకిమాత్రం మనతో వుండాలని వుండదా చెప్పు? మనకంటే ఎక్కువగా ఆయనకే వుంటుంది తెలుసా? అలాగని ఏమగాడూ చెప్పుకోడు. వాళ్లు లాఫుల్‌గా ఆయన మనుషులు. ఆయన ఎంత చేసినా ఇంకా ఇంకా ఏదో చెయ్యలే దని ఆయనమీద మండిపడుతుంటారు. ఎంతచేసినా వాళ్లకి విశ్వాసం వుండదు. ఆయన వాళ్లకి చెయ్యడం, ఆయనచేత చేయించుకోవడం వాళ్ల జన్మహక్కనుకుం టారు తప్పించి ఆయన మంచి చెడ్డలు కూడా వాళ్లు ఆలోచించడం వాళ్ల బాధ్యతని వాళ్లెప్పుడూ అనుకోరు. అదీకాక మనం ఆయనతో వున్నందుకు ఆయనమీద వాళ్లకె ప్పుడూ కోపమే. వాళ్లకేదో ఆయన తీరని అన్యాయం, ద్రోహం చేసినట్టు వాళ్ల అభి ప్రాయం. మన విషయాన్ని మనసులో పెట్టుకున్న వాళ్లు సమయం వచ్చినప్పుడు ఆయన్ను తప్పకుండా బాధపెడతారు తెలుసా. కన్నా? నేనెప్పుడూ అదే ఆలోచి స్తూంటాను రేపు ఆయన రిటైరయిన తర్వాత. ఆయనకి వయసు పైబడినప్పుడు ఆ పిల్లలు, ఆమె ఆయన్ని ఎంతగా దెప్పిపొడు స్తారో... అవమానాలతో ఎంతగా ఆయన్ని కుంగదీస్తారో... ఆయన్నెంత బాధపెడ తారో, ఇవన్నీ ఆలోచిస్తూంటాను నాన్నా. మనం మనుషులం... మనకి ఇప్పుడున్న ఓపిక పెద్దతనంలో వుండదు. ఆ సమ యంలో మీ డాడీలాటివాళ్లు అక్కడి మను షులమీద డిపెండవ్వాల్సివస్తే ఎంత నర కంగా వుంటుందో ఊహించుకో. దేవుణ్ణి నేనెప్పుడూ ఒకటే ప్రార్థిస్తాను కన్నా- అలాటి పరిస్థితి ఆయనకు రాకూడదనీ, వస్తే అదిచూసే పరిస్థితి నాకు కలగకూడ దనీ, ఆ సమయంలో నన్నీలోకంనుండే తీసి కెళ్లమనీ కోరుకుంటూంటాను. వాళ్లెవరూ ఆయన్ని చూడరుకన్నా... నువ్వే ఆయన్ని కంటికి రెప్పలా చూసుకోవాలి. తెలిసిందా? ఆఫ్టరాల్ నువ్వెవరు? యూవార్ అవర్ లవ్ చైల్డ్‌కన్నా, నువ్వు మా ప్రేమ గుర్తువి. నువ్వు నన్నెటూ చూసుకుంటావ్. కానీ అంతకంటే ఎక్కువగా ఆయన్ని నువ్వు చూసుకుంటేనే నాకు ఆనందం. అవమానా లని అనుకుంటే అవి అవమానాలవుతయ్. అవమానాలకి బదులు త్యాగాలని అను కుంటే ఎంత ఆనందంగా వుంటుందో తెలుసా? స్వార్థమనేది ప్రతిమనిషికీ వుండేదే కన్నా... కానీ త్యాగాలు అందరికీ వుండవ్. అందరూ చెయ్యలేరు, తెలుసా? ఆయనకోసం మనం కష్టపడుతున్నాం. బాధలు పడ్డాం... కానీ మనమనిషికోసమే కదా మనం పడ్డది? పరాయిమనిషికోసం కాదుగదరా బంగారం? డాడీ భగవంతుడికి ప్రతిరూపం... హి ఈజ్ యువర్ రెస్పాన్సి బిలిటీ" అంటూ కంట్లో వచ్చే కన్నీటి ధార లని పైటకొంగుతో తుడుచుకుంటూ అతని భుజంమీద వాలింది.

ఎప్పుడూ ఏ విషయాలూ పెద్దగా పట్టిం చుకోని తల్లి ఇంతేసి ఆలోచిస్తూంటుందా? ఆమెలో ఇన్ని ఆలోచనలున్నాయా? మమ్మీ నిజంగా ఇంత తెలివిగలదా. ఇంత

మంచిదా? అనుకుంటూ నివ్వెరపోయి తల్లిని తదేకంగా చూస్తున్నాడు. ఆమె మీద అతనికి గౌరవం మరింత పెరిగింది. అలాంటి తల్లికి తను కొడుకయినందుకు గర్వపడ్డాడు. ఒక్కక్షణం అతని మనసులో, గుండెలో ఇంతకాలంగా వున్న బరువంతా ఒక్కసారి కిందకి దించేసుకున్నట్టనిపించింది. పెద్ద రిలీఫ్‌గా అనిపించిందా క్షణం.

"మమ్మీ ఐ యామ్ సారీ! తెలిసిగానీ తెలీకగానీ నిన్ను హర్ట్ చేసినట్టయితే ఎక్స్క్యూజ్ మీ మమ్మీ! ఇక ఈ విషయం గురించి నేనెప్పుడూ నిన్ను చికాకు పెట్టను మమ్మీ. ఐ ప్రామిస్ యూ" అన్నాడు కృతనిశ్చయంతో.

"లేదు ప్రాణా... అంతంత మాటలనకు యూవార్ మై చైల్డ్. యూవార్ మై హాపీనెస్. ఒక్కమాట బాగా గుర్తుంచుకో కన్నా. తొందరపడి ఎవరిమీదా కోపం పెంచుకోకూడదు. పరిస్థితుల్ని ఎప్పుడూ అర్థం చేసుకోవాలి. ఎవరయినా మనల్ని హర్ట్ చేశారంటే ఏదో కారణముండి చేశారని తెలుసుకోవాలి. ఆ కారణాన్ని వెదకటానికి ప్రయత్నిస్తే తప్పక దొరుకుతుంది. కారణం తెలిసిన తరువాత మన మనసు కుదుటపడుతుంది. ఎవరూ ఎవరినీ అకారణంగా హర్ట్ చెయ్యరు. అంత ఓపికా తీరికా ఎవరికీ వుండవు. ఎవరయినా అలా చేశారనిపిస్తే దానికి కారణం ఎదుటి వాళ్లే అవుతారు. మనమనేవాళ్లం లేమనుకో. డాడీ వాళ్లతోనే వుండేవారు. వాళ్లకి ఆయనమీద కోపం వుండేదికాదు. అంటే వాళ్లకి వున్న ఆయన మీద కోపానికి కారణం మనమేకదా? అయినా కూడా వాటన్నింటినీ భరించి మన కోసం ఆయన బాధపడుతున్నారంటే ఆలోచించు. అలాంటప్పుడు ఆయనకి అక్కడ శాంతిలేకుండా, ఇక్కడ కూడా శాంతిలేకుండా చేస్తే ఆయన ఎక్కడికి వెళతారు చెప్పు? ఎవరితో చెప్పుకుంటారు చెప్పు తన బాధ. ఒద్దు కన్నా డాడీ ఈజ్ అవర్ ప్రాపర్టీ. ఆయనే మనకి పెద్ద ప్రాపర్టీ అయినప్పుడు ఆయన సంపాదించిన ప్రాపర్టీలు మనకి వుంటే ఎంత లేకపోతే ఎంత? నో బీ మైచైల్డ్. నువ్వు బాగా చదువుకో. వ్యక్తిగా నువ్వు బాగా ఎదగాలి. బాగా సంపాదించుకో. యూషుడ్ బీ కైండ్ ఇనఫ్ లైక్ యువర్ ఫాదర్" అంటూ కొడుకుని హత్తుకుంది. ప్రాణేష్‌కి ఆరోజుతో తన తల్లంటే ఏమిటో, ఆవిడ నిజస్వరూపమేమిటో అర్థమయి, తల్లిని చూసుకుని ఎంతో మురిసిపోయాడు.

అప్పటికే తండ్రి పంపిన కారు వచ్చి వుంది బయట. గబగబా లేచి తయారయి వెళ్లిపోయాడు వచ్చిన పీతాంబరం అంకుల్‌తో.

పద్మిని తలంతా పుండయిపోయినట్టనిపించింది కొడుకుతో మాట్లాడిన ఎమోషనల్ టాక్‌తో. ఆవిడ శరీరంలోని అన్ని నరాలనూ కూడగట్టుకుని ఒక్కో విషయం జాగ్రత్తగా ఓపికతో చెప్పింది కొడుక్కి. చిన్నపిల్లవాడవటంవల్ల. కొడుకుతో ఇంతకుముందెప్పుడూ ఇలా మాట్లాడలేదామె. ఆమెకే ఆశ్చర్యమేసింది ఎందుకు ఇన్ని విషయాలను చర్చించినట్టో అని. నిజానికి అలాటి విషయాలు కొడుక్కి చెప్పడం ఆమెకు నచ్చదు. కానీ అప్పుడు ఆమె అలా చేసి వుండకపోతే అతనికి పరిస్థితులెప్పుడూ అర్థమయేవికావు. ఒకవిధంగా మంచి పనే చేసింది అతనితో అలా మాట్లాడి. ఎందుకంటే అతను ఎదుగుతూన్నాడు. పదహారు సంవత్సరాలు దాటాయంటే పసిపిల్లవాడేం కాదుగదా! అదీగాక ప్రాణేష్ వయసుకి మించి కనబడతాడు. అలాగే వయసుకి మించిన మెచ్యూరిటీ కనబడుతుంది అతనిలో. ఎప్పుడయినా అతనికి అన్ని విషయాలూ తెలియాల్సిందే. అతని దగ్గర విషయాలను ఎందుకు దాచాలి అనుకుంది పద్మిని.

* * *

చూస్తుండగానే ఇంకో సంవత్సరం గిర్రున తిరిగి పోయింది. ప్రాణేష్ ఇంటర్ సెకండియర్‌లోకి వచ్చాడు. బైక్‌కొన్న మర్నాడు

తన తల్లి తనకి చేసిన బ్రెయిన్‌వాష్ అతనికి చాలాకాలం పనిచేసింది. సుమారు ఏడెనిమి దినెల్లు. ఆ ఏడెనిమిది నెలలు హాయిగా చదువుకున్నాడు ఆనందంగా టైం పాస్ చేశాడు. తండ్రిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. ఈ విషయాలేవీ దుష్యం తరావుకి తెలీదు. యధాప్రకారం అలవా టుగా ఆఫీసునుంచి తిన్నగా వచ్చేస్తాడు పద్మిని దగ్గరకు. అతని మైండ్ అలా ట్యూనప్ అయిపోయింది. ఆమె అతనికి అర్థభాగం. ఏవిషయాన్నయినా ఆమెకు చెప్పకుండా వుండడు. ఆఫీసులో ఏదయినా విషయం జరుగుతూన్నప్పుడే అతనికి పద్మిని గుర్తొస్తుంది. వెంటనే ఆమెతో చెప్పి ఆమెతో షేర్ చేసుకోకపోతే అతనికి తోచదు. వెలితిగా వుంటుంది. ఒకవేళ ఏ పరిస్థితిలోనయినా రావడం కుదరకపోతే ఫోన్‌లో చెబుతాడు విషయాన్ని పూసగుచ్చి నట్టు.

ఫస్టియర్ ఇంటర్ ఇంకా రెండు నెలల్లో అయిపోతుందనగా మళ్లీ ఏదో వచ్చిపడింది ప్రాణేష్ ప్రాణానికి. తండ్రి చేసిన పనేదో అతనికి నచ్చలేదు. కథ మళ్లీ మొదటికొ చ్చింది. విషయాన్ని గమనించిన పద్మిని ఎటూ చెప్పలేక బాధపడింది. దుష్యంతరా వుకి ఏ విషయాలూ తెలీవు. కొడుకు చికాకు పడుతున్నాడనికానీ అతని చికాకుకి కారణం తనే అనిగానీ ఏవీ తెలియవు, ఆ ఇంట్లో ఆయన వుండడుకాబట్టి. వీటన్నింటినీ చూస్తూ బాధపడింది తప్ప ఎవరినీ ఏదీ అడిగే పరిస్థితిలో లేదు పద్మిని.

ఇంటిముందు మెయిన్‌రోడ్డు... ఆ మెయిన్ రోడ్డు క్రాస్ చేసి తిన్నగా వెళితే అక్కడొక పెద్ద బంగ్లా. ఆ బంగ్లా పద్మిని ఇంటికి ఎదురుగా కనబడుతుంటుంది. ఆ కనిపించే బంగ్లాలోపల ఎంతమంది మను షులుంటారో తెలీదుగానీ ఇల్లు మాత్రం ఎప్పుడూ మనుషులతో హడావుడిగా వుంటుంది. రెండు మూడు పెద్దపెద్ద కుక్కలు. బయట యూనిఫాం వేసుకున్న సెక్యూరిటీ వాడు... లోపల రెండుకార్లు, హడావుడి. ఆ ఇంట్లోంచి యాభై యాభై అయిదు సంవత్సరాల వయసులోవున్న ఒకామె కారులో బయటికెళ్లడం చూసింది పద్మిని. వయసయిపోయినా చూడటానికి హుందాగానూ అందంగానూ, నీట్‌గా కనబ డుతోంది గోల్డ్‌కలర్ కళ్లద్దాలు పెట్టుకుని.

ఆ రోజు దసరాపండగ. కాలింగ్‌బెల్ చప్పుడయితే తలుపు తెరిచింది పద్మిని. తలుపు బయట నిలబడ్డ వ్యక్తిని చూసి కళ్లా ర్పకుండా నిలబడింది పద్మిని. ఆ వ్యక్తి ఎవ రోకాదు, ఎదురు బంగ్లాలో ఇంతకుముందు చూసిన గ్రాండ్‌లేడీ.

"హెలో... మే ఐ కమిన్ ప్లీజ్?" అడి గింది.

"ప్లీజ్ కమిన్" అంటూ తలుపులు బార్లా తెరిచింది.

హాల్లోకి తీసికెళ్లి సోఫా చూపించింది కూర్చోమని ఆమె చేతిలో వున్న స్వీట్‌బాక్స్ పద్మిని చేతికందిస్తూ "ఈరోజు విజయదశ మికదా! స్వీట్ ఇద్దామని వచ్చాను. అదీకాక విజయదశమిరోజు నా కొడుకు పుట్టినరోజ వడం విశేషం" హిందీలో చెబుతున్నది.

"ఓ నైస్! మిమ్మల్ని నేను చూశాను. ఎదు రుగావున్న బంగ్లాలో వుంటారుకదూ?"

"యూ ఆర్ యాబ్సొల్యూట్లీ కరెక్ట్. బైదబై... నేనెవరో చెప్పలేదు కదూ! ఐ యామ్ మిసెస్ కుల్‌కర్ణి. ఆర్మీలో నా హజ్‌బెండ్ బ్రిగేడియర్‌గా చేసేవారు" అంటూ ఆగిపోయింది.

"వెరీనైస్ వారెక్కడ? అయినా వాళ్లె ప్పుడూ ఒక చోటని వుండరుకదా" ఏదో అనాలని అంది పద్మిని.

"వారు చనిపోయి పది సంవత్సరాల యింది. ఈ వూరు వచ్చి చాలా కాలమ యింది. అలవాటయిన వూరు, అందు లోనూ వారికి ఇష్టమైన ఇల్లని అక్కడే వుంటాను. మా ఇంటిని వారు చాలా

ఇష్టంతో దగ్గరుండి కట్టించుకున్నారు" అంటున్నది. ఆమెలో కలిగే బాధకి తెల్లని ఆమె బుగ్గలు ఎరుపురంగయిపోయాయి.

"ఐ యామ్ సారీ మేడమ్! అన్నట్టు మిమ్మల్ని చూసి నార్తిండియన్స్ అయుంటా రని అనుకున్నాను. మొత్తానికి ఇక్కడివారు కారన్న మాట"

"యా వి ఆర్ మహారాష్ట్రియన్స్ బేసికల్లీ. ఆయన పేరు రాధేషాం కుల్‌కర్ణి. ఆర్మీలో బ్రిగేడియర్‌గా ఉన్నప్పుడు సడన్‌గా హార్ట్‌ఎటాక్ వచ్చి డ్యూటీలో వుండగానే పోయారు. మా అబ్బాయి అమెరికాలో డాక్టర్. నేనొక్కర్తాన్నే వుంటానా ఇంట్లో. ఆఫ్‌కోర్స్ పనివాళ్లు, వంటమనిషి వున్నారను కోండి. నాక్కావాల్సినవాళ్లే నా దగ్గర లేరంతే" ఒక్క క్షణం ఆగింది ఆమె.

"నా హజ్‌బెండ్ ఈసీఐఎల్‌లో డెప్యూటీ జెనరల్ మేనేజర్. మిస్టర్ దుష్యంతరావ్. మా అబ్బాయి ప్రాణేష్. ఇంటర్ సెకండి యర్ చేస్తున్నాడు. నేను పద్మిని! హౌస్‌వైఫ్‌ని" తన పరిచయం చేసుకుంది.

"ఓ హౌ స్వీటాఫ్ యూ. మీ పేరు పద్మిని అని ప్రత్యేకించి చెప్పనవసరం లేదేమో. ఎందుకంటే మీరు మేరా నామ్ జోకర్‌లో వున్న పద్మినిలానే కనిపించు తారు. రియల్లీ... యూ ఆర్ సో బ్యూటిఫుల్! బైదబై మీ సన్ పేరు ప్రాణేషా? అతన్ని నేను రోజుకొక సారయినా తప్పనిస రిగా చూస్తాను. ఎందుకో తెలుసా? "

"తెలీదు"

"మీ ప్రాణేష్ మా అబ్బాయి మీరాషామ్‌కి సొంత తమ్ముడిలా కనిపిస్తాడు. అంటే అచ్చం మా అబ్బాయిలానే వుంటాడు. కాక పోతే అతను కాస్త పెద్దవాడు, ఇతను కాస్త చిన్నపిల్లాడు. మావాడి బర్త్‌డేకదా అని మీ అబ్బాయికి స్వీట్ ఇచ్చినట్టుంటుంది అలాగే ఒకసారి చూసినట్టు కూడా వుంటుందని వచ్చాను"

"ఓ, నైస్ దూరంగా ఎక్కడో ఇద్దరి మొహాలూ కలిసినట్టున్నాయి" అంది సిగ్గుప డుతూ.

"భలేవారే... మొహాలు కలవటమా పాడా ఇద్దరికిద్దరూ ట్విన్స్‌లానో సొంత అన్నదమ్ముల్లానో వుంటారు. కావాలంటే ఇదిగో ఈ ఫొటో చూడండి" అంటూ హాండ్‌బాగ్‌లో వున్న ఆమె కొడుకు మీరాషామ్ ఫొటోని పద్మిని చేతిలో పెట్టింది.

పద్మిని ఆ ఫొటోని అందుకుంది. షాక్ తిన్నది. ఆ ఫొటోలోని అబ్బాయి నిజంగానే ప్రాణేష్‌లా వున్నాడు. చాలా ఆశ్చర్యపో యింది. గబగబా అల్లం టీ తయారుచేసి ఇచ్చింది. ఇద్దరూ తాగారు. కాసేపు ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు హిందీలోనే. ఆమెతో మాట్లాడుతుంటే పద్మినికి హాయిగా అనిపిం చింది. సొంతవాళ్లతో మాట్లాడుతున్న అను భూతి కలిగింది. అదీగాక మిసెస్ ఆర్.ఎస్.కుల్‌కర్ణి చాలా ఫ్రాంక్‌గా మాట్లాడే మని షిలా కనిపించింది. అందుకే ఆమంటే ఇష్టంగా అనిపిస్తోంది.

చాలాసేపు కూర్చుంది ఆమె. బహుశా ప్రాణేష్‌ని చూడాలని అనిపించి వుంటుం దేమో. బయటికి ఫ్రెండ్స్‌తో వెళ్లిన ప్రాణేష్ ఇంకా ఇంటికి రానేలేదు. సాయంకాలమవు తున్నది. దుష్యంతరావు రావటంతో మిసెస్ కుల్‌కర్ణి లేచింది. ఆయనకి ఆమెను పరి చయం చేసింది పద్మిని. ఆయన ఆమెను పలకరించి లోపలికెళ్లాడు.

"ఓకే పద్మినీజీ. మీ హజ్‌బెండ్ వచ్చారు కదా! నేనింక వెళతాను. మళ్లీ కలుద్దాం. మీ టీ చాలా బాగుంది మీలాగే. రండి మా ఇంటికి. ఎదురు ఇల్లేకదా" అంటూ లేచింది. బయట గేటుదాకా ఆమెననుసరించింది పద్మిని.

వచ్చిన ఆమె తన అందం గురించి పొగ డటంవల్లనో తన కొడుకు ఆమె కొడుకులా వుండటంవల్లనో లేక మాట్లాడటానికి ఒక ఆడప్రాణి దొరకటంవల్లనో మొత్తానికి పద్మి నికి ఉషారు కలిగింది. అదే మూడ్‌లో భర్త

వున్న చోటికి వెళ్లింది.

"ఏమిటి సంగతి... ఈ రోజు చాలా హుషారుగా వున్నావ్? చాలా రోజుల యింది మినీ నిన్నిలా చూసి"

సిగ్గుపడింది అతనన్న మాటలకి. తరువాత ఎలాగో సర్దుకుని ఆమె వచ్చిన విషయం ఆమె చెప్పిన విషయాలు అన్నీ ఒకదానికొకటి కళ్లకు కట్టినట్టు చెప్పింది భర్తకు. దుష్యంతరావు కూడా ఆసక్తికరంగా విన్నాడు భార్య చెప్పిన విషయాలని. కాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకున్నారు. అతను భోజనంచేసి కాసేపు రెస్ట్ తీసుకున్నాడు.

మళ్లీ ఇంకొక రోజు ప్రాణేష్ అప్పుడే కాలేజ్‌కి వెళ్లబోతూంటే వచ్చింది మిసెస్ కుల్‌కర్ణి. ప్రాణేష్ చెయ్యి పట్టుకుని తనని తను పరిచయం చేసుకుంది. చేతిలోవున్న కొడుకు ఫొటో అతనికి చూపించింది. అచ్చం తనలానేవున్న ఆ ఫొటోలోని వ్యక్తిని కన్నార్పకుండా చూశాడు ప్రాణేష్. వాళ్లిద్దరూ



లోపల హాల్లోకొచ్చారు. పద్మిని కూడా వాళ్లతో జాయిన్ అయింది. ముగ్గురూ ఏవో శ్నాక్స్ తిన్నారు. మిసెస్ కుల్‌కర్ణి ఆనందసాగరంలో మునిగితేలుతోంది ప్రాణేష్ పక్కన కూర్చుని, అతనితో కబుర్లు చెబుతూ. మధ్యమధ్యలో ఆమె పద్మినినీ, ఆమె అందాన్నీ పొగుడుతోంది.

పద్మిని ఆమెకంటే చాలా చిన్నది. ఇద్దరికీ మధ్య పన్నెండు పధ్నాలుగేళ్ల వ్యత్యాసమయినా వుంటుంది. పద్మిని చేసిన పెయింటింగ్ హాల్లో తగిలించివుంది గోడకి. చక్కటి ఆకుపచ్చటి లాన్‌లో డార్క్ బ్రవున్ కలర్ గుర్రం అది. ఆ గుర్రం ఆరోగ్యకరమైన కండరాలతో ఒంపుసొంపులతో ఎంతో అందంగా వుంది. చాలా అనుభవం కలిగి, చెయ్యి తిరిగిన ఆర్టిస్ట్ గీసినట్టున్నది ఆ పెయింటింగ్. కిందటిసారి మిసెస్ కుల్‌కర్ణి వచ్చినప్పుడు ఆ పెయింటింగ్‌ని అంతగా పట్టించుకోలా స్వపరిచయాలూ, ఉపోద్ఘాతాలతో. ఇప్పుడు మొదటిరోజున్న కొత్తలేదు. అందుకే ఆ పెయింటింగ్ గురించి చాలా వివరాలు అడిగి తెలుసుకుంది పద్మిని దగ్గర. పద్మిని తనకి చెల్లెలులాంటిదనీ, తనని దీదీ అని పిలవమంది. పద్మిని సరే అంది. ప్రాణేష్‌తో చెప్పింది అతను ఆమెకు కొడుకులాటి వాడనీ, ఆమెను బడీమమ్మీ అని పిలవమంది. సరేనన్నాడతను.

నిజానికి అంతటి హైసొసైటీ లేడీస్ అలా చుట్టుపక్కల ఇళ్లకి వెళ్లడం అరుదు ఎదుటివాళ్లు ఎంత గొప్పవాళ్లయినా. కానీ మిసెస్ కుల్‌కర్ణి అలాకాదు. ప్రాణేష్‌ను చూడాలనీ, ఆమె కొడుకుని అతనిలో చూసుకోవాలనీ, ఈ విషయాల్లో ఆమె రాజీ పడదలుచుకోలా. ఎలాటి నియమాలనూ పాటించదలుచుకోలేదు. బ్రిగేడియర్ అంటే చిన్న పదవి కాదు. అంతపెద్ద ఆఫీసర్ భార్య అందులో ఆర్మీవాళ్ల విషయాలు బయటి జనాల విషయాలకి అంతుచిక్కని విధంగా వుంటాయి ఆహార, వ్యవహార, ఆహార్యంలో. ఆమె ఈ ఒక్క విషయంలో మాత్రం దేన్నీ లెక్కచెయ్యదలుచుకోలేదు. అందుకే ప్రాణేష్‌ని వెతుక్కుంటూ అతని ఇంటికి వచ్చింది. అదీగాక పద్మిని నార్తిండియనవడంవల్ల ఆమెకు బాగా నచ్చింది. పద్మిని నేచర్ నచ్చింది. పద్మినిని చూస్తే పరాయి మనిషిలా ఆమెకి కనిపించటంలేదు అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పింది. మొత్తానికి పద్మినికి కాస్త కాలక్షేపం దొరికింది ఇంతకాలానికి.

భర్తతోతప్ప ఎప్పుడూ ఇంటిగడప దాటని పద్మిని మిసెస్ కుల్‌కర్ణి ఇంటికి ఒకసారి వెళ్లింది ఆమె బలవంతం మీద. తను కూడా ఒక ఆఫీసర్ భార్య ఎలా నడుచుకుంటుందో అలాగే నడుచుకుంటుంది హుందాగా. అందరినీ పూసుకోవటం చీటికి మాటికి బయట కనిపించటం నైబర్స్ ఇళ్లలోకి వెళ్లి వాళ్లని పూసుకోవటాలు చెయ్యదు. దుష్యంతరావుకు నచ్చదు తన భార్య అలా వుండటం. అందుకే తన భర్తకి అనుగుణంగా నడుచుకుంటుంది. ఎవరింటికీ వెళ్లటం అతనికి నచ్చదుకాబట్టి చాలాసార్లు బతిమాలితే పెద్దావిడగదా బావుండదని ఒక్కసారి మాత్రం వెళ్లింది ఆవిడని నొప్పించడం ఇష్టంలేక. భర్తకి నచ్చని ఏ పనీ ఆమె ఇంతవరకూ చెయ్యలేదు. ఆమె అందాన్ని ఆడవాళ్లు చూసినా అతను భరించుకోలేడు. అంత పొసెసివ్ అతను ఆమెపట్ల.

★ ★ ★

మిసెస్ కుల్‌కర్ణి పద్మిని ఇంటికి తరచుగా వస్తోంది. ప్రాణేష్ సిగ్గుపడుతున్నా సరే అతన్ని బలవంతంగా ఆమె ఇంటికి తీసికెళ్లి అతని చేత ఏవేవో తినిపించేది. నెమ్మదిగా అతన్నిమచ్చిక చేసుకుంది ఆమె ప్రేమతో.

ఇంటర్‌మీడియెట్ కంప్లీట్ చేశాడు ప్రాణేష్. ఎనభై శాతం మార్కులతో పాసయ్యాడు. బి.యస్సీ సైకాలజీ తీసుకున్నాడు. గ్రాడ్యుయేషన్ మొదటి సంవత్సరం మొదలయింది.

ఈలోపు మిసెస్ కుల్‌కర్ణి వాళ్లింట్లో ఒక సభ్యురాలయింది. ఆమె అక్కడ తనింట్లో ఒంటరిది. ఇక్కడ పద్మిని ఒంటరిది. భర్తకి పగలంతా ఆఫీసు, సాయంకాలం అతను వచ్చినప్పుడు తప్ప మిగతా టైమంతా ఖాళీయే. అప్పటికీ ఏదయినా చదువుకోవటమో పెయింటింగ్స్ వేసుకోవటమో పూజో ఏదో ఒక వ్యాపకం పెట్టుకుంటూనే వుంటుంది. అన్నింటికంటే పెద్ద వ్యాపకం గార్డెనింగ్ వుండనేవుంది. భర్త ఇంట్లో వున్నంతసేపూ ఆమెని ఒక్కక్షణం ఎటూ కదలనివ్వడు. ఎప్పుడూ ఎదురుగానే వుండాలామె. అతను ఇంట్లో వున్నంతసేపూ టైమ్ ఎలా పరిగెత్తుతుందో తెలీదు. తరువాత టైమ్ ఎంత నత్తనడక నడుస్తుందో కూడా తెలీదు. మొత్తానికి మిసెస్ కుల్‌కర్ణితో కాలక్షేపం బాగానేవుంది.

ఆమె సికిందరాబాద్ క్లబ్‌లో మెంబర్. అప్పుడప్పుడు ప్రాణేష్‌ని తీసికెళుతుంది క్లబ్‌కి. అక్కడ అతనికి భోజనం పెట్టించి అతన్ని యువరాజుని చూసినట్టు చూసుకుంటుంది. అతనిచేత పెద్దమమ్మీ అని రైట్‌రాయల్‌గా పిలిపించుకోవటం మొదలుపెట్టింది. క్లబ్బులో ఆమె పరిచయస్థులకి తన చెల్లెలు కొడుకని పరిచయం చేసింది. వాళ్లందరూ కూడా ఆమే మాటలు నమ్మారు. అతను హిందీ అనర్గళంగా మాట్లాడటంవల్ల, అతను మీరాషామ్‌లా కనబడటం వల్ల తండ్రి తెలుపు, తల్లి తెలుపు నాచురల్‌గా ప్రాణేష్ కూడా మంచి రంగు. నార్తిండియన్‌లా కనబడతాడు చూసేవాళ్లకి. మదర్ మదర్‌టంగ్ వల్ల మంచి హిందీ అబ్బింది అతనికి. పద్మిని దుష్యంతరావుతో అచ్చ తెలుగు మాట్లాడుతుంది. కొడుకుతో కూడా తెలుగులోనే మాట్లాడుతుందిగానీ అప్పుడప్పుడు ఆమెకి తెలీకుండానే హిందీ వచ్చేస్తుంది సంభాషణలోకి. చిన్నతనంనుంచీ తల్లితో హిందీ అలవాటయింది. తల్లి అతని చేత గోరుముద్దలు తినిపించేటప్పుడు, టబ్‌లో స్నానం చేయించేప్పుడు, రాత్రిపూట చందమామని చూపించి అన్నం తినిపించేటప్పుడు బయట వాళ్లకి ఆమె నార్తిండియన్ అనే విషయం అనుమానంగా అయినా రాదు. మొత్తానికి క్లబ్బులో అతను ఫెమిలియర్ అయాడు అందరికీ మిసెస్ కుల్‌కర్ణి మనిషిగా.

రానురానూ ప్రాణేష్‌కి కూడా బాగానే వుంది ఆమెతో కలిసి బయటకి వెళ్లడం. అప్పుడప్పుడు ఆమెతో షాపింగ్‌కి వెళ్లటం, ఎప్పుడయినా ఆవిడ చుట్టాలెవరన్నా వస్తూంటే ఆమెతోబాటు ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లడం, ఆమె కార్లలో తిరగడం, ఆమెతో క్లబ్బుకెళుతుంటే రకరకాల మనుషులతో పరిచయాలవడం అందులోనూ ఆమె సర్కిలంతో ఆర్మీవాళ్లవడంతో ఆ ప్రపంచమే విచిత్రంగా వుందతనికి. సాధారణంగా ఆర్మీలో వున్న వాళ్లు వాళ్ల కుటుంబాలూ చాలా ఫాస్ట్‌గా వుంటారు. వాళ్ల ప్రవర్తన, అలవాట్లు చాలా ఫ్రాంక్‌గా వుంటాయి. చాలా వరకు మనుషులంతా చిన్నాపెద్దా తేడా లేకుండా కలివిడిగా వుండటం, హిపోక్రసీ లేకుండా వుండటం, డిసిప్లిన్, డిగ్నిటీ, ఆత్మవిశ్వాసం ప్రతిమనిషిలో కొట్టొచ్చినట్టు కనబడుతుంది. ఏ విషయాన్ని వాళ్లు సీరియస్‌గా తీసుకోరు. ఎంత పెద్ద సమస్యనయినా నవ్వుతూ పరిష్కరించే స్వభావం. ఒక మాటలో చెప్పాలంటే ఆ కోవకు చెందిన మనుషులంతా అసలు జీవితాన్ని ఎన్‌జాయ్ చెయ్యడానికే పుట్టారేమో అనిపిస్తుంటుంది. మిసెస్ కుల్‌కర్ణి కూడా అంతే. ఆవిడ ఈ వయసులో కూడా చాలా చలాకీగా వుంటుంది. ఆమెలోని ఆ లక్షణం ప్రాణేష్‌కి బాగా నచ్చింది. ఆమె అసలు వయసుకంటే పది సంవత్సరాలు చిన్నదానిలా కనబడుతుంది. అతని తల్లి అలా కాదు. ఉన్న వయసుకి ఎక్కువగానే కనబడుతుంది. ఎప్పుడూ పూజలూ పునస్కారాలంటూ ఉంటుంది. ప్రపంచ భారాన్నంతా

తనే మోస్తున్న దానిలా వుంటుంది ఎప్పుడు చూసినా. నిజమే... ఆమె సమస్యలూ, బాధలూ ఆమెవి. కానీ వాటిని ఎవరూ పరిష్కరించలేనప్పుడు వాటిమూలంగా జీవితాన్ని నరకప్రాయం చేసుకోవటం ఎందుకు? బలవంతంగా బతుకుతున్నట్లెందుకుండాలి? అనే ప్రశ్నలు ఉదయిస్తాయి అతనికి వీళ్లందరినీ చూసినప్పుడు. అతనికి ఎప్పుడూ తల్లి గురించే ఆలోచనలు... బాధ. అతనెంతమంది మధ్యలో ఉన్నప్పటికీ తల్లే ఎప్పుడూ అతని మనసులో వుంటుంది. అయినా ఒక్కోసారి ఆ ముసలావిడ వెంట తిరగాలంటే కంపరం పుడుతుంది అతనికి. ఎంత తప్పించుకుందామన్నా బల్లిలా తయారయింది ఆవిడ వదలకుండా. తన ఫ్రెండ్స్ కూడా కొన్నిసార్లు కామెంట్ చేశారు అతన్ని. అదీగాక ఆడంగిలా ఆమెతో తిరగడం అతనికే చికాకుగా వుంది. కానీ ఆవిడ ఇతన్ని సెంటిమెంట్‌తో పడేసింది. ఏం చెయ్యలేకపోతున్నాడతను.

మొత్తానికి అతనికి మిసెస్ కుల్‌కర్ణి సర్కిల్‌లో హీరో ట్రీట్‌మెంట్ జరుగుతుంది. సెంటరాఫ్ ఎట్రాక్షనంతా అతనిమీదే ఎప్పుడు క్లబ్బుకెళ్లినా. అదీగాక రకరకాల చోట్లకెళ్లటం, రకరకాల మనుషుల్ని కలవడం, క్లబ్బులు, ఔటింగ్ నిజానికి అతను కోరుకున్న జీవితం కూడా ఇదే. కాకపోతే ఆ జీవితాన్ని తన తల్లిదండ్రులతో కోరుకున్నాడుగానీ ఇలా పరాయివాళ్లతో కాదు. ఎంత ఆనందమయమయిన వాతావరణంలో వున్నా సడన్‌గా మూడీగా అయిపోతుంటాడు ఇల్లు గుర్తొచ్చినప్పుడల్లా. ఇది గమనించిన మిసెస్ కుల్‌కర్ణి చాలాసార్లు అతన్ని అడగాలని అనుకుంది. కానీ పిల్లవాడు దాన్ని ఎలా రిసీవ్ చేసుకుంటాడో అసలుకే మోసం జరిగి తనని ఎవాయిడ్ చేస్తాడేమోనని భయపడేది. ఎప్పుడడగాలో ఆమెకర్థం కాలేదు. అవకాశంకోసం ఎదురు చూస్తోంది. ఎదురు చూసిన అవకాశం రానేవచ్చింది.

ఆరోజున ప్రాణేష్‌తో స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియాకు వెళ్లింది డబ్బు డ్రా చేసుకోవడానికి. టోకెన్ తీసుకుంది. తన టర్న్ రావడంకోసం సోఫాలో కూర్చుని ఎదురు చూస్తోంది. పక్కన ప్రాణేష్ కూడా వున్నాడు. ఆమె ఎదురుగా వున్న కాష్ కౌంటర్‌కేసి చూడసాగింది తనవంతు కోసం. సడన్‌గా పక్కకి తిరిగి చూసింది. తలవంచుకుని నేల చూపులు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు ప్రాణేష్.

"బేటా ప్రాణేష్ ఏంటి ఇవాళ చాలా డల్‌గా కనబడుతున్నావ్? ఆర్‌యూ ఆల్ రైట్? ఇంట్లో ఏదయినా ప్రాబ్లమా?" మామూలుగా అడిగింది.

"ఏం లేదు పెద్దమమ్మీ... ఎవ్విరిథింగ్ ఈజ్ ఓకే. ఐయామ్ పర్‌ఫెక్ట్‌లీ ఆల్‌రైట్" అంటూ లేని నవ్వును పులుముకున్నాడు. అది ఆమె గమనించింది ఆమెకున్న జీవిత అనుభవంతో.

"బేటా... నేనొకమాటడుగుతాను. ఏమనుకోవు కదా"

ఉలిక్కిపడ్డాడు ఆ మాటలు విని. "అబ్బెబ్బె... ఛాఛా... అలా ఏమీ అనుకోను అడగండి పెద్దమమ్మీ"

"చూడు ప్రాణేష్... నిన్ను సంవత్సరం పైగా చూస్తున్నాను. అబ్జర్వ్ చేస్తున్నాను. అంతా బాగానే వుంది. కానీ వున్నట్టుండి మూడీగా అయిపోతుంటావ్. చాలా మంచి పరిసరాల్లోవున్నాసరే సడన్‌గా సీరియస్‌గా కనబడుతుంటావ్. నువ్వేమనుకోకు నేనలా అంటున్నానని. నీ వయసు పిల్లలు ఎప్పుడూ నవ్వుతూ ఆనందంగా వుండాలి. అంతేగానీ ఇప్పుడే నువ్వింత మూడీగా వుంటే ఎలా చెప్పు? ఇలా అంటున్నానని నువ్వు మరోలా అనుకోకు. నీ ప్రాబ్లం ఏమిటి? ఇంట్లో ఏదయినా ఇబ్బందా?" అడిగింది స్వీట్ వాయిస్‌తో.

ఆమె అడిగిన ప్రశ్నలలో ఒకేఒకమాట

అతన్ని కదిలించగలిగింది. ఒకేఒక మాట అతన్ని మాట్లాడేలా చేసింది. 'నీ వయసు పిల్లలు ఎప్పుడూ నవ్వుతూ ఆనందంగా వుండాలి' అంది. ఈ వయసే కాదు. తనకి ఊహ తెలిసినప్పటినుండీ ఏ ఒక్కరోజునా అతను పూర్తిగా ఆనందంగా లేడు. అలా వుండనివ్వలేదు అతని ఇంటివాతావరణం. దానికి ఎవరు బాధ్యులో అతనికి తెలీదు. అనవసరం. కానీ బాధితుడు మాత్రం తనే నని అతని ఉద్దేశం.

"లేదు పెద్దమమ్మీ... నాకు తెలీదు ఎందుకలా అవుతానో... కానీ మీరు అన్నట్టు మూడీగానే వుంటూంటాను చాలా వరకు. దీనికి సమాధాన మేం చెప్పాలో నాకు తెలీదు' మాటలకోసం అతను తడబ డుతూన్నాడు. పట్టుబడి పోయిన దొంగలా ఫీలవుతున్నాడు. అందుకని ఏదో ఒక సమాధానం ఆమెకి తప్పనిసరిగా చెప్పా ల్సిందే. కానీ ఏం చెప్పాలో. అలాగని అబ ద్ధాలు చెప్పడం చేతకాదు.

"చూడు బేటా... ప్రాబ్లంస్ ప్రతిమనిషికీ వుంటాయి. అవేమీ ముక్కూ, కళ్లూ, చెవులూ కాదు కదా మొహంమీద తెలియ డానికి? ప్రాబ్లంస్ అనేవి మనసులో వుండి, మనిషిని కష్టపెట్టేవి. వాటిని తీసుకునేదాన్ని బట్టి వుంటుంది ఆ తాలూకు మనిషి మొహం. మనసులో ప్రాబ్లం వుంది కదా అని క్రుంగిపోయి, నీరసపడి, మూడీగా అయిపోతుంటే ఎలా బతకటం? ఇంతపెద్ద జీవితాన్ని బతకటానికి ఓపిక కావాలి బేటా... లేని ఓపికని తెచ్చుకోవాలి. ముందుకి అడుగువెయ్యాలి. మనకి చేతన యిందయితే పరిష్కరించుకోవాలి. అది మన చేతుల్లో లేకపోతే వదిలెయ్యాలి. ఏ ప్రాబ్లమయితే మనవల్ల సాల్వ్ అవుతుందో అది మామూలు ప్రాబ్లం. కానీ దేనినయితే మనం సాల్వ్ చెయ్యలేమో... ఆ సొల్యూ షన్ మన కంట్రోల్లో వుండదో దాన్ని భగ వంతుడికి వదిలెయ్యాలి. అలాటి ప్రాబ్లంస్ భగవంతుడే సాల్వ్ చెయ్యాలి. ఎందుకంటే భగవంతుడే వాటిని మనకిచ్చాడు కాబట్టి. ఇలాటి ప్రాబ్లంస్ ఎవరికి వున్నా సరే ఆనం దంగా భగవంతుడికి వదిలేసి నిశ్చింతగా కూర్చోవాలి. అతనే దాన్ని బాగా సాల్వ్ చెయ్యగలుగుతాడు. ఊరికే ఒకే విషయాన్ని ఎన్నిసార్లు ఎన్నిరోజులు ఆలోచిస్తే మాత్రం ప్రయోజనమేమిటి చెప్పు? " గీతలో కృష్ణుడి పాత్రను ఆమె పోషిస్తోంది. అర్జునుడి పాత్రను అతను పోషిస్తున్నాడు.

"లెటజ్ బీ ఫ్రాంక్... నా దగ్గర దాపరి కమెందుకు? నేను పరాయిదాన్ని కాదుగా... ఆఫ్టరాల్ ఐయామ్ లైక్ యువర్ మదర్ బేటా... చెప్పు... నాకు చేతనయితే నీకేదన్నా ఎడ్వయిజ్ ఇస్తా... కమాన్" అంటుండగా ఆమె టర్న్ వచ్చింది. వెళ్ళి కాష్ తెచ్చుకుని హాండ్‌బాగ్‌లో పెట్టు కుంది.

"చలో... లెటజ్ గో" అంటూ అతనితో బయలుదేరింది. అతనిలో ఏదో ఆశ తలె త్తింది తన ప్రాబ్లంని ఈమేమన్నా సాల్వ్ చేస్తుందేమోనని.

కారులో వెనకసీట్లో కూర్చున్నారిద్దరూ. అతను చెప్పడం మొదలెట్టాడు తల్లిదండ్రుల జీవనవిధానం దగ్గరనుంచీ ఒక్కటీ వదల కుండా. అనుమానించిన విషయం నిజమే అయిందనుకుంది ఆమె. ఎందుకంటే చాలా కాలంగా ఆమె కూడా చూస్తూనే వుంది ఎదు రింట్లోకి. దుష్యంతరావు ఎప్పుడోవచ్చి కాసేపు వుండి, మళ్లీ ఏ అర్ధరాత్రో వెళ్లడం. ముందు అర్థంకాలేదుకానీ అర్థమవడానికి అదేదీ పజిల్ కాదుకాబట్టి తనకనవసరమైన విషయం తన కెందుకనుకుంది. ఇలాటిదేదో అతను చెబుతా డని ముందే వూహించింది ఆమె.

ఇల్లు వచ్చింది. ఇద్దరూ కారు దిగారు. ఆమె ఇంట్లోకి వెళ్ళి, అతన్ని చెయ్యిపట్టుకుని, హాల్లోకి తీసికెళ్ళి, సోఫాలో కూర్చోపెట్టింది. మళ్ళీ కాసేపు అతను ఏవేవో మాట్లాడాడు. అతని మొహమంతా కందగడ్డలా ఎర్రగా

అయింది. అతన్ని చూస్తుంటే ఆమెకి జాలి వేసింది. 'సచ్ ఏ స్వీట్ బాయ్' అనుకుంది.

అతనికి బిస్కట్స్, టీ సర్వ్ చేయించింది. అది తీసుకుని కాస్త ఊపిరి పీల్చుకున్నాడు. ఆమె మొదలుపెట్టింది చెప్పడం.

"చూడు బేటా... ఫామిలీస్‌లో సహజంగా సమస్యలుంటాయి. సమస్యలేని సంసారం వుండదని నీకు తెలీకపోవచ్చు. ఒక్కో కుటుంబంలో ఎన్నెన్ని సమస్యలుంటాయో తెలుసా? అంతదాకా ఎందుకు నన్నే చూడు మిస్టర్ ఆర్. ఎస్. కుల్‌కర్ణి పోయి పది సంవత్సరాలయిపోయింది. ఉన్న ఒక్కగానొక్క కొడుకు అమెరికాలో వున్నాడు. మీ మమ్మీకి కనీసం నువ్వయినా వున్నావ్. కానీ నాకెవరున్నారు చెప్పు? ఎవరి కోసం బతకాలి నేను? ఎవరికోసం ఎదురుచూడాలి? ఎవరికోసం వంటచేసుకోవాలి? ఎందుకింత ఎస్టాబ్లిష్‌మెంట్ ఒక్కగానొక్కదానికి? బతకటం నేర్చుకోవాలి బేటా... మన జీవితం మనదే... మనకెంత మంది వున్నా ఎవరి వ్యక్తిగత జీవితం వాళ్లదే. ఎవరి వ్యక్తిగత అభిరుచి వాళ్లది. మనకిష్టమైన ఎవరికో కాకరకాయ కూర ఇష్టమని, ఇష్టపడని మనం దానిని తింటున్నామా? మనకోసం మనం బతకాలి ప్రాణేష్"

"అది కాదు పెద్దమమ్మీ... డాడీ మాపట్ల చూపే పార్షాలిటీ నాకు నచ్చదు. మమ్మీనే ముందు మేరేజ్ చేసుకోవలసిన డాడీ ఎవరినో చేసుకుని, మమ్మీని నెగ్లెక్ట్ చేసేశారు. మమ్మీకి ఆయనంటే చచ్చేంత ప్రాణం. కానీ ఆయన ఆవిడని పట్టించుకోడు. మమ్మీమీద ఇష్టమున్న తను మరి మా దగ్గర ఎందుకుండరు? మాతో కూడా వుండచ్చు కదా? మేము ఆయన మనుషులం కామా? " మళ్లీ మొదలుపెట్టాడు రామాయణం. "డాడీ అంటే నాకెంత ఇష్టమో తెలుసా? కానీ ఆయనకే నేనంటే ఇష్టంలేదు"

"చూడు బేటా... ఇష్టం లేదని నువ్వనుకుంటే అయిపోదుగా? మమ్మీకి ఆయనంటే ఇష్టం. ఆయన ఆవిడని పట్టించుకోడని చెబుతున్నావ్ కదా. ఆ విషయం ఆవిడకి అనిపించిన మరుక్షణం ఆమె ఆయననొదిలేసి ఎప్పుడో వెళ్ళిపోయేది తెలుసా? ఈ ప్రపంచంలో ఏ మనిషీ ఏమనిషినీ కట్టెపడెయ్యలేదు. ఆ శక్తి ఒక్క ప్రేమకు మాత్రమే వుంది. వాళ్ళిద్దరి మధ్యలో వున్న ప్రేమ నీకర్థంకాదు. అది వాళ్లకే తెలుసు. అందుకే వాళ్లు విడిపోరు. ఇకపోతే 'పార్షాలిటీ' అంటున్నావ్ కదా. ఇది సొసైటీ బేటా. భర్తనేవాడు... ఇంటికి యజమానయినవాడు అలాగే చూసుకుంటాడు భార్యాపిల్లల్ని, అలా చూసుకోనివాడు మగవాడు కాదు. మనిషి కాడు. దుర్మార్గుడవుతాడు. ఆయన బాధ్యతల్ని ఆయన చేస్తున్నాడక్కడ. ఒక విషయం చెప్పనా. నేనెన్నిసార్లో చూశాను మీడాడీ వెళుతుంటే మీ మమ్మీ బయటికి రావడం... ఆయన ఆమె చెయ్యి పట్టుకోవడం. ఏదో బలవంతంగా విడిపోతున్నట్టుగా వుంటుంది తెలుసా వాళ్లని చూసేవాళ్లకి? నిజంగా ఇంతప్రేమ మామూలు కుటుంబాల్లో ఎక్కడుంటుందనుకుంటున్నావ్? చాలావరకు కాపురాలు చాలా మెకానికల్‌గా సాగిపోతుంటాయి ప్రాణేష్. నువ్వు చిన్నపిల్లవాడివి. నీకు తెలీదు. నా మాటలు నమ్ము... ప్రేమకు కావలసింది క్వాంటిటీ కాదు, క్వాలిటీ. ఇంకో విషయం కూడా చెబుతా విను. మీ డాడీ గురించి చాలా విన్నాను. ఆయన చాలా మంచి వ్యక్తనీ, జెంటిల్‌మాన్ అనీ, ఎఫీషియంట్ ఆఫీసరనీ, ఈ. సీ. ఐ. ఎల్‌లో ఆయనంటే అందరికీ రెస్పెక్టట. అలాటి ఫాదర్ను చూసి గర్వపడాలి. అంతేగానీ పెట్టీ థింగ్ గురించి పట్టించుకోకూడదు బేటా"

"అది కాదు పెద్దమమ్మీ... మమ్మల్నీ, మా అవసరాల్నీ పట్టించుకోడాయన"

"చూడు బేటా... అది ఆయన తలనెప్పి... అలాగయితే ఆయనే గిల్టీగా ఫీల

వ్వాలి. నీకెందుకా బాధ? ఎవరికి ఎంతవ రకు రాసిపెట్టుంటే అంతే జరుగుతుంది బేటా. రేపు నిన్నొకచోటికి తీసికెళతా, నావెంటరా. ఒక అంకుల్ వున్నారు మనకి తెలిసినవాళ్లు. ఆయనతో మాట్లాడు కాసేపు. నీకంతా అర్థమయిపోతుంది. ఊరికే బాధపడకు. ఈజీగా తీసుకోవాలి! అయినా నీకేం తక్కువయింది? నీకేదో తక్కువయిందని నేననుకోవడంలేదు. అయినా భగవంతుడు నీకు అన్నీ ఎక్కువే ఇచ్చాడు. మంచిమమ్మీ... మంచి డాడీ. నీకు మంచి రూపం. ఇల్లూ, వాకిలీ, చదువూ, ఇంకేంకావాలి చెప్పు? లేని దాని గురించి బాధ పడకూడదు. ఉన్న వాటి విలువని తెలుసుకుని ఎంజాయ్ చెయ్యాలి"

"మీరలా అంటారు పెద్ద మమ్మీ... మా ఫ్రెండ్సంతా నన్ను ఎన్నిసార్లు ఎగతాళి చేస్తుంటారో మీకు తెలుసా?"



"వాళ్లమొహం... చిన్నపిల్లలు... ఇడియట్స్ వాళ్లు. వాళ్లు ఎగతాళి చేసేంత దీనమయిన జీవితమేం కాదు నీది. ఎవరివరకు వాళ్లకొస్తేగానీ తెలీదు. ఇదే పరిస్థితి వాళ్లకున్నా వాళ్లూ నీలాగే వుండేవాళ్లు. వాళ్ల గురించి ఆలోచించకు. రేపు సాయంకాలం ఒకచోటికి తీసికెళతా నాలుగ్గంటలకి. ఆ తరువాత నువ్వే చెబుతావు నీకు సమస్యేదీ లేదని. ఓకే? ఇంటికెళ్లు గుడ్‌బాయ్‌లా... మమ్మీ ఒక్కళ్లే వున్నారు. వెళ్లి చదువుకో. రెస్ట్ తీసుకోబేటా" అంది.

సోఫాలోంచి లేచాడు ప్రాణేష్. గేట్ తెరుచుకుని రోడ్‌పైకి నడిచాడు. ఇంటి గేట్ తెరచి లోపలికి వెళ్లాడు.

మర్నాడు సాయంకాలం నాలుగ్గంటలు దాటింది. మిసెస్ కుల్‌కర్ణి, ప్రాణేష్ కారులో బయలుదేరారు. గన్‌రాక్ ఎన్‌క్లేవ్‌లో ఒక ఇంటి దగ్గర కారాగింది. ఇద్దరూ దిగారు కారులోంచి, ఆమె ప్రాణేష్‌ని తనతో రమ్మంది. ఇద్దరూ గేట్ తెరుచుకుని లోపలికి ప్రవేశించారు.

అదొక పెద్ద ప్రాంగణం. దానిలో తాజా పువ్వులతో వున్న గార్డెన్... పెద్ద లాన్. చాలా అందంగా వుందా గార్డెన్. అది చూసి ప్రాణేష్ అనుకున్నాడు ఈ మిలిటరీ వాళ్లకి అంతా ఓవరాక్షనేనని. ఆగార్డెన్ అలాగే వుంది. అప్పుడే ఒక పనివాడు ట్యూబ్‌పట్టుకుని వాటరింగ్ చేస్తున్నాడు గార్డెన్‌కి.

"సాబ్ హై క్యా?" అడిగింది ఆమె ఆ పనివాడిని.

"జీ సాబ్... అందర్ హై" అంటూ వాళ్లిద్దరినీ లోపలికి తీసుకుని వెళ్లాడు.

అదొక పెద్ద హాలు. అందమైన కాష్మీరీ కార్పెట్లు. కార్వ్‌డ్ వుడ్ ఫర్నిచర్. అందమైన వాల్ పెయింటింగ్స్... మరీ అందంగా వున్న యాంటిక్ క్లాక్, లోపలికి ప్రవేశిస్తుంటే దేవేంద్రభవనంలోకి వెళ్లినట్టనిపించింది. ఇద్దర్నీ సోఫాలో కూర్చోబెట్టి, వాళ్లకి సాఫ్ట్‌డ్రింక్ సర్వ్‌చేసి లోపలికి వెళ్లాడా పనివాడు. వాడు పనివాడే అయినా వాడికొక పద్ధతీ... వాడికొక డిసిప్లిన్. "ఈ మిలిటరీవాళ్లు దేనికయినా సమర్థులే" అనుకున్నాడు ప్రాణేష్.

మిసెస్ కుల్‌కర్ణి సోఫాలో కూర్చుని ఎదు

రుగా టీపాయ్‌మీద వున్న 'ఫెమీనా' మేగజైన్‌ని తీసింది. ప్రాణేష్‌కి స్పోర్ట్స్‌స్టార్ ఇచ్చింది. ఇద్దరూ ఆ పత్రికలని తిరగేశారు, తరువాత జరగబోయే సీనుకోసం ఆతృతగా ఎదురుచూస్తూ.

"హెల్లో బెహన్‌జీ... గుడ్ ఈవెనింగ్" అంటూ తెల్లటి పైజామా, జుబ్బాతో వున్న ఒక గుబురుమీసాల పెద్దమనిషి పలకరిస్తూ వచ్చాడు వాళ్లదగ్గరకి.

"నేను చెప్పాను కదా బేటా... రిటైర్డ్ మేజర్ జనరల్ మిస్టర్ శ్రీవాస్తవ్... చూడండి భాయిసాబ్. ఈ అబ్బాయి నా నెవ్యూ. నిన్న చెప్పాకదా మేము వస్తామని' అని పరిచయాలతో మొదలెట్టింది ఉపోద్ఘాతాన్ని.

"హెల్లో యంగ్‌మాన్. హౌ డూ యూ డూ" అంటూ ప్రాణేష్ చెయ్యి అందుకున్నాడు అణువణువునా సిన్సియారిటీ, క్రమశిక్షణ నిండిన గొంతుతో. బిడియపడ్డాడు ప్రాణేష్.

పరిచయ సంభాషణలు ముగించుకున్నారు. అసలు విషయానికి వచ్చారు. విషయమంతా అతనికి ఇంతకుముందే తెలిసినట్టుంది. విషయంపట్ల సుపరిచితంగా వుండటం ప్రాణేష్‌కి మంచిగా అనిపించింది. సూటిగా విషయానికి వచ్చాడు మేజర్ శ్రీవాస్తవ్.

"విషయాన్ని పరిశీలిస్తుంటే నాకర్థమైన విషయం చాలా సింపుల్. యూ నీడ్ లిటిల్ బిట్ కౌన్సిలింగ్. నువ్వు చాలా సెన్సిటివ్ మనిషిలా కనబడుతున్నావ్. డోన్ట్ వర్రీ. ఎవ్విరిథింగ్ విల్ బీ నార్మల్. చూడు మిసెస్ కుల్‌కర్ణిని చూశావు కదా. ఆవిడని చూస్తే నీకేమర్థమవుతుంది చెప్పు? ఆమెకెవరూ తన మనుషులు తన దగ్గరలేరు. వస్తారనే ఆశ కూడా లేదు. ఎందుకంటే ఆమె హజ్‌బెండ్. హి వజ్ మై బెస్ట్ ఫ్రెండ్... ఆయన తిరిగివచ్చే సమస్యే లేదు. ఇకపోతే ఆమె కొడుకు అమెరికాలో వున్నాడు. నీకు తెలుసు వన్స్ అమెరికా వెళ్ళిన మనవాళ్లు మన దగ్గరకు వచ్చి మనతో ఎడ్జస్ట్ అవరని. కానీ ఆమె ఇంత ఉత్సాహంగా వుండగలుగుతున్నదంటే ఓన్లీ బికాజాఫ్ యాటిట్యూడ్. ఉత్సాహం!"

ఏం మాట్లాడకుండా అతను చెప్పే విషయాలనే వింటున్నాడు ప్రాణేష్.

"ఆమెతో ఇంత పరిచయం వున్నది కదా నీకు... ఆమె కళ్లనెప్పుడయినా చూశావా? పరిశీలించావా? "

"లేదు సర్"

"ఫైన్... చెబుతాను విను. నువ్వు చూసే ఆమె కళ్లు ఆమెవి కావు తెలుసా నీకు? ఆమె హజ్‌బెండ్‌వి! ఆయన సర్వీస్‌లో పోయినప్పుడు ఆయన గుర్తుగా ఆమె ఆయన కళ్లని పర్మనెంట్‌గా తను పెట్టించుకుంది.

ఆశ్చర్యపోయాడు ప్రాణేష్. కళ్లార్పకుండా చూస్తున్నాడావిడను.

"ఎస్ ప్రాణేష్. ఆర్.ఎస్.కుల్‌కర్ణి పోయినప్పుడు ఆమె కొలాప్సయిపోయింది లిటరల్‌గా. ఆమె కళ్లు పర్‌ఫెక్ట్‌గా వున్నాయప్పుడు. అందరినీ రిక్వెస్ట్‌చేసి, కన్విన్స్ చేసి, మొండిగా ఆమె కళ్లను ఆయన కళ్లతో రీప్లేస్ చేయించుకుంది. ఎందుకు? పోయిన మనిషినెటూ చూడలేదావిడ. కనీసం రోజూ అయినా ఆయన కళ్లను తనలో చూసుకోవటానికి. నిజంగా ఈ ఇన్సిడెంట్ తరువాత ఆమెమీద నాకు మరింత గౌరవం పెరిగింది. మనకి ఎవరిమీదనయినా ప్రేమ వుండచ్చు కానీ ఆ ప్రేమ మనల్ని పెంచేదిగానూ, ప్రేమించే వ్యక్తులకి స్ఫూర్తినిచ్చేదిగానూ వుండాలికానీ, ఆ ప్రేమ మనల్ని దహించకూడదు. ఆమె మాటలని బట్టి చూస్తే యూ లవ్ యువర్ ఫాదర్ టూమచ్... కానీ ఆయన నీతో వుండడు. అంతేగా? "

"యస్ అంకుల్..."

"ఏం ఫరవాలేదు. నువ్వింకా చాలా

బెటర్. ఆయన్ని చూడగలవు. ఆయనతో మాట్లాడగలవు. భగవంతుడి దయవల్ల ఫ్యూచర్‌లో అచ్చంగా ఆయనతో గడిపే సందర్భం కూడా రావచ్చు మనం చెప్పలేం. కానీ ఒక విషయం బాగా తెలుసుకో. మా ఆర్మీవాళ్లనే తీసుకుందాం. వాళ్లు కొంత మంది వార్‌కి వెళ్ళి కాలో చెయ్యో పోగొట్టుకుని వాలంటరీ రిటైర్‌మెంట్ మీద ఇంట్లోనే వుంటుంటారు. మరికొంతమంది విషయం మరీ ఘోరం. వార్‌కని వెళ్ళినవాళ్లు ఎప్పటికీ తిరిగిరారు. అక్కడే ప్రాణాలను త్యాగం చేస్తారు. ప్రాణాలతో వెళ్ళి శవాలయి వస్తారు. మరి కొంతమంది విషయం మరీ హృదయవిదారకంగా వుంటుంది. ఎందుకంటే ప్రాణంపోయిన తరువాత చూడటానికి వాళ్ల శవాలు కూడా మనకి దొరకనంత ఛిన్నాభిన్నమవుతాయి. లాండ్‌మైన్స్‌లోనో... ఏరోప్లెయిన్లలోనో... శత్రుసైన్యాల చేతుల్లో ఛట్టుబడో- మొత్తానికి ఫామిలీ మెంబర్స్‌కి కనీసం డెడ్ బాడీకూడా మిగలదు. కలకాలం వాళ్ల జ్ఞాపకాలతోనే కాలం వెళ్లబుచ్చుతారు వాళ్ల మనుషులు. వాళ్లతో పోల్చుకుంటే నిజంగా నువ్వెంత అదృష్టవంతుడివి! అసలు నీకేం జరిగిందని నువ్వంత దిగులుపడటానికి? నీకు మమ్మీ, డాడీ నీకళ్లముందే వున్నారు. మీ డాడీ అంటావా, వదిలెయ్ ఎక్సెప్షన్‌కింద. ఆయనలో నీకు నచ్చని విషయాలను వదిలేస్తే మంచి క్వాలిటీస్ గురించి గుర్తుతెచ్చుకో. డోంట్ బీ సెల్ఫిష్ మై చైల్డ్. మనిషి అనుకున్నవన్నీ జరగవు. కొన్నింటిని వదిలెయ్యాలి. లేకపోతే అవి మనల్ని వదలకుండా పట్టుకుని పీడిస్తాయి ముందుకు పోనివ్వకుండా"

శ్రీవాస్తవ్ చెబుతున్న మాటలకి మంత్రముగ్ధుడిలా వింటూ కళ్లార్పకుండా అతన్నే చూస్తుండిపోయాడు ప్రాణేష్.

"చూడు యంగ్‌మాన్... మనకి కనిపించే తొంభైతొమ్మిదిశాతం జనాలు, వాళ్ల వేషభాషలకి మనం మోసపోయి, వాళ్లేదో చాలా ఆనందంలో మునిగి తేలుతున్నారని మనం పొరపాటు పడతాం. కానీ ఎవ్వరూ అలా లేరు. సపోజ్ మిసెస్ కుల్‌కర్ణినే చూడు. ఆమెని చూస్తే గర్వంతోనిండిన హైసొసైటీ లేడీలా కనబడుతుంది. కానీ నిజానికి ఆమెకేం మిగిలింది? ఎవరున్నారు? ఎవరూ లేరనేకదా కొడుకులా కనిపించే నిన్ను పట్టుకుని వేళ్లాడుతున్నది? ఇన్‌ఫాక్ట్. షి ఈజ్ నాట్ కమ్‌ఫర్టబుల్ విత్ హర్‌సెల్ఫ్! అలాగే నన్ను తీసుకుందాం. ఈ ఇల్లూ వాకిలీ, వాతావరణం అంతా చూస్తే నేనేదో చాలా విలాసపురుషుణ్ణి అనుకుంటారు చూసేవాళ్లు. నిజానికి నా ఉద్యోగం నాకివి మిగిల్చితే, అదే ఉద్యోగం నానుంచీ చాలా ఆనందాన్ని తీసేసుకుంది" అంటూ పైజామాలోంచీ తన కాలు చూపించుతూ "ఇది నిజమైన కాలని అనుకుంటున్నావు కదూ... కాదు... ఇది జైపూర్ ఆర్టిఫిషియల్ లెగ్. ఇన్‌స్పెక్షన్‌కని ఒకసారి హర్యానాలో వెళుతుంటే లాండ్‌మైన్‌లో నా కాలిని పోగొట్టుకున్నాను. ఆరోజు నేను కొంచెం కూడా బాధపడలా. ఎందుకో తెలుసా? నాతోబాటు నాతో వున్న చాలా మంది కొలీగ్స్, సబార్డినేట్సూ అసలు నామరూపాలు లేకుండా పోయారు. ఏ గవర్నమెంటయితే నాకాలు తీసేసుకుందో అదే గవర్నమెంట్ ఈ కాలిని వుంచింది దాని స్థానంలో. నా కాలు విషయం చాలామందికి తెలీదు, నాకు బాగా దగ్గరవాళ్లకు తప్ప. నా కాలు పోయినరోజునే నేను విరక్తి చెందాల్సింది జీవితంమీద. కానీ అలా చేశాననుకో. నన్ను నమ్మి, నామీద ఆధారపడినవాళ్లు ఎంతోమంది వున్నారు. వాళ్లేమవాలి? భగవంతుడి అనుగ్రహంతో కనీసం ఈ కాలయినా ఏర్పడింది. దానికి సంతోషిస్తూ అడుగడుగునా నా జీవితాన్ని నేను ఆనందిస్తున్నాను. ఐ లవ్ డ్రింక్స్... ఐ రియల్లీ ఎంజాయ్ దెమ్. హాయిగా తింటాను. తాగుతాను. నా బాగోగులన్నీ

నా డిపార్ట్‌మెంటే చూసుకుంటుంది. ఇన్ దట్ వే ఐయామ్ లక్కీ... ఎంతోమంది దురదృష్టవంతులున్న ఈ ప్రపంచంలో ఎంతోమంది అవయవాలను పోగొట్టుకుంటున్నారు. అందరూ వాటిని నాలాగా పొందగలుగుతున్నారా? లేదు. మరి వాళ్లందరితో పోలిస్తే నేనెంత అదృష్టవంతుణ్నో చెప్పు? "

ఆవేశంతో చెప్పుకుపోతున్నాడు శ్రీవాస్తవ్. మైమరచి వింటున్నాడు ప్రాణేష్ ఇంద్రజాలానికి గురయినవాడిలా.

"ఎప్పుడూ నిరుత్సాహపడకూడదు. నెవర్ లూజ్ యువర్ కాన్ఫిడెన్స్ మై బాయ్... నాకో ఫ్రెండున్నాడు ఇదే వూళ్లో. అతను మిలిటరీ కాన్‌టీన్‌లో మంచి పొజిషన్‌లో వున్నాడు. అతనికొక కొడుకున్నాడు. వాడి గోల భరించలేక నా ఫ్రెండ్ వాడికొక టూవీలర్ కొనిపెట్టాడు. వాడు ఉన్నవాడున్నట్టు వూరుకోక వాళ్లమమ్మీని వెనకాల కూర్చోపెట్టుకుని హైవేలో మిట్టమధ్యాహ్నం జాలీరైడ్‌కి తీసికెళ్లాడు. చాలా స్పీడ్‌గా వెళ్తున్నాడు చాలా సరదాగా. ఒక పాయింట్‌లో అతనెంత ఒళ్లుమరచిపోయాడంటే అతని తల్లి ఆ టూ వీలర్ మీదనుంచీ జారి పడిపోయిన విషయం కూడా అతనికి తెలీదు. వాడలాగే బండి నడుపుతూ వెళుతున్నాడు. అతనికి అతని తల్లి వాడివెనకాల లేదన్న విషయం ఎప్పుడు తెలిసిందంటే పరిస్థితి తన చేతిలోనుంచీ జారిపోయిన తరువాత. ఆమె ఎప్పుడయితే కింద పడిపోయిందో అప్పుడు స్పీడ్‌గా వెనకాల నుంచీ ఫాలోఅయే ఒక లారీ ఆమె మీది నుంచీ వెళ్ళిపోయింది. అది లారీవాడు కూడా కావాలని చెయ్యలేదు. లారీ దాని రెగ్యులర్ స్పీడ్‌లో వెళుతోంది. సడన్ బ్రేక్ వెయ్యటానిక్కూడా ఆ లారీ డ్రైవర్‌కి వ్యవధి దొరకని సమయంలో అంత స్పీడ్‌గా వెళ్ళింది. తీరా కళ్లు తెరుచుకుని చూస్తే అంతా అయిపోయింది. ఆ లారీవాడు రిపెంటయినా, చనిపోయినామె కొడుకు రిపెంటయినా దొరికిందేదీ లేదు రెండు ముక్కలయిన ఆమె శరీరం తప్ప. ఇవాల్టి రోజువరకూ నా ఫ్రెండ్ తన కొడుకుని క్షమించలేదు. ఆ కొడుకుని విలన్‌లా చూస్తాడు. అలాగే ఆ కొడుకు కూడా ఇవాల్టివరకూ మామూలు మనిషవలేదు. ఎప్పుడూ ఆ సంఘటననే గుర్తుపెట్టుకుని, ఆల్‌మోస్ట్ 'మతిభ్రమించినవాడిలా అయిపోయాడు. ఎందుకంటే అన్యాయంగా కన్నతల్లిని తన చేతులారా పొట్టన పెట్టుకున్నానని అతని ఫీలింగ్. మరీ ఆలోచించు నా ఫ్రెండ్ పరిస్థితి. ఒకవైపు ఆరోగ్యంగా వున్న భార్యను పోగొట్టుకొని, ఇంకోవైపు ఎదిగిన కొడుకు మతి భ్రమించి... ఎంత కష్టం చెప్పు ఈ పరిస్థితిలో, కానీ హి స్టిల్ వర్క్స్ ఇన్ కాన్‌టీన్. అదీ గొప్పతనం! వాడు జీవితంపట్ల ఉత్సాహాన్ని కోల్పోలేదు. ఎందుకు చెబుతున్నానంటే ఇలాటి విషయాలేవీ నువ్వు చూడలేదు. నీ కందరూ వున్నారు. వైడోంట్ యూ బీ హాపీ? చెప్పాలంటే ఎన్నో వున్నాయి కథలు నీకు ఓపిక వుండి అర్థం చేసుకోవాలేగాని"

"ఇంకొక్క విషయం చెప్పి ఆపేస్తా విను" అని మొదలుపెట్టాడు.

"నువ్వు మిసెస్ కుల్‌కర్ణితో సికిందరాబాద్ క్లబ్‌కి వెళుతుంటావు కదా. అక్కడ నువ్వెప్పుడయినా ఇద్దరు లేడీసుని చూశావా మిసెస్ నళినీ అండ్ మిసెస్ వింధ్యా? "

"పెద్దమమ్మీ పరిచయం చేశారు"

"వాళ్లెవరనుకుంటున్నావ్? మిస్టర్ నీల్‌కమల్ ఛటోపాధ్యాయకి వాళ్లిద్దరూ భార్యలు. ఆ 'లేడీస్ ఇద్దరికీ ఇద్దరివిషయం తెలుసు. మోరోవర్ వాళ్లిద్దరూ విడివిడి ఇళ్లలో నీల్‌కమల్‌తో వుంటూ క్లబ్‌లో కలుస్తుంటారు"

ఆశ్చర్యంతో కనుబొమ్మలు ముడిపడ్డాయి ప్రాణేష్‌కి. నమ్మబుద్ధవలేదు. ఇంతకు ముందు పరిచయం వున్నా వాళ్ల వివరాలు అతనికంతగా తెలీవు.

ఆ ఇద్దరు లేడీస్ ఒకళ్లనొకళ్లు కలుసుకోకుండాను, ఒకళ్లమీద ఒకళ్లు బురద చల్లుకుంటూ తన్నుకోవచ్చు లేకపోతే అసలు ఇద్దరూ ఒకళ్లనొకళ్లు పట్టించుకోకుండా వుండచ్చు కదా. కానీ వాళ్లలా చెయ్యరు. వాళ్ళిద్దరూ కూడా నీల్‌కమల్‌తో కమ్‌ఫర్టబుల్‌గా వుంటారు. వాళ్లు మిగతా ఫ్రెండ్స్ దరితో కలివిడిగా వుండి కార్డ్సు ఆడతారు. తరచూ ఇద్దరూ కలిసే క్లబ్బుకొస్తుంటారు. వాళ్లని చూస్తే ఎవరూ అనుకోరు వాళ్లిద్దరూ ఒకే హజ్‌బెండ్‌ని షేర్ చేసుకుంటున్నారని. వాళ్ళిద్దరి డెస్టినేషన్ ఒక్కటే నీల్‌కమల్‌ను హాపీగా వుంచటం, అతనితో వాళ్లు విడివిడిగా హాపీగా వుండటం. అందరూ వాళ్లలా వుండాలని నేననటంలా. వాళ్ల ఆనందమయినా సమస్య అయినా వాళ్లకి వాళ్లే. వాళ్ల సమస్యకి ప్రత్యేకించి పరిష్కారం లేదన్న నగ్నసత్యం వాళ్లకి బాగా తెలుసు. అందుకే ఇద్దరూ పరిస్థితితో రాజీపడిపోయారు. ఎందుకు చెబుతున్నానంటే దేశంలోనూ, ప్రపంచంలోనూ ఎవరు పర్ఫెక్ట్‌గా లేరు. ఉండాలన్న రూలు కూడా ఏదీ లేదు. కానీ ఉన్నంతలో ఆనందంగా వుండటమే కావలసింది. నేను చెప్పిన ఈ ఇద్దరూ వాళ్ల బాగ్రౌండ్ మిలిటరీ బాగ్రౌండవడంవల్ల, వాళ్లు విషయాన్ని స్పోర్టివ్‌గా తీసుకుని, ప్రాక్టికల్‌గా జీవిస్తున్నారు. అందరివల్లా కాదు అలా చెయ్యటం. బయటి ప్రపంచం అనుకోవచ్చు మిలిటరీవాళ్లు చాలా సిస్టమేటిక్‌గా వుంటారు ఒకే భార్యతోనని, వాళ్లకి ఎఫైర్లుండవని కానీ వాళ్లు కూడా మనుషులేననీ, వాళ్లకీ ఎమోషన్స్ వుంటాయనీ ఎందుకు మనం అనుకోకూడదు? ఎటొచ్చీ బయటివాళ్లు వాళ్ల సమస్యల్ని తీసుకున్నంత సీరియస్‌గా వాళ్లు తీసుకోరు. జీవితమనేది చాలా విలువయినదని వాళ్లకే బాగా తెలుసు. అందుకే సమస్యలున్నా నిరంతరం ముందుకు అడుగులేసుకుంటూ సాగిపోతుంటారు"

"నేను చెప్పేదేమిటంటే మైడియర్ బాయ్, నువ్వు సాధించాల్సింది ముందుముందు చాలా వుంది. మీ పేరెంట్స్ దే ఆర్ హాపీ విత్ దెమ్ సెల్వ్స్. నీకెందుకు వాళ్ళ సమస్య? ఐ నో యువర్ ఫాదర్. నేను ఆయన గురించి విన్నాను. యడ్మినిస్ట్రేషన్‌లో వున్నారాయన. మీ డాడీ కొలీగ్ ఒకతను నా ఫ్రెండ్ ఎన్.ఎఫ్.సీలో పనిచేసే అతనికి ఫ్రెండు. అతను మీ డాడీ గురించి నాతో గొప్పగా చెబుతుంటాడు. మీ డాడీకి రెండు ఫామిలీలు వున్న విషయం కూడా వాడికి తెలుసు. ఎంత తెలిసినా ఈ ఫాస్ట్ ప్రపంచంలో ఎవరికీ ఎవరి విషయం పట్టదు అవి వాళ్లను ఇబ్బంది పెట్టనంతవరకు. ఆయన విషయం తెలిసినా సరదాగా ఆయనమీద జోక్ చేషుకుంటారేగానీ ఆయన్ని కామెంట్ చేసే ధైర్యంగానీ అర్హతగానీ ఎవరికీ లేదు. హి సీమ్స్ టు బీ యాన్ ఆనెస్ట్ ఆఫీసర్" అన్నాడు శ్రీవాస్తవ్.

"మగవాడు కేర్‌టేకరా కాదా అన్నది ముఖ్యంకానీ ఎంతవరకు ఏమేమి తెచ్చిఇస్తాడన్నది కాదు. డోంట్ బ్లేమ్ యువర్ డాడీ... మీ మమ్మీ గురించి కూడా చాలా మందికి తెలుసు. ఐ థింక్ షి ఈజ్ ఎ స్వీట్ పర్సన్"

ఏం మాట్లాడలేదు ప్రాణేష్.

"చూడు మై బాయ్... డోంట్ వర్రీ... అన్నీ మరచిపో. మమ్మీ గురించి ఎక్కువ ఆలోచించకు. లీవ్ హర్ టు యువర్ డాడ్... హి విల్ టేక్ కేరాఫ్ హర్... ముందు నీ గురించి నువ్వాలోచించుకో. ఆ తరువాత అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి" అంటూ శ్నాక్స్, టీ ఆర్డర్ చేశాడు వంటవాడు నాయర్‌ని పిలిచి.

వేడివేడి పాలక్‌పకోడీలు, ఫింగర్ చిప్స్ వచ్చాయి. వాటితోబాటు పొగలుకక్కే టీ వచ్చింది. ముగ్గురూ వాటి విషయం చూసుకున్నారు. ఆలోచించడానికంటూ ఏదీ లేదు ప్రాణేష్‌కి. ఎవరి గురించిన మంచిగానీ

చెడుగానీ అతని బుర్రలో లేవు. శ్రీవాస్తవ్‌కి థాంక్స్ చెప్పి, మిసెస్ కుల్‌కర్ణితో బయటికి దారితీశాడు ప్రాణేష్.

★ ★ ★

వసంతకాలం వచ్చేసింది. వాతావరణమంతా ఆనందంగా ఆహ్లాదకరంగా వుంది. సైనిక్‌పురి పేరుకి హైదరాబాద్‌లోనే వున్నప్పటికీ దానికీ హైదరాబాద్‌కీ ఏ సంబంధం లేనట్టూ, అదొక వూరులా ప్రత్యేకంగా వుంటుంది. ఎక్కడ చూసినా మిలిటరీ యూనిఫామ్‌లో కనిపించే మనుషులూ, మిలిటరీ మెస్‌లూ, ఆఫీసులూ, స్కూళ్లూ, ప్లేగ్రౌండ్లూ, ఇళ్లూ ఒకటేమిటి ప్రతిచోటా మిలిటరీ వాసనే గుప్పుమంటుంటుంది. ఆ లొకేషనంతా ఆంధ్రాలో భాగం కానట్టు కనిపిస్తుంది. మరొక గొప్ప విషయం ఏమిటంటే ప్రతి ఆఫీసు ప్రాంగణంలోనూ చక్కటి లాన్లూ, అందమైన మొక్కలు, పెద్ద పెద్ద వృక్షాలు. ప్రతి మిలిటరీ వ్యక్తికి సంబంధించిన ఇల్లూ రంగురంగు పూల మొక్కలతోను, క్రోటన్స్‌తోనూ వుండటమేగాక, ఆరోగ్యంగా వున్న ఆకులూ పువ్వులతో నిండి, మంచిపోషణ... వాటి పట్ల తీసుకుంటున్న శ్రద్ధ కొట్టొచ్చినట్టు కనబడుతుంటుంది. అందమైన చక్కటి మొక్కలతో వున్న తోటల్ని చూస్తుంటే ఒక్కోచోట ఒక్కో నవయౌవన ముగ్ధలా కనబడుతుంటుంది.

వసంతకాలంలో చెట్లు చాలా అందంగా వుంటాయి. పండు వయసులో వున్న వృద్ధులు జీవితంలో వాళ్లవాళ్ల పనులు ముగించేసుకుని తృప్తిగా కాలధర్మం చేసినట్టు చెట్ల ఆకులు కూడా వయసుడిగి పండిపోయి, రాలిపోతాయి. వాటి స్థానంలో మరికొన్ని లేత ఆకులు బయలుదేరి ఎండిపోయినట్టు కనిపించే ఆ వృక్షాలకు నవీనశోభను తెచ్చిపెడతాయి. ఆ లేత ఆకులతోబాటు మొగ్గలూ, పువ్వులూ- ఆ స్థితిలో చూస్తున్నప్పుడు ప్రతి వృక్షం అందమైన నిండు గర్భిణిలా కనబడి, అందం తిలకించడానికి ఇంకా కొన్ని కళ్లుంటే బాగుండుననిపిస్తుంది.

ఆ సమయంలో విద్యార్థులకి ఆనందమైన సమయం. పాత తరగతుల తాలూకు చదువుకున్నవన్నీ పరీక్ష పేపర్లలో అక్షరాలరూపంలో కక్కి ఒంటినీ, బుర్రనీ తేలికపరుచుకుంటారు. తమ ప్రియాతిప్రియమైన స్నేహితులతోనూ, బంధువులతోనూ గడపటానికి అదే అనువయిన సమయం వాళ్లకి. ఎప్పుడూ చదువులో పడి క్షణం తీరికలేకుండా గడిపేవాళ్లకి ఆ సమయం చాలా విలువైనది. అన్నిపనులూ లీజర్‌గా జరిగిపోతుంటాయి. ఇంకొక ఆనందమైన విషయం ఏమిటంటే ఆ సమయంలోనే పరీక్షల తాలూకు ఫలితాలు వస్తాయి.

రిజల్ట్స్ వచ్చాయి. బి.ఎస్.సీ ఫస్ట్‌రాంక్‌లో పాసయ్యాడు ప్రాణేష్. తల్లిదండ్రులు చాలా సంతోషించారు. తరువాతి చదువు ఏం చదవాలో ఎక్కడ చదవాలో ఇంకా నిర్ణయించుకోలేదు.

మధ్యాహ్నం లంచ్ సమయం అది. డైనింగ్ కుర్చీలో కూర్చుని భోజనం చెయ్యడానికి ఉపక్రమించాడు ప్రాణేష్. కంచంలో కాబేజీని కొబ్బరితో చేర్చి వండిన కూర వేసి ప్రాణేష్‌కి ఇష్టమైన పాలక్‌పన్నీర్ వడ్డించింది పద్మిని. రెండు చపాతీలు, ఒక కప్పులో పెరుగువేసి, ప్రేమగా వడ్డిస్తోంది. చిన్నచిన్న ముక్కలుగా తుంచుకున్న చపాతీని కూరలో కలిపి తింటున్నాడు.

"మమ్మీ... నా బి.యస్.సీ. అయిపోయింది కదా. ఫర్‌దర్ స్టడీస్ అమెరికా వెళ్ళి చేస్తా... జెస్ట్ అక్కడ చదువుకుని వచ్చేస్తే ఆ ఎడ్యుకేషన్‌తో ఇక్కడ మంచిమంచి జాబ్స్ చెయ్యొచ్చు. అలాటి చదువులకి ఇక్కడ చాలా డిమాండ్ వుంది మమ్మీ"

"అంతదూరం వెళ్ళిపోతే ఎలా నాన్నా... నిన్ను విడిచి నేనుండలేనుకదా ప్రాణా"

"ఆ... ఎంత మమ్మీ... జస్ట్ టూ ఇయర్స్... రెండు సంవత్సరాలెంతసేపు...

కళ్లు మూసుకుని కళ్లు తెరిచేలోపు గబగబా అయిపోతాయి మమ్మీ... ఆ తరువాత లైఫంతా మనదే. నిన్ను పువ్వుల్లో పెట్టు కుని చూసుకుంటా మమ్మీ డియర్. నేనేం చేసినా అన్నీ నీకోసమే మమ్మీ. ప్లీజ్... మా ఫ్రెండ్స్ చాలామంది వెళుతున్నారు స్టేట్స్. నేను కూడా వెళతా మమ్మీ"

"ఏమో నాన్నా... మీ డాడీ ఏమం టారో... అసలే ఆయన చాలా ఖర్చుల్లో వున్నారట. ఎలా చెప్పాలో తెలీదు. ఆయన కున్న ప్రాబ్లమ్స్‌కి ఇంకే ప్రాబ్లం వినే మూడ్‌లో వుండటంలా. ఆయనకసలు టైము కూడా వుండటంలా ఇంటికి రావడా నికి. బాగా ఆలోచించుకన్నా... ఆయన పనుల్లో ఆయన మునిగిపోయి సరిగ్గా ఇంటికి రావడం కూడా మానేశారు కదా. ఉన్న నువ్వొక్కడివీ కూడా వెళ్ళిపోతే మరి నేనొక్కదాన్నే అయిపోనూ? ఒంటరిగా వుండలేనురా నాన్నా"

"ఈ విషయం ఆయనకు చెప్పు. ఆయ నకి చెప్పటానికి నీకు నోరు రాదుగానీ, అన్నింటికీ నేనొకణ్ణి దొరికాను నీకు. అస లెందుకు రావటం లేదాయన? ఎప్పుడో వారానికో పదిరోజులకో ఒకసారి వచ్చి చుట్టపుచూపు చూసి వెళుతున్నాడు తప్ప అప్పటిలా ఎందుకు రావటంలేదు? నువ్వెం దుకడగవ్ ఆయన్ని? "

"ఇంట్లో పిల్ల పెళ్ళిచేశారు కదా... ఆ పెళ్ళి పనులూ... హడావుడి... చుట్టాలూ, పెళ్ళివాళ్ళ అచ్చటా ముచ్చటా మగపిల్లల చదువులూ, అందులోనూ మీ నాయనమ్మ పెద్దదయిపోయింది కదా. ఆవిడ ఈయన్ని వదలదు. ఏమడగను చెప్పు? ఇల్లు, సంసారం ఎస్టాబ్లిష్‌మెంట్, బాధ్యతలుం టాయి కదా పిల్లలు పెద్దవాళ్లయితే? తెలిసి కూడా ఎలా అడగను చెప్పు? "

"ఏం ఇది ఇల్లు కాదా? నువ్వు భార్యవి కావా? నేను కొడుకుని కాదా? మనకి అవ సరాలుండవా? ఇందుకే నాకు మండేది. అక్కడికేదో అదే ఇల్లయినట్టూ, ఇది గెస్ట్ హౌసయినట్టు, ఆయన్ని కాదు నిన్ననాలి. అప్పుడూ ఇంతే ఇంటరయిన తరువాత మెడిసిన్ చదువుతానంటే 'అంతంత డొనేష న్లివ్వటం నావల్లకాదు. ఒకవేళ సీటువచ్చినా సంవత్సరం సంవత్సరం ఫీజులూ, హాస్టల్ ఖర్చులూ అవుతాయి. అయినా ఇవాళ రేపు మెడిసిన్‌కి వేల్యూలేదు, చక్కగా బి.ఎస్.సీ సైకాలజీ చెయ్యి' అన్నాడు. అక్కడికేదో నామీద ప్రేమ పొంగిపోయినట్టు. నిజానికి నాకు అసలు ఇష్టంలేదు ఆయన బలవం తంమీద, ఆయనకి నీవంతపాట మూలంగా చేరాను బి.ఎస్.సీ.లో. తీరా చూస్తే ఆయన కొడుకుని ఆల్‌రెడీ మెడిసిన్‌లో చేర్చాడు. ఈ విషయాన్ని నీకు చెప్పి, నీచేత అడిగించితే ఏమన్నాడాయన గుర్తుందా? ఆయన బావమరిది కొడుకు మెడిసిన్‌లో చేరుతున్నాడనీ, వాడితో వీడిని కూడా చేర్చా నంటూ కుంటిసాకు చెప్పాడు. ఏం నేను కొడుకుని కానా? మనకేమీ వుండవు. ఎవరూ వుండరు. ఆయనకి అందరూ వుండాలి. అన్నీ కావాలి"

"పోన్లే నాన్నా... ఇప్పుడెందుకు అయిపో యిన దానికి? "

"పోనీపోనీ అంటూనే ఇంతదాకా తెచ్చావ్. ఇంట్లో పనులూ, బాధ్యతలని ఇంటికి రావటమే మానేశాడు. ఏం చెయ్య గలిగావ్. ఏం చెయ్యలేవు. రేపు రిటైరయి, ఒంట్లో బాగాలేదని ఇంట్లో కూర్చుని పూర్తిగా రావటం మానేస్తాడు. దానిక్కూడా రెడీగా ఒకసాకు వెతుక్కో ఆయన్ని సమర్థిం చుకోవటానికి. అసలు ఆయన్ని కాదు. నిన్ననాలి"

"అంత హార్ష్‌గా మాట్లాడకు నాన్నా. ఏం చేస్తాం చెప్పు. మన తల రాతలా వుంది"

"తలరాత కాదు. మనం చేతులారా చేసు కుంది. ఆయనెట్టాగూ రాడు. సరిగ్గా వుండడు. ఆయన్ని నమ్ముకోవటం కూడా మంచిదికాదు. పెద్దమమ్మీ వుందికదా నీకు

తోడు? "

"మనుషులు సరదాకీ, కాలక్షేపానికీ కలుసుకోవటం వేరు నాన్నా. ఇంట్లో మా ఆయన లేరు, రోజూ మీరొచ్చి మా ఇంట్లో పడుకోండని ఆమెనడిగితే ఏం బావుంటుంది చెప్పు? మనం చులకనయిపోమూ? "

"అన్నీ తెలుసామెకి. ఆమె దగ్గర చులకనేంటీ ఆమె మనింట్లో మనిషయితే. అదంతా వదిలెయ్ మమ్మీ. నువ్వడుగు డాడీని. నన్నెలాగయినా సరే స్టేట్స్ పంపించాలి నువ్వు. ఏం చేస్తావో ఆయన్నెలా ఒప్పిస్తావో నాకు తెలీదు" అంటూ కంచంలో చెయ్యి కడుక్కున్నాడు భోజనం ముగించుకుని. కళ్లలో వస్తున్న నీళ్లని మౌనంగా పైటకొంగుతో తుడుచుకుంటూన్న తల్లి దగ్గరకెళ్ళి "నా స్వీట్ మమ్మీ. బాధపడకు. నేను నిన్నేమీ అనలేదు. ఎప్పుడూ అననుకూడా. ఆయన చేసే పనులకి నాకు మండుతుంది. ఆయన ప్రవర్తన చాలా అన్యాయంగా వుంది"

"ఆయన్నంటే కూడా నాకు బాధగా వుంటుంది కన్నా. నువ్వు నన్నంటున్నావని కాదు. పాపం ఆయన చాలా కష్టపడుతున్నాడు. మంచి మనుషులు అలా కష్టపడకూడదు"

"మంచీ మంచీ అంటావు మమ్మీ, నీకెలా చెప్పాలో అర్థంకావటంలేదు. ఎవరికి మంచి? వాళ్లకా! మనకా? అదేమంటే మంచి మనిషి కాబట్టే వాళ్లనలా చూసుకుంటున్నాడని అంటావ్. ఏం... ఆ మంచితనంతో మనని కూడా చూసుకోవచ్చు కదా? "

"చూడు నాన్నా... ప్రపంచంలో అందరూ అందరికీ మంచి చెయ్యలేరు మంచితనం వున్నంత మాత్రాన. మనకిలా రాసిపెట్టుంటే మనమేం చేస్తాం? దేవుడిలాటి అంత మంచిమనిషి కూడా మనకి న్యాయం చెయ్యలేకపోతున్నారంటే నిజంగా నా ఖర్మకాదా? " ధారలుగా వస్తున్న కన్నీళ్లను తుడుచుకుంది అంతకుముందే ఆమె కన్నీళ్లతో పూర్తిగా తడిసిపోయిన పైటకొంగుతో. తల్లి చిన్నపిల్లని బుజ్జగించినట్లు బుజ్జగించాడు. తల్లికి ఏం చెప్పినా అనవసరమనిపించింది. ఆమె మారదనిపించింది. ఆమె ఎంత గొప్పదంటే ఆయన ఏం చేసినా ఆమె ఆయన్ను విమర్శించటంగానీ, ఎదురు తిరిగి మాటనటంగానీ ఎరుగదు. అలాటి తల్లిమీద అతనికి ఎంతో ప్రేమ. ఎంతో ప్రాణం. దగ్గరుండి ఆమెచేత భోజనం చేయించాడు. ఆమెకు ఇష్టంలేని మాటలు ఇక మాట్లాడకూడదని అనుకున్నాడు. మేజర్ శ్రీవాస్తవ్ మాటల్ని గుర్తు తెచ్చుకున్నాడు. బైక్ తీసి బయటికెళ్లాడు.

ఆ విషయం జరిగి దాదాపు నెలరోజులవుతుంది. ఈలోపు దుష్యంతరావు ఒక్కరోజయినా రాలేదు ఇంటికి ఎప్పుడో ఫోన్‌లో మాట్లాడటం తప్పించి. ఆయనే ఫోన్ చెయ్యాలి తప్పితే వీళ్ళు చేసి మాట్లాడటానికిలేదు. ఆఫీసుకి సెలవు పెట్టాడు చాలాకాలంగా. ఎందుకు రావటంలేదనిగానీ ఎందుకు తరచుగా ఫోన్‌చెయ్యటంలేదనిగానీ అడగటానికి లేదు. అడిగితే సమాధానాలేమొస్తాయో పద్మినికి బాగా తెలుసు. పనులు ప్రాబ్లంస్, ఫామిలీ సమస్యలు, ఫోన్‌చెయ్యటం కుదరలేదు. ఇంట్లోంచీ మాట్లాడటం కుదరదు కాబట్టి. నిజంగా బాధ కలిగించేదే ఇదంతా. కానీ ఎవరితో చెప్పుకుంటుంది తన బాధ? ఒకవేళ పొరపాటుగా కొడుకు దగ్గరంటే అంతే సంగతి అగ్నిపర్వతం బద్దలయిపోతుంది. అందుకే అతని దగ్గర పొరపాటుగానయినా భర్తగురించి ఒక్కమాట అనదు, తనలో తనే బాధపడటం తప్ప. మరీ ఈమధ్య ముఖం కూడా చూపించకుండా వుండటం ఆమెకి తీరని ఆవేదన అనిపిస్తుంది. ఆమె ఆరోగ్యం కూడా పాడయింది ఆలోచించి ఆలోచించి, బాధపడి బాధపడి. భర్తని చూడాలని అనిపిస్తోంది ఆమెకు. ఏం చెయ్యగలదు?

ఎప్పుడో అతను ఫోన్ చేసినప్పుడీ విషయం అంటే నాకు మాత్రం రావాలనిపించదా? నాకు మాత్రం చూడాలనిపిం చదా? ఇవీ అటువైపునుంచీ వచ్చే సమాధానాల ప్రశ్నలు. వినీవినీ చెవులు చిల్లులు పడిపోయాయి. కొడుకు అడిగే ప్రశ్నలు చాలావరకు నిజాలే. కానీ అతనితో ఏకీభవించి భర్త గురించిన వ్యతిరేక భావాలకు ఆమె తావివ్వదు.

ఇంకో పదిహేనురోజుల తరువాత వచ్చాడు దుష్యంత రావు ఒకరోజు మధ్యాహ్నం. మొహమంతా పీక్కుపో యింది. సన్నబడ్డాడు. అలా అతన్ని చూసిన పద్మినికి దుఃఖం ఆగలేదు. ఎందుకిలా అయిపోయారని బాధపడింది అతనిదగ్గర. "ఫామిలీ సమస్యలు" మళ్లీ అదే సమాధానం. 'మళ్ళీ మామూలుగా అయిపోతాలే' అని అన్నాడుగానీ ఇంత కాలం రానందుకు పెద్దగా బాధపడలా. కొడుకు పైచదువుల గురించీ, కొడుకు కోరిక గురించీ చెప్పింది



నెమ్మదిగా. ససేమీరా ఒద్దంటే ఒద్దన్నాడు. తన దగ్గరున్న బ్యాంక్ బాలన్స్ కూతురి పెళ్లి, పిల్లల చదువులతో అయిపోయింద న్నాడు. అదీగాక తన తల్లి ఆరోగ్యం బాగా లేదనీ, ఆమె వైద్యానికి చాలా ఖర్చవుతున్న దనీ, ఖర్చుకోసం గవర్నమెంట్ ఇచ్చేది ఏ మూలకీ చాలటంలేదనీ, ఆమె ఆరోగ్యపరి స్థితి ఇవాళో రేపుగానో వున్నదనీ, ప్రస్థుత పరిస్థితిలో అంతడబ్బు తనవల్లకాదనీ ఖచ్చి తంగా చెప్పేశాడు. విచిత్రంగా అనిపించింది భర్తధోరణి. ప్రాణేష్ అన్న మాటలు నిజమే కదా అనిపిస్తున్నాయి. మరి వీడు మాత్రం ఆయన కొడుకు కాదా, వీడికి మాత్రం తండ్రిగా ఆయన బాధ్యత నెరవేర్చాల్సిన అవసరం లేదా అనుకుంది. కానీ అడగలా. అడిగి అతన్ని బాధపెట్టదలుచుకోలా. ఆమె జీవితం ఆమెకే అసహ్యమనిపించింది. తను ఆయన్ని పెళ్ళిచేసుకున్న సమయంలో జీవి తమనేది ఈ స్థితికి వస్తుందని అప్పుడు అనిపించలా. తన దుష్యంత్ తనని పువ్వు ల్లోపెట్టి చూసుకుంటాడనుకుందిగానీ అత నికి చట్టరీత్యా చేసుకున్న పెళ్ళి, దాని తాలూకు బాధ్యతలే నిజమైన బాధ్యతలవు తాయని కలలో కూడా వూహించుకోలేకపో యింది. భర్త ఎదుట ఏం చెప్పలేక పోయింది. భోరుభోరున విలపించింది. మొట్టమొదటిసారి ఆమెకి విరక్తి కలిగింది జీవితంమీద.

ఇదివరకటి దుష్యంత్‌లాలేడు ఇప్పుడు తను చూస్తున్న దుష్యంత్. ఎందుకిలా మారిపోయాడో తెలీదు. అతని ప్రయారి టీస్ ఎందుకు మారిపోయాయో తెలీదు. తన సొంత భర్త. ఇలా చిక్కిపోయాడు. అతన్ని తన చేతులతో బాగుచేసుకునే అవ కాశం తనకి లేదు. కడుపునిండా తనచేత్తో పట్టుమని పదిరోజులు అన్నం పెట్టుకునే అదృష్టానికి తను నోచుకోలేదు. అతనిమీద తనకి ఏ హక్కూ లేనట్టనిపించింది. పరాయి వ్యక్తిలా అనిపించింది ఎందుకో. కారణం తెలీదు తనకి. ఇంత కాలంగా రాలే కపోయినందుకు అతను కాస్త కూడా బాధను వ్యక్తపరచకపోవటం తనకి చాలా బాధ కలిగింది. ఏం చెయ్యగలదు. తనచే తిలో ఏముంది కాబట్టి?

ఇంటికొచ్చిన దుష్యంతరావు మొక్కుబ డిగా కాస్త ఎంగిలిపడ్డాడు. అతను రాగానే గబగబా అతనికోసం ఏదో చేసింది. తిన్నాడు. ఆమె మాట్లాడిన మాటలు కాసేపు విన్నాడు. అతను చెప్పాల్సినవి చెప్పాడు. నిద్రపోయాడు. మామూలుగా వెళ్ళిపోయాడు ఏవో ఇంటి గురించిన మాటలు నాలుగు మాట్లాడి. పద్మిని గుండెంతా బరువయిపోయింది. అతను అటు వెళ్ళగానే గుండెలు పగిలేలా ఏడ్చింది. మనసు తేలిక చేసుకుంది. దుష్యంత్ ఎందుకలా ప్రవర్తిస్తున్నాడో, ఎందుకు తననీ తన కొడుకునీ పట్టించుకో వటంలేదో, ఎందుకు తన ఇంటిని అశ్రద్ధ చేస్తూన్నాడో, ఎంత ఆలోచించినప్పటికీ అసలు కారణం అర్థంకావటంలేదు.

మనసంతా అదోలా వుంది. మనసూ, ఇల్లూ అంతా ఖాళీగా అనిపించింది అతను వెళ్ళిన తరువాత. శరీరంలో ఏదో ఒక ముఖ్యమైన భాగాన్ని పోగొట్టుకున్నట్లు శరీ రమంతా వెలితయినట్లున్నది. చీకటి పడు తుండగా వచ్చాడు ప్రాణేష్.

"నాన్నా... డాడీ వచ్చారురా"

"తెలుసు"

"ఎలా? "

"కారుటైర్ల గుర్తులు కనిపించాయి గేటు లోపల. డాడీ వాసన వచ్చింది ఇంట్లోకి రాగానే"

కొడుకు మొహం చూస్తూ వింటున్న పద్మిని గుండె కలుక్కుమన్నది. 'వాడు ఆయనని ఎంత ప్రేమించకపోతే ఆయన వాసన ఇంట్లో వచ్చిందంటాడు. కానీ ఆయనే ఎందుకో దూరమైపోతున్నారు' అనుకుంటూ కళ్లార్పకుండా అతన్నే చూస్తు

న్నది. రెండు బుగ్గలమీదా కన్నీళ్లు ధార లుగా కారుతున్నాయి.

"మమ్మీ... తప్పేమన్నా అన్నానా? డాడీ రాలేదా?"

"వచ్చారు కన్నా. నువ్వు కరెక్ట్‌గానే వూహించావ్. నీకెంత ప్రేమరా ఆయన మీద. ఎప్పుడూ కనిపించనియ్యవు"

"పిచ్చిమమ్మీ... ఆయనమీద నాకెందు కుండదు ప్రేమ. చాలా ఎక్కువుంటుంది. ఆయనంటే నాకు చాలా ఇష్టం. ఆయనకే మనమీద లేదు. అందుకే ఆయనమీద కోపం వస్తుంది నాకు"

"పోనీగానీ, నీ స్టడీస్ గురించి అడిగానురా... ఆయన వద్దన్నారు అంత దూరం... 'ఇక్కడే చదవనీ... ఇక్కడ లేని చదువులా అక్కడ' అన్నారు"

మనసులో ఏమనుకున్నాడో ఏమో... మొత్తానికి ఏ రాద్ధాంతం లేకుండా ఒప్పేసుకున్నాడు వెళ్ళకూడదని. మనసు బాధపడింది. కానీ దానిని తల్లికి కనిపించనివ్వకుండా నవ్వేశాడు. కొడుకు వింత ప్రవర్తనకి ఆశ్చర్యపడింది. అతనెక్కడ కోపంతో గంతు లేస్తాడో, అతనికెలా చెప్పాలో అని ఒకటే బాధపడింది అంతవరకు.



టీవీలో ఏవో ప్రోగ్రామ్‌లు చూశారు రాత్రి భోజనం అయిన తరువాత తల్లీకొడుకులిద్దరూ. ఇద్దరూ ఏం మాట్లాడుకోలేదు పెద్దగా. దుష్యంతరావు వచ్చి వెళ్ళిన దగ్గర నుంచీ ఆమెకెందుకో అనేక రకాల భయాలూ, అనుమానాలూ బయలుదేరాయి. అతను పూర్తిగా దూరమయిపోతున్నాడేమో. అతన్ని ఇంట్లోవాళ్లు పూర్తిగా రానివ్వకుండా చేస్తారేమో. ఏవో ఆలోచనలు. ఏవో భయాలు, కాళ్లూ చేతులూ ఆడటం లేదు. నిద్రలోకి ఒరిగిపోయింది పద్మిని.

రెండు సంవత్సరాలు ఎలా గడిచిపోయాయో తెలీదు. ప్రాణేష్ పోస్ట్‌గ్రాడ్యుయేషన్ అయిపోయింది. దుష్యంతరావు జనరల్ మేనేజర్‌గా ప్రమోట్ అవబడ్డాడు. దానివల్ల వీళ్లకి ఒరిగేదేదీలేదు. ఎందుకంటే అసలు మనిషంటూ ఇంట్లో మనిషిలా ప్రవర్తిస్తే ఆనందించవచ్చు ఈ రెండు సంవత్సరాల్లో అతను చాలా మారిపోయాడు. రావటం చాలావరకు తగ్గిపోయింది. రోజులూ, వారాలూ కాకుండా నెలలు పడుతున్నాయి అతను ఇంటికి రావటానికి. పద్మిని అడిగింది చాలాసార్లు. ఒకసారి కొడుకులిద్దరూ పై చదువులకి ఫారిన్ వెళ్లటంవల్ల, ఇంట్లో చికాకులతో రాలేకపోయానన్నాడు. ఇంకొకసారి కూతురు దగ్గరకి ఢిల్లీ వెళ్లటంవల్ల రాలేకపోయానన్నాడు. ఇంకోసారి అందరూ కలసి బాంబే, గోవా తిరిగివచ్చామన్నాడు. ఇంకోసారి తన ఆరోగ్యం బాగాలేదన్నాడు. ఈ సాకులన్నీ వినీవినీ మనసు మొద్దుబారిపోయింది ఆమెకి. ఇక అతన్ని భగవంతుడే మార్చాలి. జరగాల్సిన దౌర్భాగ్యాలన్నీ జరిగాయనుకుంది. ఆమె మనసంతా విరిగిపోయింది. ప్రపంచంలో వున్న ప్రేమకి 'ప్రేమ' అనే పేరుకంటే 'అవకాశం' అనే పేరు పెడితే సూటవుతుందనుకుంది. మనుషులు ఇంతేసి తేడాలెందుకు చూపిస్తారో అర్థం కాలేదు. చాలాసార్లు ఏవూరయినా వెళదామని

ఎంతోకాలంగా అడుగుతుంటే అనారోగ్యంగా వున్న తల్లిని వదిలి ఎక్కడికీ వెళ్ళటం కుదరదని చెప్పేవాడు. నిజమేననిపించేది. కొడుకుని ఫారిన్ పంపడానికి లేని డబ్బు తన కొడుకుల్ని పంపడానికి వచ్చింది. ఆ విషయం తలుచుకుని చాలా బాధపడింది. దుష్యంత్ అంతటి మంచివాడు అంతగా. స్వార్థపూరితంగా ఆలోచిస్తున్నందుకు 'కలి'ని తిట్టుకుంది. కలికాలంలో కలి పురుషుడు మంచివాళ్లలో కూడా బలవంతంగా ప్రవేశిస్తాడని విన్నది, భారతంలో పరీక్షిత్ మహారాజులాటి మంచి ప్రభువులోకి కిరీటం ద్వారా వెళ్ళిన కథని లోగడ వినివుండటం వల్ల. కానీ ఇప్పుడు కళ్లారా చూసి, ఆ కలిగాడిని తిట్టుకుంది. శాపనార్థాలు పెట్టింది. ఇక తనకెవ్వరూ లేరని నిర్ధారించుకుంది. ఆరోగ్యం కూడా చాలా పాడయింది గత రెండుమూడు సంవత్సరాలుగా.

భర్త వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాడని విన్నది ఎందుకో తెలీదుగానీ ఇక మిగిలిన ఆశ కూడా పోయింది అతను ఇంటికి వస్తాడని. ఆఫీసు లేని మగాడు ఇంకా ఎక్కడికెళతాడు. ఇంట్లోవాళ్లు ఎటెళ్లనిస్తారు? రిటైరయిన మగాణ్ణి ఇంట్లో వుంచడానికి వాళ్లకనేక రకాల సాకులు దొరుకుతాయి పెద్దవాళ్లయిన పిల్లలవంక... రెస్ట్ తీసుకోవాలనే వంక... లేకపోతే ఇంట్లో వాళ్లకే ఒంట్లో బాగాలేదనే వంక... అల్లుళ్లేమన్నా అనుకుంటారనే వంక... మనవళ్లతో ఆడుకోవాలనే వంక... ఏదైనా దొరకచ్చు అతన్ని బయటికి పంపకుండా ఇంట్లోనే వుంచుకోవడానికి. పోనీ ఇంట్లో వుంచుకోవటం తప్పయితేకాదు. రైట్ రాయల్‌గా పాతివ్రత్యంతో ఇంట్లో వుంచుకోవచ్చు అందరూ మెచ్చుకునే విధంగా. స్వంత భర్త కాబట్టి.

ఎమ్ఎస్‌సీ అయిన దగ్గరనుంచీ ఇంట్లోనే కూర్చోవాల్సి వస్తున్నందుకు తెగ బోర్‌గా వుంది ప్రాణేష్‌కు. తల్లి పరిస్థితి చూస్తుంటే బాధగా వుంది. ఆమె ఆరోగ్యం కూడా బాగుండటంలేదు తండ్రిమీద బెంగతో. అన్నీ తెలుసు ప్రాణేష్‌కి. కానీ ఏమీ చెయ్యలేని స్థితిలో సతమతమైపోతూన్నాడు. చాలాసార్లు పెద్దమమ్మీతో కూడా చెప్పాడు "ఏం చేస్తాం బేటా. మూడోవాళ్లు కల్పించుకునే విషయాలు కావుకదా ఇవి" అని మాటలను డైవర్ట్ చేసింది. ముందుకంటే కూడా ఆమె ఇప్పుడు వీళ్ల కుటుంబానికి బాగా దగ్గరయింది పద్మిని ఒంటరిది అవడంవల్ల.

అనుకోకుండా ఒక ప్రపోజల్‌తో వచ్చింది మిసెస్ కుల్‌కర్ణి.

"మీరాషామ్ ఫోన్‌లో మాట్లాడాడు రాత్రి. నన్ను అమెరికా రమ్మన్నాడు. ఒక్కదాన్నే వెళ్లడానికి భయంగా వుంది. అసలే ఈమధ్య కంటి ఆపరేషన్ అయిందికదా! కంటిచూపుకూడా సరిగాలేదీ మధ్య. ఇదే విషయం వాడితో అన్నా! కాదురా నువ్వే వచ్చి రెండు నెలలుండిపో అంటే వింటే గదా! తనకి అంతటైమ్ దొరకదన్నాడు. ప్రాణేష్‌కి వీలుంటే అతన్ని వెంట తెచ్చుకోమన్నాడు నాతో వున్నట్టుంటుంది. అమెరికా వచ్చినట్టువుంటుంది. అన్నదమ్ములిద్దరూ కలుసుకున్నట్టవుతుంది. ఏమంటారు పద్మినీ? " అంది.

"నాదేముంది దీదీజీ. వాడినడగండి. వాడికిష్టమయితే తీసికెళ్లండి. వాడిని రానివ్వండి మాట్లాడదాం"

"అయినా అక్కడికి వెళితే మాత్రం వర్రీ ఎందుకు. త్రీవీక్స్ మాత్రమే వుండి వస్తాం. వాడు అక్కడినుండి ఇంకేదో చోటకి వెళ్లాలట సెమినార్లూ, మీటింగులకోసం. వాడు వెళితే నెలరోజులదాకా రాడట తిరిగి. అందుకని నన్నే రమ్మన్నాడు. ప్రాణేష్ వచ్చిన తరువాత డిస్కస్ చేద్దాం" అంది.

పైకి ఏదో మాట అన్నదేకానీ పద్మిని గుండె ఝల్లుమంది. అసలే దుష్యంత్ రావటం అంతంత మాత్రమయింది. తన ఆరోగ్యమా అంత బాగా వుండటంలేదు.

ఛెస్ట్ పెయిన్ వస్తోంది. తనకున్నది ఒక్క
గానొక కొడుకు. దూరమయితే వుండగలనా
అనుకుంది. కానీ ప్రస్తుత పరిస్థితినిబట్టి
చూస్తే వాడికీ విషయం చెప్పిన వెంటనే
ఒప్పేసుకోవచ్చు అందులోనూ స్టేట్స్ వెళ్ల
టమంటే వాడికి చాలా ఇష్టం అనుకుంది.

మిసెస్ కుల్‌కర్ణి చాలాసేపుంది పద్మిని
దగ్గర. బయటికెళ్లిన ప్రాణేష్ రానేవచ్చాడు.
విషయం ఓపెన్ చేశారు. అతను వెళ్లాలని
ఉవ్విళ్లూరాడు. అది గ్రహించిన పద్మిని
అతన్ని ఆమెతో అమెరికా పంపటానికి సిద్ధ
మయింది. అందరికీ ఇష్టమే. కానీ భర్త
ఏమంటాడో తెలీదు. ఏమనటానికేముంది
తనకేమన్నా ఖర్చవుతుందా? లేక తనే
మన్నా ముందులా ఇంటికి వస్తున్నాడా
అభ్యంతరం వ్యక్తపరచటానికి అనుకుంది.

దుష్యంతరావుని ఫోనులో ఎలాగో పట్టు
కుంది. ఇంటికి రమ్మని చెప్పింది. అతను
వచ్చాడు. విషయం చెప్పింది. "ఎందుకూ
అనవసరంగా ఇప్పుడు. అయినా వాళ్లెవరి
తోనో వాళ్ల ఖర్చులతో వెళ్లటం ఎందుకొ
చ్చిన ఖర్మ? నీకు కూడా ఒంట్లో బాగుండ
టంలేదు. నాకా నాకు ఇటు రావటానికే
కుదరటంలేదు. ఎందుకు వాడిప్పుడు
వెళ్లటం?" అన్నాడు పొడిపొడిగా.

"వాడేదో సరదా పడుతున్నాడు. పాపం
వాడి సరదాలేవీ తీరలేదు. అందులోనూ
వాడికిప్పుడు ఖాళీయే. నా ఆరోగ్యమంటారా
దానివల్ల పెద్ద ఇబ్బందేదీ లేదు. జరిగిపో
తుంటాయ్ రోజులు. మూడు వారాలేకదా
అయినా దీదీ పరాయిదేమీ కాదుగా"

"వాడికి జాబ్ అరేంజ్ చేస్తున్నాకదా!
మొన్న ఒక ఎన్నారై అతను వాళ్లదేదో
సూపర్‌స్పెషాలటీ హాస్పిటల్ ప్రారంభించ
బోతున్నానని చెబితే మనవాడి విషయం
చెప్పా. అతను మనవాడిని అక్కడ సైకా
లజీ డిపార్ట్‌మెంట్‌లో కలుపుకుంటాన
న్నాడు."

"మళ్లీరాదు దుష్యంత్, వాడికిలాటి అవ
కాశం. అయినా వాడు జాబ్ చెయ్యటానికి
ఇది అడ్డం అవదు. వాడు మూడు వారాల్లో
పల వచ్చేస్తాడు. అవతల అబ్బాయికి అమె
రికాలో వేరే ఏవో పనులున్నాయట. కొంత
కాలం ఇంట్లో వుండడట. అందుకే తొంద
రగా వచ్చేస్తారు" అంది. ముందెన్నడూ
భర్త చెప్పిన మాటకి ఎదురు చెప్పలా.
ఇప్పుడు అతను తన మనిషి కాడు. ఏదో
బలవంతంగానూ, డ్యూటీగానూ వస్తున్నా
డని అర్థమయింది తనకి. అందుకే తన
మనసులోని అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

"మరి నీ ఇష్టం. ఒంటరిగా వుండాలి
సుమా"

నిర్లిప్తంగా నవ్వింది. "దుష్యంత్ నేనె
ప్పుడూ వంటరిదాన్నే. ఆ విషయం ఇప్పుడు
తెలిసిందా మీకు? నాకారణంగా వాడి
ఆనందం ఎందుకు పాడు చెయ్యాలి
చెప్పండి? మీరు భయపడకండి మిమ్మల్ని
రమ్మనిగానీ, నాతో వుండమనిగానీ నేను
మీకు చెప్పను. ఆ భయాలేమీ ఒద్దు మీకు.
నేనేదో కృష్ణారామా అనుకుంటూ గడుపు
తాను. అయినా పనిమనిషుందిగా. నా
గురించి మీరు ఇబ్బంది పడద్దు. వాడు
కూడా పడకూడదు"

గిల్టీగా వుంది దుష్యంతరావు మొహం.
భార్య చెప్పిన మాటలకేమీ అనలేకపో
యాడు. లేచి వెళ్లిపోయాడు.

తన మాటలతో భర్తని కష్టపెట్టిందేమో
నని చాలా బాధపడింది. నిజానికి తను ఆ
మాటలు చెప్పే సమయంలో భర్త కళ్లలో
కళ్లు పెట్టి కూడా చూడలేకపోయింది తను.
ఎందుకంటే ఒకళ్ల మనసు గురించి ఇంకొక
ళ్లకి బాగా తెలుసు వాళ్లిద్దరి మధ్యలో.
అతను నిస్సహాయ పరిస్థితిలో వున్నాడనీ
అనేక వ్యక్తిగత, సామాజిక, ఆర్థిక సమస్య
లతో సతమతమవుతున్నాడనీ ఆ విష
యమై అతను బాధ పడుతున్నాడని కూడా
తనకి బాగా తెలుసు. ఏం లాభం? తన
కోసం బాధపడే అతను తనకోసం రాలేకపో

వటం, ఆమెను చూడలేకపోవటమన్నది ఎంత దారుణమైన విషయమో కూడా తనకి తెలుసు. తన పెళ్లి సమయంలో ఇలాంటి విషయాల గురించి లోతుగా వాళ్లిద్దరూ ఏదీ చర్చించుకోలా. ఎంతసేపటికీ విడిపోయిన ప్రేమికులు ఏది చేసయినా ఏదో ఒక విధంగా బతకాలని అనుకున్నారు గుడ్డి ప్రేమలో పడి. కానీ తన ప్రేమే తనకి శతృవవుతుందని తను వూహించలేకపోయింది. నిజానికి తనకి అతనిమీద ప్రేమ లేకపోతే తనెందుకు ఆల్ రెడీ పెళ్లయిన అతన్ని చేసుకోవాలి? తనెందుకు జీవచ్ఛవంలా అయిపోవాలి? కేవలం ఒక మగాణ్ణి ప్రేమించిన నేరానికి అందరాడవాళ్లూ ఇలాగే దీనాతిదీనంగా గతిమాలిన బతుకులు బతుకుతున్నారా? ప్రేమించినవాడిని మర్చిపోయి వేరే పెళ్లిళ్లు చేసుకోవటం లేదూ? మరి తనెందుకు చేసిందీ తెలివిమాలిన పని?

కేవలం మనసు చెప్పిన మాట విన్నది. బుర్ర చెప్పిన మాట వినలేదు. తనకంటూ ఒక మైండున్న విషయం కూడా ఆలోచించలా. నీతి నిజాయితీ అని వాటి వెంటబడింది. వేరే వాడిని పెళ్లిచేసుకుని ఆ సంసార జీవితానికి న్యాయం చేకూర్చలేనేమోనని బాధపడింది. తనని అత్యంత ప్రాణంగా ప్రేమించిన తన దుష్యంత్ తన కోసం బాధ పడతాడనుకుంది. వేరే వాడి భార్యగా అతను తనని చూడలేడేమోనని అతని గురించి ఎక్కువగా ఆలోచించి బతుకు బండలు చేసుకుంది. అతను లేని జీవితాన్ని వూహించుకోలేకపోయింది. అతను తన కళ్లముందు కనిపిస్తే తనకు మిగతావి ఏవీ ఒద్దనుకుంది. బతుకును బూడిద చేసుకుంది. తనెప్పుడూ అతనికి మీరి ఆలోచించలేదు. వాళ్లిద్దరికీ వెలుపలున్న ప్రపంచం గురించి ఆలోచించలేకపోయింది. తన దుష్యంత్ తననుండి వేరుపడితే ఆ సమాజం తనకేం న్యాయం చేసిందని వాపోయింది.

ఏ సమాజం గురించయితే తను ఆలోచించలేదో అతను అదే సమాజం గురించి ఎక్కువగా ఆలోచించాడు. ఏ స్వార్థం గురించయితే తను ఆలోచించలేదో ఆ స్వార్థం గురించి అతను ఆలోచించాడు. ఏ కుటుంబ జీవితం గురించయితే తను ఆలోచించలేదో అతను దాని గురించే ఎక్కువగా ఆలోచించాడు. అలాగని అతను చెడ్డవాడు కాదు. చాలా ఉత్తముడు. నిజానికి అలాటి భర్త దొరకటానికి ఏ ఆడదానికయినా ఎంతో గొప్ప అదృష్టం వుండాలి. అతను విచక్షణ కలిగి ప్రవర్తించాడు. తను విచక్షణారాహిత్యంతో ప్రవర్తించింది. కనీసం తన కంటూ సంతానం పుడతారనికానీ వాళ్ల జీవిత విధానం, జీవనం ఎలా జరుగుతుందనిగానీ కలలో కూడా ఆలోచించలా. అదీ తను చేసిన పెద్ద తప్పు. తనకు అక్కర్లేనివన్నీ అతనికి కావాలి ఈనాడు. అదీ ఇప్పుడు వచ్చిన ఇబ్బంది. ఏవైతే తను అతనికోసం వదులుకుందో వాటిని అతను కోరుకుంటున్నాడు.

మనసంతా వికలమైపోయింది. గుండె వేలకి వేల ముక్కలయింది. తన ఆత్మ తనని విడిచి వెళ్లినట్లయిపోయింది. గుండెల్ని పిండేసినట్లనిపిస్తోంది. ఈరోజు తను అనుభవించే ఆవేదననుంచి తప్పించటానికి తన బుద్ధి, జ్ఞానం, తెలివితేటలూ ఏవీ తనకు పనికిరాలా. కడుపులో తిప్పేస్తున్నట్లనిపిస్తోంది. తనకి తెలుసు తను పదహారేళ్ల పడుచు కాదు. ఒక మగవాడి ప్రేమలో గుడ్డిగా పడి కొట్టుకోవడానికి. తన ఒంటికయితే వయసు వచ్చిందికానీ తన మనసుకు వయసెంతో తనకి తెలీదు. అదెప్పుడూ ఎవరిమాటా వినలేదుకూడా. తన ఆత్మ ఎంతో ఘోషపెడుతుంది తన ప్రాణాతి ప్రాణమైన తన దుష్యంత్‌కోసం. అతని మొహం చూస్తే నలిగి, వాడిపోయిన అతని మొహం చూస్తుంటే తన శరీరం

గాయాలతో నలిగిపోయినట్లనిపించింది. ప్రేమ అనేది చాలా శక్తివంతమయినదని తను వింది. కానీ ఇంత ప్రాణాంతకం గానూ ప్రాణాలను తీసేదిగానూ ఇంత భయంకరంగా వుంటుందని తనకి తెలీదు. దాని శృంఖలాలు ఇంత కఠినంగానూ, దాని కోరలు ఇంత క్రూరంగానూ ఉంటాయని తను వూహించనయినా వూహించలా. తన కళ్లముందునుంచే తన మనిషి తన దుష్యంత్ పరాయివాడిలా వెళ్లిపోతుంటే కనీసం అతన్ని వుండమని చెప్పే స్వతం త్రత తనకి లేక చేతుల్నీ, మనసునీ కట్టేసు కుని కళ్లార్పకుండా చూస్తుండిపోవాల్సిన దుస్థితి వచ్చింది. ఇవాళ అతనిలా వెళ్లిపో వడానికి పునాది అతను మోహినిని చేసుకు న్నప్పుడే పడిందన్న నగ్నసత్యం ఆమెకు తెలీదు. తన ఆత్మఘోషను తలుచుకుం టూంటే తనెప్పుడో చదివిన ఒక కథ గుర్తొచ్చి ఆ కథని నిజంగానే తన ఆత్మ గురించి రాశారని అనిపించింది.

బ్రిటన్‌లో ఒక మహిళ, ఆమెకు ఒక కొడుకు. వాడు స్కూల్లో చదువుకుంటు న్నాడు. ఆమెకు భర్తలేడు. ఆమె బ్రిటన్ పాలెస్‌లో రాణి దగ్గర అంతరంగిక సేవకు రాలిలా ఉద్యోగం చేస్తుంది. ఆమె కొడుకు బాగా చదవటంలేదని ఒక రోజు అతన్ని బాగా కోప్పడి అతన్ని భయపెట్టడానికనీ, చదువు విలువను తెలియజేద్దామనీ ఆ పిల్ల వాడిని ఆమె బెడ్‌రూమ్‌లో వున్న అల్మా రాలో పెట్టి బయటినుంచి గడియపెట్టింది. అనుకోకుండా రాణీగారి దగ్గర నుంచీ ఫోను వచ్చింది ఆమెను ఉన్నఫళంగా రమ్మని. యజమానురాలి దగ్గరనుంచి వచ్చిన ఫోను అది. అందులోనూ బ్రిటన్ సామ్రాజ్యానికి మహారాణి ఆ యజమానురాలు. భయప డుతూ గబగబా పరుగులాటి నడకతో వెళ్లి పోయింది పాలెస్‌కి. వెళ్లేప్పుడు ఆమె తన కొడుకుని అల్మారాలో వుంచిన విషయం గుర్తులేదు. కనీసం ఆమె సర్వెంట్సుకయినా పిల్లవాడి గురించి చెప్పే అవకాశం ఆమెకి లేకపోయింది ఆ హడావుడిలో. రాణీగారి దగ్గరకెళ్లి, పని చూసుకుని కాస్త వ్యవధి దొరకటంతో పిల్లవాడి విషయం ఆమెకు గుర్తొచ్చింది. విషయం రాణీకి చెప్పి గజగ జలాడుతూ ఇంటికి పరుగుతీసింది. అల్మారా తలుపు తీసింది. ఒళ్లో పుస్తకాన్ని పెట్టుకుని కాళ్లు ముడుచుకుని కూర్చున్న కొడుకు కనిపించాడు. అతన్ని దగ్గరకు తీసుకుందామని కదిలించింది అతన్ని. నిర్జీ వంగా అయిన అతని శరీరం ఆమె చేతు ల్లోకి ఒరిగింది. అతని ఒళ్లోనున్న నోట్ బుక్ కిందపడింది. ఆ పుస్తకమంతా తడిసి వుంది. అప్పుడామెకర్థమయింది కన్నకొ డుకు తనకోసం ఏడిచి ఏడిచి ఊపిరాడక చచ్చిపోయాడని. అప్పటినుంచీ ఆమె పిచ్చి దయింది. కొన్ని నెలల తరువాత ఆమె మరణించింది. చచ్చిపోయిన తరువాత కూడా ఆమె ఆత్మ శాంతించలా. కొడుకుని చేతులారా చంపుకున్నందుకు తననితను క్షమించుకోలేకపోయింది. ఆమె ఆత్మ ఆ ఇంట్లో తిరగటం మొదలెట్టింది. ఆ ఇంట్లో వున్నవాళ్లకి ఆమె ఆత్మ ఏడిచే ఏడుపు విన బడేదట. అంటే ఆమె చచ్చిపోయిన తరు వాత కూడా ఆమె ఆత్మ తన కొడుకుకోసం ఎంతో తపించిపోయిందన్నమాట.

తన పరిస్థితి కూడా అంతే. కలలోకూడా తన దుష్యంత్‌కి దూరమయి బతకలేదు. ఒకవేళ అలా బతకాల్సి వస్తే తను కూడా ఆ ఇంగ్లిషు లేడీలా చచ్చిపోయి ఆత్మయి తన దుష్యంత్‌కోసం ఏడుస్తుంది. అతను తన ఆత్మ అని ఆమెకి మాత్రమే తెలుసు అతనికి తెలీదు. తన కొడుకు కేవలం తన శరీరానికి మాత్రమే పుట్టాడు. కానీ దుష్యంత్ తన ఆత్మలో ఒక భాగమని ఆమెకు నమ్మకం. అందుకే అతన్ని అలా ఆ పరిస్థితిలో పెళ్లి చేసుకుంది.

కళ్లలోంచి నీరు ధారలుగా ప్రవహిస్తోంది. రెక్కలన్నీ విరిగిపోయిన పక్షిలా అయిపో

యింది భర్త అటు వెళ్లిపోగానే. చేసేదేమీ లేదని కూడా ఆమెకి తెలుసు. పరిష్కారం తన చేతుల్లో లేదని ఎప్పుడో తెలుసు. ఓపిక ఉన్నంతసేపు ఏడిచింది. తరువాత కాసేపు ఇంట్లోకీ బయటికీ తిరిగింది.

★ ★ ★

ప్రాణేష్ అమెరికా ప్రయాణం ఖరార యింది. మిసెస్ కుల్‌కర్ణి అనుకున్నది సాధించింది. ప్రాణేష్‌ని తనతో అమెరికా తీసికెళదామనుకుంది. దానికి తగ్గట్టు పరిస్థితులన్నీ అనుకూలించాయి. వెళ్లటానికీ రావటానికీ తనతో ఎవరయినా తన మనుషులుంటే తనకి మంచిదనీ, తనకి తోడు తప్పనిసరిగా కావాలని అనుకుంది. ఖర్చు గురించి వెనకాడలా. మొత్తానికి ప్రయాణం తేదీ నిర్ణయమయింది.

అదృష్టవశాత్తూ పాస్‌పోర్ట్ సమస్య రాలేదు ప్రాణేష్‌కి. ఎందుకంటే అతను బిఎస్సీ చేసే సమయంలో తన క్లాస్‌మేట్స్ పోస్ట్‌గ్రాడ్యుయేషన్‌కి అమెరికా వెళ్లాలని ప్లాన్ చేసుకున్నారు. వాళ్లతో ప్రాణేష్ కూడా వంతపాడాడు. అందరూ కలసి పాస్‌పోర్ట్‌కి దరఖాస్తు పెట్టుకున్నారు. నాలుగు నెలలు పట్టింది ఆ ఫార్మాలిటీస్ తతంగమయి పాస్‌పోర్ట్ చేతిలోకి రావడానికి. తమాషా ఏమిటంటే అతనితోబాటు అతని స్నేహితులు ఎవరెవరు పాస్‌పోర్ట్‌లు తీసుకున్నారో వాళ్లంతా అమెరికాలోనే వున్నారు ఒక్క ప్రాణేష్ తప్ప. దుష్యంత రావు అతన్ని పంపటానికి ఒప్పుకోకపోవటంవల్ల అమెరికా ప్రయాణానికి బదులు పాస్‌పోర్ట్ మాత్రమే మిగిలిందతనికి. వాళ్లందరూ అమెరికా వెళ్లిన తరువాత బీరువాలో వుంచిన పాస్‌పోర్ట్ అప్పుడప్పుడు అతని కంటపడటం, అతని కడుపు భగ్గుమనటం జరిగేది. తండ్రిమీద ఎక్కడలేని మంటా పుట్టేది. కొన్నిసార్లు పనికిరాని ఆ పాస్‌పోర్ట్‌ని తగలబెడదామని కూడా అనుకుని బలవంతంగా తమాయించుకున్నాడు. తండ్రి తనను ఎలాగూ అమెరికా కాదుకదా కనీసం శ్రీలంకయినా పంపడని అతనికర్థమయి పోయింది. ఎందుకంటే తను ఆయనకి దొంగకొడుకు కాబట్టి. అదే తను లీగల్ కొడుకయినట్లయితే అమెరికా కాదుగదా చంద్రమండలం కూడా పంపేవాడు ఆయన తలుచుకుంటే. అదీ తండ్రిమీద అతనికున్న అభిప్రాయం. ఆ పాస్‌పోర్ట్ అతనికి దండగ అనుకున్నాడు. ఆయన తననెటూ పంపడు. తనకా సొంతంగా వెళ్లే స్తోమత లేదు. జీవితం నడుస్తోన్న ధోరణిలో ఎప్పుడయినా ఫ్యూచర్‌లో వెళతాడనే నమ్మకం కూడా అతనికి లేదు. తల్లి చెప్పినట్టుగా తన తల రాతంతే అనుకున్నాడు. అందుకే దాన్ని తగలబెడదామని ఎందుకులే పాపం అదేం చేసిందని దాన్ని కంటపడనివ్వకుండా తన పాంట్లకింద పడేశాడు. దాని సంగతి మర్చిపోయి కూడా రెండు సంవత్సరాలయిపోయింది. ఇప్పుడు దాని అవసరం వచ్చింది. దాన్ని వెతికి పట్టుకుని ముద్దు పెట్టుకున్నాడు. తన ముందు చూపుకు గర్వపడ్డాడు. తల్లి చెప్పినట్టు జీవితం తలరాత మీద ఆధారపడి వుంటుందన్న విషయం నిజమేననిపించింది. తలరాత మూలంగానే తనిప్పుడు అమెరికా వెళ్లబోతున్నాడనిపించిందతనికి.

ప్రయాణం ఇంకా వారం రోజులు మాత్రమే ఉంది. మిసెస్ కుల్‌కర్ణి షాపింగ్‌లో చాలా బిజీగా వుంది. ఆమెకి కావలసిన స్వెట్టర్లూ, షాట్లూ, ఇంకా కొన్ని ముఖ్యమైన వస్తువులు, ముఖ్యంగా అక్కడికి కావలసిన లిస్ట్ తయారు చేసుకుని దానిప్రకారం కొంటున్నది. కొడుక్కి ప్రెషర్ కుక్కర్ తెస్తానని చెప్పింది చాలా రోజుల క్రితం. అందులోనూ అతను బాచ్‌లర్ అవటంవల్ల అతనే వండుకోవాలి ఇంట్లో. అతని వంటకి ఇంకా అక్కడ దొరకని ఇక్కడ దొరికే వస్తువులు తీసుకుంది. ప్రాణేష్‌కి కూడా కొన్ని తీసుకుంది బట్టలూ, సూట్‌కేస్ లాటివి. తనకి

# పలినముత్యాలు

- మీ భయాన్ని మీవద్దే దాచుకోండి. కానీ మీ ధైర్యాన్ని మాత్రం ఇతరులతో పంచుకోండి.

  – లాంగ్‌ఫెలో

- మనం ఇష్టపడనివారిపట్ల ప్రదర్శించే వైఖరిని నీతి అంటారు.

  – జోస్‌మర్టీ

- కష్టపడి పనిచేయడానికి ముందు విశ్రమించడాన్నే సోమరితనం అంటారు.

  – సెనెకా

- వ్యాసం మెదడు నుండి పుట్టుకువస్తే, కవిత హృదయం నుండి పుట్టుకువస్తుంది.

  – రవీంద్రనాథ్‌ఠాగూర్

- అన్ని సుగుణాలను ఒకేఒక వ్యక్తిలో చూడాలని అనుకోకు.

  – కన్‌ఫ్యూసియస్

- ఒక మంచి మిత్రుడిని కోల్పోయినప్పుడు మనం కొంత మరణిస్తాము.

  – అల్‌మనాక్

- ప్రతిభతో ప్రారంభమైన గొప్పపనులను పరిశ్రమే పూర్తిచేయగలదు.

  – మొరార్జీదేశాయ్

- అనుభవపు ఊటనీరును త్రాగడాన్ని ఖాతరు చేయని వ్యక్తి అజ్ఞానపు ఎడారిలో దప్పికతో చనిపోతాడు.

  – రింగ్. పే

- మనలోని మంచినికాదుకాని చెడును తెలుసుకోడానికి ప్రపంచం ఎల్లప్పుడూ ఎదురుచూస్తుంటుంది.

  – వెండల్ హామ్స్

- ఓటమిని ఒప్పుకోవడంలో ఏమాత్రం తప్పులేదు. ఒప్పుకోవడం అన్నది గెలుపుకు సమానం.

  – గాంధీ

- మూఢ ఆధ్యాత్మిక విశ్వాసం వదులుకున్నా పరిశోధనాత్మకమైన ఆధ్యాత్మిక విచారం వదులుకోనక్కరలేదు.

  – డా.సర్వేపల్లి

- స్వీయసౌభాగ్యంకోసం స్వలాభాపేక్షతో గ్రంధరచనలు సాగించే రచయితలు పెక్కుమంది. సాంస్కృతిక వారసత్వం కోసం రాసేవారు కొద్దిమందే.

  – త్రిపురనేని

సేకరణ: ముద్దంశెట్టి అండమ్మ

కొన్ని నైటీలు కొనుక్కుంది. బయటికెళ్లటానికి కొన్ని ఫాన్సీ పట్టుచీరలు కొనుక్కుంది. మొత్తానికి అనుకున్న ప్రకారం అన్ని పనులు చకచకా జరిగిపోతున్నాయి ఏ విఘ్నాలూ కలుగకుండా.

పద్మిని కొడుక్కి ఐదువేలు కాష్ ఇచ్చి "కన్నయ్యా వీటిని నీ దగ్గర జాగ్రత్తగా పెట్టుకో. నీ పెర్సనల్ ఖర్చులకీ, ఏదయినా అర్జంట్ అవసరానికీ వుంటుంది. నాన్నా ఇది అమెరికా వెళ్లటానిగ్గానీ, అక్కడ ఖర్చులకి గానీ ఎందుకూ పనికిరాదని నాకు తెలుసు. నీకు తెలుసుగా మన పరిస్థితులు' ' అంటూ వస్తున్న పుట్టెడు దుఃఖాన్ని దిగమింగుకుంది.

"మమ్మీ నాకెందుకు డబ్బు? పెద్దమమ్మీ చెప్పింది నువ్వొక్క పైసా కూడా తెచ్చుకోవద్దు. నా దగ్గరున్నాయి. మనకి అవసరానికి మించిందే తెస్తున్నాను. మీ మమ్మీని అనవసరంగా కష్టపెట్టకు అని. అవును మమ్మీ నీ దగ్గరుంచు. పనికొస్తయ్" అంటూ ఆ డబ్బు ఆమె చేతిలోంచి అందుకుని మళ్లీ ఆమెకందించాడు.

తనకి కూడా చాలా దుఃఖంగా వుంది తల్లిని ఒంటరిదాన్ని చేసి వెళ్లాలంటే. కానీ అంతకంటే బాధపడతాడు తనిప్పుడు వెళ్లకపోతే. అందుకే ఏడుపు వస్తున్నా ఆపుకుంటూన్నాడు. తనకి బాగా తెలుసు తనెళ్లిపోతే తన తల్లికెవరూ లేరనీ, బొత్తిగా ఒంటరిదయిపోతుందని. అసలామె అన్నం కూడా తింటుందో లేదో అనుమానమే. కానీ గుండెని రాయి చేసుకున్నాడు స్వతహాగా మగవాడికున్న అహంతో.

"లేదు నాన్నా, ప్లీజ్ దాన్ని నీ దగ్గరుండనియ్యి. పెద్దమమ్మీ అన్నీ చూసుకుంటుందని నాకు తెలీదా? కానీ నేను కూడా నీకు మమ్మీనే కదరా! నా కొడుకు అంతదూరం వెళుతుంటే నేనేదయినా చెయ్యకపోతే నాకెంత బాధగా వుంటుంది చెప్పు? తీసుకో ప్రాణా" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంది. చేసేదేమీ లేక ఆ డబ్బు తీసుకుని పాంట్ జేబులో పెట్టుకున్నాడు.

బేగంపేట ఎయిర్‌పోర్ట్ లాంజ్‌లో కూర్చున్నారు మిసెస్ కుల్‌కర్ణి, పద్మినీ, ప్రాణేష్. పద్మిని మొహం ఏడిచి ఏడిచి ఎర్రగా అయిపోయింది. ఆమె కళ్లు ఉబ్బి వున్నాయి. కొడుకు చెయ్యి పట్టుకుని కూర్చుంది. మిసెస్ కుల్‌కర్ణికి జాలేసింది ఆ స్థితిలో వున్న పద్మినిని చూస్తుంటే.

మిసెస్ కుల్‌కర్ణిని చూస్తుంటే తను ఆమెకెంతో ఋణపడిపోయి నట్లనిపిస్తుంది. పాపం పెద్దావిడ నా కొడుకులో ఆమె కొడుకును చూసుకుని వాడికి బోలెడు డబ్బు దోచిపెడుతోంది విచక్షణ లేకుండా. అమెరికా ప్రయాణపు షాపింగ్‌కోసం ఆమె ప్రాణేష్‌కోసం కనీసం యాభైవేలయినా ఖర్చుపెట్టి వుంటుంది. పోనీలే ఒక నెల రోజుల్లోగా తిరిగి వచ్చేస్తారుకదా ఆమె అంత చేస్తుంటే కాస్త ఓర్చుకోవటానికేముంది అని తనను తను సమాధానపరుచుకుంది.

కాసేపటికి ఎనౌన్స్‌మెంట్ వినిపించింది చెన్నై వెళ్లే ప్రయాణీకుల్ని సెక్యూరిటీ చెక్ కోసం వచ్చెయ్యమని. అది విన్న మిసెస్ కుల్‌కర్ణి లేచింది చేతిలోవున్న హాండ్‌బాగ్‌తో. ప్రాణేష్, పద్మిని ఇద్దరూ కూడా లేచారు. ప్రాణేష్‌కి గాభరాగా వుంది, పద్మినికి గుండె దిగులుగా వుంది కొద్ది క్షణాల్లో కొడుకు కనుమరుగైపోతాడని. ఇంటికెళితే ఖాళీ ఇంట్లో, కొడుకు కనిపించని ఇంట్లో ఒక్కతే వుండాలి కొన్నాళ్లకోసమని. గుండె ఝల్లుమంది. ఒళ్లంతా ముచ్చెమటలు పడుతున్నాయి. అయినా ఏమీ ఎరగనట్టే నవ్వు మొహంతో వాళ్లిద్దరినీ చూస్తున్నది. అతికష్టంమీద దుఃఖాన్ని దిగమింగుకుంటోంది.

నెమ్మదిగా అడుగులేశారు సెక్యూరిటీ చెకింగ్‌వైపు ప్రాణేష్, మిసెస్ కుల్‌కర్ణి. ఎంతవరకూ వెళితే సెక్యూరిటీకి ఇబ్బంది కలగదో అంతవరకూ వాళ్లిద్దర్నీ అనుసరించింది పద్మిని. మిసెస్ కుల్‌కర్ణి వెనకాల

ప్రాణేష్, ప్రాణేష్ వెనకాల పద్మినీ నడుస్తున్నారు. సడన్‌గా ప్రాణేష్ వెనక్కి తిరిగి తల్లిదగ్గరకొచ్చి ఆమె మెడచుట్టూ రెండు చేతులూ వేసి తల్లి మొహానికి తన మొహం ఆనించాడు. అతని కళ్ల వెంట నీరు కారాయి.

"మమ్మీ టేక్ కేర్. ఆరోగ్యం జాగ్రత్త. రోజూ అన్నం వేళకి తిను. నెగ్లెక్ట్ చెయ్యకు. వాషింగ్‌టన్ వెళ్లిన వెంటనే ఫోన్ చేస్తా. నా కోసం దిగులు పడకు మమ్మీ" కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుంటూ చెప్పాడు తల్లికి. ఆమె కొడుకుని వదలలేక వదలలేక వదలబోయింది.

"నాన్నా నువ్వు దిగులుపడకు నేనొక్కదాన్నే వుంటానని. నాకేం ఫరవాలేదు. అయినా ఒక్కదాన్నే వుండనుకదా... డాడీ లేరూ? నువ్వు కూడా టైముకి భోజనం చెయ్యి. హాయిగా ఎన్‌జాయ్ చెయ్యి అక్కడ"

తన తల్లికి ఆమె భర్తమీద వున్న పిచ్చి ప్రేమకు నవ్వుకున్నాడు. ఆయన తల్లిని పట్టించుకోడనీ, ఆయన ప్రయారిటీస్‌లో ఏదో ఐటమ్ కూడా తన తల్లి కాదనీ అతనికి బాగా తెలుసు. కానీ ఆ విషయం ఆమెకెంతవరకు తెలుసో తనకి తెలీదు. అయినప్పటికీ ఆమెకి ఆమె భర్త మీదున్న నమ్మకం అలాంటిది. ఆ విషయాన్ని దాటవేస్తూ, "ఓకే మమ్మీ... ఏం ఫరవాలేదు. పెద్దమమ్మీ వున్నారు కదా" అంటూండగా

"అవును నేను లేనూ పద్మినీజీ? ఏమీ బాధ పడనవసరంలేదు. వెళ్లిన వెంటనే మీకు ఫోన్ చేయిస్తాను. మీతో రెగ్యులర్‌గా టచ్‌లో వుంటాడు మీ ప్రాణేష్. నేను అతన్ని నా కంటికి రెప్పలా చూసుకుంటాను ప్లీజ్... దిగులు పడకండి"

"ఛఛ... అవేం మాటలు? మీరెలా చూసుకుంటారో నాకు తెలుసు. అందుకే కదా పంపుతున్నాను. లేకపోతే నేను పంపుతానా? ఓకే, బయలుదేరండి. టైమవుతోంది" అంది అలసటతో కూడిన నవ్వు మొహంతో.

వాళ్లిద్దరూ అటు సెక్యూరిటీ చెకింగ్‌వున్న వైపు వెళ్లారు. ఇంటికి తిరుగు ప్రయాణమయింది మిసెస్ కుల్‌కర్ణి కారులో.

★ ★ ★

వాషింగటన్ డల్లాస్ ఎయిర్‌పోర్ట్‌లో దిగారు మిసెస్ కుల్‌కర్ణి, ప్రాణేష్. బయట వైపుకి నడుస్తూ చుట్టూ పరికిస్తున్నారు మీరాషామ్‌కోసం ఇద్దరూ. అదొక దేవేంద్ర లోకంలా వుంది. హైదరాబాద్ ఎయిర్‌పోర్ట్ దాని ముందెందుకూ పనికిరాదు. ఎలావుంది వర్ణించటానికి ప్రాణేష్‌కి అసలు నోట్లో మాటలు కూడా కరవయ్యాయి. ఫ్లైట్ దిగినప్పటినుంచీ అతనికి నమ్మబుద్ధవటంలేదు నిజంగానే తను అమెరికా వచ్చాడా అని. ఎక్కడ హైదరాబాద్ ఎక్కడ అమెరికా! ఎక్కడి సైనిక్‌పురి ఎక్కడ వాషింగన్! ఎక్కడ బేగంపేట ఎయిర్‌పోర్ట్ ఎక్కడ డల్లాస్‌ఎయిర్‌పోర్ట్! అసలు అతనికి ఏదో లోకంలోకి అడుగుపెట్టినట్టుగా వుంది. అందులో మంచులాటి చల్లని వాతావరణం. కానీ ఆ ఎయిర్‌పోర్ట్‌లో మనుషులను చూస్తుంటే మాత్రం మామూలుగా అన్నిచోట్లా వుండే ప్రయాణీకులులా కనిపించారు.

అధికశాతం అక్కడవాళ్లే. వాళ్లలో అక్కడక్కడ టర్బన్లలో కనిపించుతున్న సర్దార్‌జీలు... ముస్లిమ్‌లు... అరబ్బులు... ఆ అరబ్బుల్ని చూస్తుంటే వాళ్ళ తలకు వేసుకున్న నల్లటి రింగ్ మమ్మీ కిచెన్‌లో గోడకి వేళ్లాడే కుక్కర్ గాస్కెట్ గుర్తుకొస్తుంది. పాశ్చాత్యదేశాల్లో చాలాచోట్ల కనబడుతుంటారు వాళ్లు. ఇకపోతే కొంతమంది సౌత్ ఇండియన్స్ వీళ్ల గురించి ఎవరూ చెప్పనక్కర్లేదు ప్రాణేష్‌కి. మగవాళ్ళయినా, ఆడవాళ్లయినా అతను వాళ్ళని పోల్చుకోగలడు. వాళ్ళ కట్టూ, బొట్టూ అతనికి బాగా తెలుసు.

చుట్టుపక్కల అందరినీ పరికించి చూస్తు న్నాడు. తెలియని మీరాషామ్ మొహాన్ని గుర్తుపడదామని. ఎదురుగుండా ఆరడు గుల మనిషి కనిపించాడు. చాలా స్మార్ట్‌గా వున్నాడు. ఇంగ్లీషువాడి రంగుతో పోటీపడే రంగు. వాళ్ళ డ్రెస్‌తో పోటీపడే సూటు... బూట్లు. మీసాలుమాత్రం లేవు. నల్లద్దాలు పెట్టుకున్నాడు. అతను వాళ్ళవైపుకే వస్తు న్నాడు. నడక... ఠీవి... ఒత్తుగా వున్న జుట్టు. డీసెంట్ హెయిర్ కట్. నడక చాలా కాజువల్‌గా వుంది. అతను కనిపిం చగానే మిసెస్ కుల్‌కర్ణి కాస్త వడివడిగా నడిచింది. వీళ్ళిద్దర్నీ చూస్తుంటే ప్రాణేష్‌కి అర్థమైపోయింది ఆ వచ్చే వ్యక్తే మీరాషామ్ అని.

దగ్గరకొచ్చాడు. మిసెస్ కుల్‌కర్ణి అతన్ని ప్రేమతో కౌగలించుకుంది. పరిచయం చేసింది వాళ్ళిద్దరికి. వాళ్ళిద్దరూ ఒకళ్ళ మొహాలొకళ్ళు చూసుకున్నారు. నిజంగానే ఒకళ్ళని పోలినట్లు ఇంకొకళ్ళు వున్నట్లనిపిం చింది వాళ్ళిద్దరికి. వాళ్ళిద్దరిలో చిన్న తేడా ఏమిటంటే ఐదారు సంవత్సరాలుగా మీరా షామ్ అమెరికాలో వుండటం మూలంగా అతనిలో నిగారింపు, డాబు వచ్చింది. ఆత్మ విశ్వాసం వచ్చింది. అతను చేసేపనిలో అత నికి గుర్తింపు, డబ్బు రావడంవల్ల. జీవితా నుభవంగానీ, లోకానుభవంగానీ లేకపోవ టంవల్లా, ఉద్యోగరీత్యా సంపాదనాపరుడు కాకపోవడంవల్లా ప్రాణేష్‌లో ఆ ఆత్మవి శ్వాసం లోపించి, అయోమయంగా కనబడు తున్నాడు.

ముగ్గురూ ఎయిర్‌పోర్ట్ బయటికి వచ్చి కారులో కూర్చున్నారు. డ్రైవింగ్ చేస్తున్న మీరాషామ్ పక్కన ప్రాణేష్ కూర్చున్నాడు. వెనక సీట్లో మిసెస్ కుల్‌కర్ణి కూర్చుంది. ఆమె ఆనందానికి అవధులు లేవు కొడు కును చూసిన తరువాత. సాధారణంగా చాలాకాలం తరువాత కొడుకుని చూసిన్న తల్లి అడుగుతుంది కొడుకుని 'చాలా చిక్కి పోయావు. సరిగా అన్నం తినటంలేదా నాన్నా?' అని. కానీ ఆమె కొడుకుని అలా అడగలేదు. పైపెచ్చు ఇప్పుడు కాస్త హెల్దీగా కనిపిస్తున్నావు బేటా. బహుశా నువ్విక్కడి వాతావరణానికి బాగా ఎడ్జస్టయిపోయుం టావ్' అంది ఎయిర్‌పోర్ట్‌లో. ఇప్పుడు కారులో వెనకసీట్లో కూర్చుని వాళ్ళిద్దర్నీ గమనిస్తోంది. నిజంగా వాళ్ళిద్దరికీ పోలికలు న్నమాట నిజమే అనుకుంది. మీరాషామ్, ప్రాణేష్ ఇద్దరూ బాగానే కలిసిపోయారు. వాళ్ళిద్దరికీ నాలుగు సంవత్సరాలు మాత్రమే తేడా. ప్రాణేష్‌కి ఇరవైమూడు సంవత్సరాల యితే మీరాషామ్‌కి ఇరవైఏడు సంవత్స రాలు అంతే.

గంట ప్రయాణం చేసిన తరువాత కారు ఒక ఇంటిముందు ఆగింది. ఆ ఇంటికి సిమెంట్‌కలర్ పెయింటింగ్ వెయ్యబడి వుంది. ఇంటిరంగు పూర్తిగా కనిపించనియ్యా కుండా ఇంటి గోడలకి దట్టంగా అల్లుకుపో యిన ఆకుపచ్చటి లతలు. వాటికి సన్నస న్నటి పువ్వులు. సడన్‌గా చూస్తే ఆ ఇల్లు ఆకుపచ్చగా అనిపిస్తుంది. అది చిన్న ఇండి పెండెంట్ ఇల్లు. ఇంటి బయట పొందిక యిన చిన్న గార్డెన్, కాంపౌండ్‌వాల్. కారు ఇంటి లోపలికి రావటానికి వీలులేనంత చిన్నదయిన వికెట్‌గేట్. కారును బయటే పార్క్‌చేసి వుంచాలి పార్కింగ్ ప్లేస్‌లో. చుట్టుపక్కల అక్కడున్న అన్ని ఇళ్ళూ ఒకే డిజైన్‌లో వున్నాయి. అన్ని ఇళ్ళకీ లతలు అల్లుకోబడివున్నాయి. సిటీప్లానింగూ, కాలనీ ప్లానింగూ ఎలా వుంటుందో చెబుతుంది ఆ లొకేషన్. అన్ని ఇళ్ళూ ఒకే దూరాలను పాటిస్తున్నాయి. అన్ని ఇళ్ళ గేట్లూ ఒకే డిజై న్‌లోనూ, తెల్లగానూ ఉన్నాయి. రెండు కళ్ళు చాలటంలేదు ఆ వాతావరణాన్ని పరికించ డానికి. పరిసరాలన్నీ అతిశుభ్రంగానూ, పచ్చదనంతో కళకళలాడుతూ లక్ష్మీదేవి నివాసాన్ని ప్రకటిస్తున్నాయి.

ఎవరు మొయ్యగలిగిన సామానును

వాళ్ళు పట్టుకుని ముగ్గురూ ఇంటి ప్రాంగణంలోకి ప్రవేశించారు. మెయిన్‌డోర్ ఓపెన్ చేశాడు మీరాషామ్. అతన్ని అనుసరించింది అతని తల్లి. వాళ్ల వెనకాలే నడిచాడు ప్రాణేష్.

ఆ ఇల్లు టూ బెడ్‌రూం ఇల్లు. పేరుకు టూ బెడ్‌రూమ్ ఇల్లేగానీ పెద్దహాలూ... పెద్ద కిచెనూ... పెద్ద పెద్ద బెడ్‌రూములూ- ప్రతి బెడ్‌రూమ్‌కీ ఒక అటాచ్‌డ్ ఓపెన్ వరండా. అందులో చక్కటి అందమైన డెకరేషన్ ప్లాంట్స్. ఇల్లంతా ఒకసారి పరికించి చూశాడు ప్రాణేష్. టూ బెడ్‌రూమ్ హౌసయినా ఎంత పెద్దగా, ఎంత అందంగా వుంది అనుకున్నాడు. ఆ ఇల్లు బాచ్‌లర్‌దయినా దానిలో వాషింగ్‌మెషీనూ, డిష్‌వాషరూ, ఎక్సర్‌సైజ్ పరికరాలూ... పెద్ద టీవీ, పెద్ద ఫ్రిజ్, కంప్యూటరూ ప్రతి వస్తూవూ వుంది. అన్ని వసతులూ వున్నాయి. కాకపోతే ఇంట్లో ఆడవాళ్ళ ఉనికి లేకపోవటంవల్ల ఇల్లంతా మగ వాతావరణమే కనిపిస్తుంది.

ఎక్కడపడితే అక్కడ చిందరవందరగా పడున్న వస్తువులు, బెడ్‌మీద దిండ్లు, రగ్గు, నైట్‌డ్రెస్సూ, టవలూ అడ్డదిడ్డంగా పడున్నాయి. కిచెన్‌లో కావలసిన అన్ని వస్తువులూ, పరికరాలూ వున్నప్పటికీ చాలా గజిబిజిగా వుంది. కోడిగుడ్డు తాలూకు షెల్సూ, టీ చేసుకున్న గిన్నెలూ, కప్పులూ, మగ్గులూ, ఫ్రిజ్‌లో ఎప్పుడో పెట్టిన బ్రెడ్లూ, అయిపోయిన సాస్ సీసాలూ, నీళ్ల లేని వాటర్‌బాటిల్సూ, బీర్ టిన్స్‌తో ఫ్రిజ్ వెలితి వెలితిగా కనబడుతుంది. వాష్‌బేసిన్‌లో కొన్ని ప్లేట్లూ, గాజుగ్లాసులూ, కుక్కర్ గిన్నెలూ పడున్నాయి. ఇంట్లో ఎక్కడ చూసినా అస్తవ్యస్తంగా వుంది. అశ్రద్ధ చెయ్యబడినట్టు చిందరవందరగా వుంది. వీటన్నింటినీ గమనించింది మిసెస్ కుల్‌కర్ణి.

“మీరా... ఏంటిరా ఈ ఇల్లూ... ఈ వస్తువులూ. అందుకే నేను చెబుతుంటా తొందరగా ఎవరినయినా చేసుకుని సెటిలవరా అని. అయినా ఆడది లేని ఇల్లు ఒక ఇల్లా చెప్పు? ఎంతకాలం ఇలా ఒంటికాకిలా వుంటావ్ చెప్పు? ”

“లేదు మమ్మీ... ఈమధ్య హాస్పిటల్లో వర్కెక్కువయిపోయింది. క్షణం తీరిక దొరకటంలేదు. అదీగాక జస్ట్ సిక్స్‌మంత్స్ బ్యాక్ దాన్ని ఓపెన్ చేశాను. ప్రాక్టీస్ చాలా బాగా పికప్ అయింది. అంతకుముందు చేస్తున్న జాబ్ వదిలేసి సొంతంగా పెట్టా దీన్ని. ప్రాక్టీస్ బాగుండటంవల్ల తొందరగా వెళ్ళిపోయి లేటుగా రావలసివస్తుంది మమ్మీ. ఇంట్లో భోజనం చెయ్యటంలా. ఇక పెళ్ళంటావా నేను రెడీ. నేనిప్పుడు బాగా సెటిలయ్యాను కాబట్టి చేసుకుంటా. నువ్వే చూడు మమ్మీ మంచి అమ్మాయిని ఇండియాలో. జెస్ట్ పిల్లని చూడు. ముహూర్తం పెట్టించు. నేనొచ్చి పెళ్లిచేసుకుని అమ్మాయినీ, నిన్నూ తెచ్చేసుకుంటా ఇక్కడికి” అంటూ స్నానానికి వెళ్ళిపోయాడు.

ఈ లోపల ఫ్రిజ్‌లో కనిపించిన బ్రెడ్‌తో టోస్ట్ చేసింది ఆవిడ ముగ్గురికోసం. అది తిని మీరాషామ్ హాస్పిటల్‌కి వెళ్ళాడు. ప్రాణేష్‌ని కూడా రమ్మన్నాడు తనతో సరదాగా. “ఈ రోజంతా రెస్ట్ తీసుకుని రేపొస్తా” అన్నాడు ప్రాణేష్.

మీరాషామ్ హాస్పిటల్‌కి బయలుదేరాడు. అతను వెళ్ళబోతుంటే ఇంటికి కావలసిన కొన్ని వస్తువుల లిస్ట్‌ని అతనికిచ్చింది తల్లి.

“మమ్మీ... నేను హాస్పిటల్లో డ్రాపయి, అక్కడ పనిచేసే రాబర్ట్‌ని పంపుతాను. వాడు తెస్తాడు నువ్వు రాసిన ఐటమ్స్. డోంట్‌వర్రీ. వాడికి మన ఇండియన్ పద్ధతులు బాగా తెలుసు. వాడు మన ఇండియన్స్ చాలామంది దగ్గర గంటల లెక్కలో పార్ట్‌టైమ్ జాబ్ చేస్తాడు క్లీనింగ్ దగ్గర నుంచీ కుకింగ్ దాకా. వాడికి హిందీ కూడా బాగా వచ్చు వాడి హెల్ప్‌తో ఇంట్లో

పనులు చూసుకో మమ్మీ. రేపటినుంచీ నీతో ఎవరయినా ఒకళ్లు హెల్ప్‌కి వుండ టానికి ఏర్పాటుచేస్తా. ఒక లేడీ హెల్పు రుంది. ఆమె కోసం ట్రై చేస్తా. ఆమె వస్తే నీకు చాలా రిలీఫ్‌గా వుంటుంది" అంటూ వెళ్ళిపోయాడు హాస్పిటల్ కి.

అతను వెళ్ళిన తరువాత ప్రాణేష్ హాయిగా వేడివేడి నీళ్లతో షవర్‌స్నానం చేశాడు. భోజనం చేశాడు వేడివేడిగా. టీవీ చూస్తూ అలాగే నిద్రపోయాడు.

మిసెస్ కుల్‌కర్ణి రాబర్ట్ హెల్ప్‌తో ఇల్లంతా సవరించి ఎక్కడివస్తువులక్కడ పెట్టింది. బట్టల్ని వాషింగ్‌మెషిన్‌లో వేసింది. కిచెన్ శుభ్రంగా చేసింది. ఇల్లు నలా చూస్తుంటే చిరాకనిపించింది. ఇల్లు శుభ్రంగా లేకపోతే ఆమెకి తోచదు. మధ్యాహ్నం మూడుగంటలవరకు ఇంట్లో పనే సరిపోయింది. ఆ ఇల్లు ఒక కొలిక్కి రావటంకోసం చాలా కష్టపడిందావిడ, రాబర్ట్ లేకపోతే చాలా కష్టపడేది. తల్లికి ఇంటిపనులు చేసుకునే అలవాటు లేదనీ, ఆమెకి మనిషెవరయినా వుండాలని తెలుసు కాబట్టి మిరాషామ్ ముందుగానే రాబర్ట్‌ని పార్ట్‌టైం కోసం ఏర్పాటు చేశాడు.

సాయంకాలం గార్డెన్‌పని పడదామని నిర్ణయించుకుంది. అస్తవ్యస్తంగా పెరిగిన లానూ, మొక్కలూ, సరిగా నీళ్లు లేక కొన్ని వాడిపోయిన మొక్కలు, తలలు వంచి వాలి పోయున్నాయి. రాబర్ట్‌చేత పైప్ పెట్టించి నీళ్లు పోయించింది. ఒక మూల పడివున్న లాన్ మూవర్‌ని తెప్పించి లాన్‌ని ట్రిమ్ చేయించింది వాడిచేత. అవకతవకలుగా పెరిగిన క్రోటన్ కొమ్మలనీ, మిగిలిన అక్క రలేని కొమ్మల్నీ కట్ చేయించింది. పూలతో నిండివున్న చైనాబాక్స్ మొక్క గుబురుగా ఎత్తుగా వున్నప్పటికీ సరిగా నీళ్లు లేక వాడి పోయివుంది. దానిలో నీళ్లు నిలిచేలా పాదు చేయించి, పాదునిండా నీళ్లు పోయించింది.

పువ్వులు వాడిపోయినందువల్ల నీళ్లు తగల గానే ఘుమఘుమలాడింది. ఆ వాసనతో గార్డెనంతా నిండిపోయింది. ఇండియాలో తన ఇంట్లో ఆ చెట్టు సరిగ్గా తన బెడ్‌రూమ్ కిటికీకానుకుని వుంటుంది. ఆ పువ్వుల వాసనంటే ఆమెకి తగనిపిచ్చి. ఆ చెట్టుతో ఆమె బంధం ఈనాటిది కాదని ఆమె అభి ప్రాయం. ఆమె చిన్నతనంలో నైనిటాల్ లో వున్న ఆమె తల్లి పుట్టింట్లో వుండేదా మొక్క. ఆ మొక్కని ప్రాణంగా చూసుకునే వారు ఆమె తాతగారు. అలా ఆమె తల్లికి, తల్లినుంచీ ఆమెకీ సంక్రమించిందా అభి రుచి. ఎప్పుడో మీరాషామ్ అమెరికా వస్తుంటే అతని సూట్‌కేస్‌లో ఒక చిన్న కొమ్మ పడేసింది అతను ఒద్దంటున్నా విని పించుకోకుండా. అమెరికాలో సూట్‌కేస్ తెంచిన అతను ఆ కొమ్మను చూసి నవ్వుకు న్నాడు. ఎందుకంటే ఆ కొమ్మ సెక్యూరిటీ చెక్‌వాళ్ళ కళ్లలో కూడా పడలేకపోయినం దుఃఖ. తల్లి ఇచ్చిందికదా అని సెంటిమెం ట్‌తో ఆ కొమ్మని భద్రంగా తనే తన గార్డె న్‌లో ఒకమూల గుచ్చాడు మట్టిలో. అను కోకుండా ఆ కొమ్మ బతికి, చిగుర్లేసి ఇప్పు డంత పెద్దగా అయింది. ఆ మొక్కకి నీళ్లు పోసి సంరక్షించినందుకు మిసెస్ కుల్‌కర్ణి ఎంతగానో తృప్తిచెందిందిప్పుడు. ఆ గుమ్మ టమైన మొక్కను చూసుకుని ఉబ్బితబ్బిబ్బ యిపోయింది. మొత్తానికి గార్డెన్‌ని కూడా ఒక ఆకారానికి తెచ్చింది సాయంకాలం ఆరుగంటలవుతుండగా. అప్పుడే నిద్రలేచిన ప్రాణేష్ ఇంట్లో ఎవరి అలికిడీ లేకపోయేస రికి తిన్నగా గార్డెన్‌లోకి వచ్చాడు. అక్కడ మిసెస్ కుల్‌కర్ణి గార్డెన్‌కి ఫైనల్ టచ్చెస్ ఇస్తోంది, రాబర్ట్‌ని పక్కనే పెట్టుకుని. తను వచ్చినప్పుడు కనిపించిన గార్డెన్‌కీ, ఇప్పుడు కనిపిస్తున్నవీ, పొద్దున తను చూసినవీ ఒకటే మొక్కలు. కానీ సంస్కారం లేక నీళ్లు అందుబాటు లేక వున్న అప్పటి మొక్కలకీ, ఇప్పుడు కనిపిస్తూ కళకళలాడే మొక్కలకీ అసలు పొంతనే లేదు. ప్రతి

మొక్కకూ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుని, పసి పిల్లల్ని వుంచిన తీరులో వున్నాయి. నీటి స్పర్శ తగిలిన ఆ మొక్కలు ఆనందంతో తలలనాడిస్తూ నాట్యం చేస్తున్నట్టనిపిస్తుంది. చల్లటి నీళ్లలో హాయిగా స్నానం చేసిన వనకన్యల్లా మిలమిలలాడిపోతున్నాయి. కొన్ని లతలు కనిపించీ కనిపించని ప్లాస్టిక్ దారం సహాయంతో పైకి పాకించబడివున్నాయి. నేలమీదున్న ప్రతి మొక్కకీ నీళ్లు అందటానికి వీలుగా మెసులుబాటు చెయ్యటం జరిగింది. తొట్లలో వున్న ప్రతి మొక్క అవసరాన్ని బట్టి ట్రిమ్ చెయ్యబడి, ఎండు ఆకులన్నింటినీ తీయబడి, నూతన అందాలతో సింగారింపబడివున్నాయి. గార్డెన్‌లో ఒకపక్క ఎండుటాకులన్ని ఒక చిన్న కుప్పగా పోసివున్నాయి. అసలే ఆర్మీ ఆఫీసర్ భార్య ఆమె. అందులోనూ అవసరానికి మించిన కామన్ సెన్సూ, కళాత్మక హృదయం రెండూ జోడయ్యాయి. ఎన్నో సంవత్సరాలు భర్తతో ఎన్నోచోట్లు చూసింది. ఎన్నో గొప్ప గొప్ప ప్రదేశాలు చూసింది. రకరకాల లొకేషన్స్. ఇంటికి సంబంధించిన అన్ని డిపార్ట్‌మెంట్సూ ఆమెకు కొట్టినపిండి. ఏ పనినయినా అత్యంత సులువుగానూ, అందంగానూ, వేగంగానూ, భద్రంగానూ చేసుకుపోగల సామర్థ్యశాలి ఆమె.

భగవంతుడు సృష్టిని రచించినప్పుడు ఆడదాని విషయంలో ఆయన కాస్త పక్షపాతం వహించాడేమోననిపిస్తుంది. ఎందుకంటే ఆమెకు గల ఓర్పు, అవగాహనశక్తి, నైపుణ్యం, ఏకాగ్రత, విచక్షణాజ్ఞానం, దయాగుణం, అందం... వీటన్నింటినీ మించింది విపరీతమైన చైతన్యవంతం. మగవాడితో పోల్చుకుంటే స్త్రీలో చాలా చైతన్యం కనిపిస్తుంది. సాధారణంగా మనం చూస్తుంటాం. ఆఫీసుకెళ్ళి ఇంటికి వచ్చిన మగవాళ్ళు నేరుగా బెడ్‌రూమ్‌లోకెళ్లి రెస్ట్ తీసుకుంటూనో, టీవీ చూస్తూనో, పేపర్ చదువుతూనో, నిద్రపోతూనో వుంటారు. కానీ స్త్రీ అలాకాదు. ఆఫీసునుంచి వచ్చినా కూడా చెప్పులు వదిలేసిన మరుక్షణం ఆమె వెళ్లేది కిచెన్‌లోకి. ఇంటి బాగోగుల గురించి, సవ్యాపసవ్యాల గురించే ఆమెకెప్పుడూ. సాధారణంగా మనకి కనిపించే ఆడవాళ్లందరూ కూడా వయసుతో నిమిత్తం లేకుండా చాలా చురుకుగా కనబడటానికి కారణం ఇదే. స్త్రీ చంచల స్వభావురాలన్న పదానికి చాలామంది దాన్నికి వికృతమైన అర్థాలను కల్పించి, స్త్రీ ఏదో చపలచిత్తమైనదన్నట్టు ముద్ర వేశారు. చంచల స్వభావానికి సరయిన అర్థం చైతన్యవంతమైనదని. అంటే ఆమె మనసు, శరీరం రెండూ ఎప్పుడూ చైతన్యవంతంగా, చంచలంగా అంటే విపరీతమైన చురుకుగా వుండటం. అంతేగానీ, చంచలమంటే చపలచిత్తమని కాదు అర్థం. ఆమె మనసూ, బుద్ధీ ఎప్పుడూ తనను నమ్ముకున్నవాళ్ల మీదా, తనమీద ఆధారపడిన కుటుంబసభ్యులమీద నిమగ్నమయి వుంటుంది. ఎప్పుడూ వాళ్ళ క్షేమం గురించే ఆమె తాపత్రయం. అందుకే ఎప్పుడూ అవిశ్రాంతిదాయకంగా ఏదో ఒకపనిలో మునిగివుంటుంది. ఏ స్త్రీ అయినా. చాలాసార్లు చూస్తుంటాంగానీ నిశితంగా పరిశీలించం ఈ విషయాన్ని. సాధారణంగా వయసునిండిన భార్యాభర్తలలో వారిమధ్య వయసు తారతమ్యం అంతగా వుండనప్పటికీ వారిద్దరిలో భార్యే చాలా చురుకుగా తిరుగుతూ తనకి చేతనయినదేదో ఒకపనిని చేస్తుంటుంది. మగవాడలా కాదు. పడుకుంటాడు. లేకపోతే కూర్చుని ఏదో చదవటమో మాట్లాడటమో చేస్తుంటాడు. అంతదాకా ఎందుకు ప్రాణేష్ కూడా మిసెస్ కుల్‌కర్ణితోబాటు ప్రయాణం చేసి వచ్చాడు. ప్రయాణపు బడలిక అతనికి కలిగింది. కానీ ఆమె కాస్తయినా రెస్ట్ తీసుకోకుండా అప్పటినుంచీ సాయంకాలం ఆరుగంటలయిపోయినా ఇంకా ఇంకా ఏదో చేస్తూనే వుంది.

అంటే ఆమె అలసిపోలేదా అంటే... ప్రాణే ష్‌కంటే వయసులో ఆమె చాలా పెద్దది. తప్పకుండా అలసిపోయివుంటుంది. ఇక్కడ అలసిపోవటమంటే శరీరం మనసు కాదు. ఆమె శరీరం అలసిపోయినా నిత్య యవ్వ నంగా వున్న ఆమె మనసు అలవలేదు. అదే విల్‌పవరంటే- ఆశక్తే ఆమెచేత తన కుటుంబం కోసం, తన మనుషుల కోసం శ్రమింపజేస్తున్నాయి. స్త్రీ అంటే అదే. శక్తి స్వరూపం.

గార్డెన్ చూసి ఆనందంతో ఆశ్చర్యపడిన ప్రాణేష్ "పెద్ద మమ్మీ... మనం వచ్చినప్పు డున్న గార్డెన్‌కీ, ఇప్పుడున్న గార్డెన్‌కీ అసలు సంబంధమే లేదు. ఎంత బ్యూటిఫుల్‌గా వుంది. ఇల్లు కూడా షేప్ మారి పోయింది. పెద్ద మమ్మీ... రియల్లీ యూ ఆర్ గ్రేట్. అప్పటినుంచీ అసలు రెస్ట్ తీసు కోనట్టున్నావ్? "

"అవును బేటా... పడు కోలా... వీడొక్కడే వున్నాడిక్కడ. ఇల్లూ, వాకిలీ చికా కుగా వుంది మెయిన్‌టెనెన్స్ లేక. ఏముందీ అంతా అయిపోయిందిలే" అంటూ గార్డె న్‌లో వున్న వాటర్‌టాప్ దగ్గరకెళ్ళి చేతులు కడుక్కోసాగింది.

"అవును పెద్ద మమ్మీ... నాకో డౌటు. మరి అక్కడ కార్నర్‌లో వేసి వుంచిన ఆ ఎండు ఆకులనేం చేస్తారు? వాటిని మన దగ్గర వీధిలో పడెయ్యకూడదుకదా? "

"దానిదేముంది బేటా... నేను ఆల్‌రెడీ రాబర్ట్‌కి చెప్పేశా ఇక్కడే మొక్కల దగ్గర నేలమీద అక్కడక్కడ చిన్న చిన్న గుంటలు చేసి, కొన్ని కొన్ని ఆకులను మట్టిలో వేసి కప్పిపెట్టమని చెప్పా... ఎక్కడెక్కడ కప్పిపె ట్టాలో కూడా చెప్పాలే" అంది అలసటగా.

అర్థం కానట్టు "ఎందుకు పెద్ద మమ్మీ? " అడిగాడు.

"ఎందుకేమిటి ప్రాణేష్... అవి బయట చెత్తలా అవకుండా వుంటాయి. అదే సమ యంలో మన మొక్కలకు ఎరువులుగా కూడా పనికొస్తాయి"

"ఓహ్... ఫెంటాస్టిక్ ఐడియా... నిజంగా నాకు మతిపోతుంది మీ ఆలోచన లకు. సో... యూ మేక్ ఎ గుడ్ గార్డె నింగ్ ఆల్సో" అంటూ మురిసిపోయాడు. ఆమె కూడా తనకు దొరికిన పొగడ్తలతో కాస్తంత గర్వప డింది. ఇద్దరూ లోపలికెళ్ళారు చీకటి పడిపోవ టంతో.



అమెరికా వచ్చి వారం దాటిపో యింది. మిసెస్ కుల్‌కర్ణి ఇంట్లో పనులతోనూ, కొడుకు మంచీచె డ్డలు చూసుకోవడం లోనూ పూర్తి బిజీ. ప్రాణేష్‌కి మాత్రం అప్పుడప్పుడు బోర్‌గా వుంటుంది. బొత్తిగా ఇల్లే ప్రపంచమయిపోయింది ఒక్కోసారి జైలుపక్షిలా. మరోసారి ఆడంగిలా అనిపి స్తుంది. బయటికి వెళ్ళాలంటే కొత్తచోటు, కొత్తదేశం. అప్పటికీ మీరాషామ్‌తో రెండు సార్లు వెళ్ళి హాస్పిటల్ చూసి వచ్చాడు. తల్లితో ఒకసారి మాట్లాడాడు ఫోనులో. అప్పటికే చాలా డాలర్లవుతాయి. ఎంత ఇంట్లో వున్న ఫోనులో మాట్లాడినా దానికీ డబ్బులవుతాయిగా. అదీగాక మిసెస్ కుల్ కర్ణిని, ఆమె కొడుకునీ ఎక్కువగా ట్రబుల్ చెయ్యదలచుకోలా అతను. ఏదో టీవీ చూస్తూనో పక్కవీధివరకూ వెళ్ళొచ్చే

వీడియో గేమ్స్‌తోనూ కంప్యూటర్ బ్రౌజింగ్‌తోనో తనకు తను వ్యాపకం పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు ప్రాణేష్.

బయట వానజల్లు పడుతోంది. ఆకాశమంతా కారుమబ్బులతో చీకటి నిండిపోయింది. రెండు రోజులుగా వాషింగ్‌టన్‌లో ఎండ రావటంలేదు. చాలా డల్‌గా వుంది వాతావరణం. వాతావరణం ఆహ్లాదంగా లేకపోయినా ఎండ లేకపోయినా చినుకులూ, వానా పడుతుంటే అమెరికా అయినా ఒకటే, అల్లూరయినా ఒకటే. వాతావరణం డల్‌గా వుండటంతో బోర్‌గా వుంది. ఆరోజు మీరాషామ్ కూడా కాస్త తొందరగానే వచ్చాడు హాస్పిటల్‌లో అతనికి అట్టే పని లేకపోవడంతో. ఇంటికి తొందరగా వచ్చిన కొడుకుతో చినుకులు పడుతోన్న ఆ సాయంకాలం సరదాగా కాలక్షేపం చేద్దామనుకుంది. ఈ వాతావరణంలో ఉల్లిపాయ పకోడీ తింటే బావుంటుంది. అందులోనూ కొడుకు ఈ అమెరికాలో వాటిని ఎప్పుడు తిన్నాడో ఏమో అనుకుని కిచెన్‌లోకెళ్ళింది. ప్రాణేష్, మీరాషామ్ టీవీ ముందు కూర్చున్నారు. పదిహేను నిమిషాల్లో వేడివేడి పకోడీల ప్లేట్లతో వచ్చిందామె.

"అరె మమ్మీ.... వాటె సర్‌ప్రైజ్. ఇందాకటినుంచి కిచెన్‌లోంచి ఘుమఘుమలొస్తుంటే ఏదో అనుకున్నా. ఓహ్ నైస్" అంటూ గబగబా తీసుకుని తిననారంభించాడు మీరాషామ్.

"వాతావరణం బాగాలేదుకదా. అందులోనూ నువ్వింట్లో వున్నావాయె ఈరోజు సాయంకాలం. ఇవి తింటే బాగుంటుందని చేశా. ఇక్కడ నీకు వీటిని తినాలనిపించినా తినలేవుకదా"

"మమ్మీ... ఇవి అప్పుడప్పుడు తింటూనే వుంటాను. ఇప్పుడు అమెరికా అంటే అదేదో వెస్ట్రన్ కంట్రీ కాదు. అమెరికాని కూడా ఇండియా చేశారు వేలకివేలమంది మన వాళ్లు ఇక్కడికి వచ్చి ఇక్కడ అన్ని కాలనీస్ వున్నాయి. ఇండియన్ కాలనీ కూడా. ఇక్కడ కూడా మన దగ్గరున్నట్లు మంచి మంచి రెస్టారెంట్స్ వున్నాయి ఇండియన్స్ నడిపేవి. కాకపోతే ఇక్కడున్నవి బాగా సాఫెస్టికేటెడ్‌గానూ, క్లీన్‌గా నీట్‌గా వుంటాయి. ఇక్కడికి కాస్త దగ్గర్లో ఇంచుమించు ఓ కిలోమీటరు దూరంలో ఒక సౌతిండియన్ హోటలుంది. దాన్లో ఈ పకోడీలూ... ఇడ్లీ, దోసె, పూరీగాక మన నార్తిండియన్ డిషెస్, స్నాక్స్ వుంటాయి. అవి చాలా బావుంటాయి మమ్మీ. ఆల్మోస్ట్ హోమ్ ఫుడ్‌లా వుంటుంది. నెలలో ఆల్మోస్ట్ ఇరవైరోజులు నేనక్కడే భోజనం చేస్తుంటా. పైగా దాని పేరు కూడా 'రుచి-శుచి' రెస్టారెంట్ మమ్మీ. ఆ పేరు ఆ రెస్టారెంట్‌కి చాలా ఆప్ట్"

"అవునురా... నేను విన్నాను క్లబ్‌లో మిసెస్ దావే చెప్పింది వాళ్ల కూతురూ, అల్లుడూ ఇక్కడే వున్నారుకదూ. పోయిన ఎండాకాలంలో వాళ్లిక్కడికి హాలిడేస్‌కని ఆరునెలలుండి వెళ్లారు. అప్పుడు వాళ్ళు ఈ ఫుడ్‌ని బాగా ఎంజాయ్ చేశారట.

వేడిపకోడీలు తింటూ టీవీ చూస్తున్నారు ప్రాణేష్, మీరాషామ్‌లు. సోఫాలో కూర్చుని కిటికీ పక్కనే వున్న దివాన్‌మీద మిసెస్ కుల్‌కర్ణి కూర్చుని మీరాషామ్ కోసం స్వెట్టర్ అల్లుతోంది. ఉన్నట్టుండి టీవీలోంచి అలారంలాటి శబ్దం వినిపించడంతో ఉలిక్కిపడ్డాడు ప్రాణేష్.

"ఈ కింద చెప్పిన దిగువ ప్రాంతాలన్నీ రాబోయే నలభై ఎనిమిది గంటలలోగా వచ్చే వరదల్లో కొట్టుకుపోయే ప్రమాదం వుంది. కాబట్టి ఆయా ప్రాంతాల్లో మీకు సంబంధించిన స్థిరచరాస్తులుంటే వాటిని కాపాడుకోవలసింది. వీలయినంతవరకూ ఆయా ప్రాంతాల్లో నివశిస్తున్న మనుషులు తాత్కాలికంగా సురక్షితప్రాంతాలకి తరలి

పోతే మంచిది. మరి కొన్ని వివరాలకు తరువాతి బులెటిన్ వింటారు" అంటూ సూట్ వేసుకున్న ఒక అందమైన యువతి గంభీరవదనం చాటున సోయగాలను ఒలకపోస్తూ చెప్పింది.

"అరె భయ్యా... ఇక్కడేమిటి ఇంత చిన్న విషయాల గురించి అంత కేర్ తీసుకుంటారా? అయినా ఇంత పెద్ద మహానగరాన్ని వరదలేం చెయ్యగలవు?" కొత్తగా అమెరికాను చూస్తున్న ప్రాణేష్ విస్తుపోతూ అడిగాడు, వచ్చినప్పటినుంచీ అతనికి వింత వింత విషయాలన్నీ కనబడుతున్నాయి. ఎక్కడ చూసినా అతనికి విచిత్రంగానే కనబడుతుంది. బయటికి వెళ్ళి తనంతటతాను వూరంతా తిరిగి రావాలనుకున్నాడు. తీరా చూస్తే ఇప్పుడీ వరదలు. బయలుదేరిన సమయం ఎలాంటిదోగానీ ఈ వరదలిలా వుంటే తనేం చెయ్యగలడు? ఇంత దూరం వచ్చి మొత్తం వేస్ట్ కదా. తన ఫ్రెండ్స్ చాలామంది అమెరికాలో చదువుకుంటూ, ఉద్యోగాలు చేస్తూ అమెరికాలో అణువణువునూ అతిశయానందాలతో అనుభవిస్తున్నారు. వాళ్ళు చెప్పే వింతవింత ప్రదేశాలనీ, నగరాలనీ, రైళ్ళనీ చూడాలనుకున్నాడు. ముఖ్యంగా నగరవీధులు, షాప్స్ ఎంతో అందంగా వుంటాయని విన్నాడు. తీరా చూస్తే వరదలు... కంగారుపడ్డాడు.

"ఇది మహానగరమే. సాక్షాత్తూ ప్రెసిడెంట్ వుండే సిటీ, అంటే తమాషా కాదు. ఆ వరదలు దీనినేం చెయ్యలేవుగానీ చుట్టుపక్కల వున్న చిన్న చిన్న ఫామ్స్... వాటి తాలూకు మనుషులు ఆ ఫామ్స్‌లోనే నివాసముంటూంటారు. అలాటివాటిని గురించీ, అలాటి మనుషులనుద్దేశించీ చేసేవి ఈ ప్రకటనలు. ఈ దేశంలో కూడా మనలాగే చాలా మంది వ్యవసాయంమీద ఆధారపడి వున్నారు. ఇక్కడ కూడా కంట్రీసైడ్స్‌కి వెళితే అక్కడి జనాలు వాళ్ళదయిన ప్రత్యేకమైన లైఫ్‌స్టైల్‌లోనూ, వాళ్ళ పొలంపనుల్లోనూ మునిగివుంటారు. మన ఇండియాలో గ్రామప్రజల భాషలో యాస వున్నట్టే వీళ్ల ఇంగ్లీషులోనూ యాస వుంటుంది.

అదికాదు భయ్యా... ఇప్పుడెలా... ఈ వర్షాలు ఎప్పుడు తగ్గుతాయి? చూస్తూండగా మూడు వారాలు అయిపోతే?

"డోంట్‌వర్రీ మై కిడ్ బ్రదర్... నేనున్నాగా... రెయిన్‌కోట్స్ వుంటాయి. అంబ్రెల్లాసుంటాయి. మనల్ని మోసుకుపోవటానికి కార్లున్నాయి. ఆ కార్లలో అన్ని వసతులూ వున్నాయి. నా మొబైల్‌హౌస్ చూశావుగా. దానిలో టీవీ, స్టౌ, వండుకునే సామాను, తినే సామాను, డ్రెస్సింగ్‌రూమ్, బెడ్‌రూమ్ కమాన్ మైడియర్ బ్రదర్. నేనుండగా నీకెందుకు వర్రీ? వర్షం దారి వర్షానిదే, మనదారి మనదే. ఓకే?" చాలా ప్రేమనిండిన స్వరంతో... చాలా ఆత్మవిశ్వాసంతో చెప్పాడు తమ్ముడికి మీరాషామ్. ఆ మాటలను వింటున్న మిసెస్ కుల్‌కర్ణి చాలా పొంగిపోతుంది కొడుకు సమర్థతకి. నిజానికి అతని కారు వాన్‌లావుండి, చాలా పొడవుగా వుంటుంది. అదొక చిన్నసైజు ఇల్లులా వుంటుంది. 'ఎందుకలా?' అని అడిగితే 'వీకెండ్స్ ఔటింగ్‌కి కన్వీనియెంట్‌గా వుంటుంది' అంటాడు. మిసెస్ కుల్‌కర్ణికి కూడా సబబుగానే అనిపిస్తుంది అతని జవాబు. అతని మొబైల్ హౌసంటే ఆమెకి చాలా ఇష్టం సరదా కూడా.

వర్షాలు తగ్గుముఖం పట్టాయి. రోడ్లమీద గొడుగులూ, రెయిన్ కోట్లతో నడిచే మనుషులకి బదులు మామూలు జనసముదాయం తిరగటం మొదలయింది. రోడ్లమీదున్న చెట్లూ, పార్కుల్లో అందంగా అమర్చబడిన చెట్లూ నవనవలాడుతూ స్నానం చేసినట్లయాయి. స్వచ్ఛమైన వర్షపునీళ్లు వాటిమీద పడి, వాటి ఆకుపచ్చదనాన్ని ద్విగుణీకృతం చేశాయి.

ప్రాణేష్ నెమ్మదిగా బయటికి వెళ్లడం

మొదలెట్టాడు. మొదట్లో వాళ్లుండే ఎవెన్యూ చివరిదాకా వెళ్లేవాడు. తరువాత తరువాత ఒకేవైపు వెళ్ళకుండా నాలుగువైపులా ఏముందో, రోడ్లెలా వున్నాయో గమనించసాగాడు. ముందు తక్కువ దూరం నడకతో మొదలెట్టి, నెమ్మదిగా పెంచాడు నడక సమయం. దాదాపు ఒకగంట సేపు నడుస్తూ ఇంటికి దగ్గరగా ఎక్కడెక్కడ ఏముందో అంతా తెలుసుకున్నాడు. ఒకవైపు వెళితే రైల్వేస్టేషన్ వస్తుంది. ఇంకోవైపు వెళితే వైట్ హౌసుకి వెళ్లేదారి కనబడుతుంది. ఇంకోవైపు వెళితే అక్కడ కనిపించేవన్నీ డిపార్ట్‌మెంటల్ స్టోర్లే. మరో వైపు వెళితే కనిపించేవన్నీ రెస్టారెంట్లే. రెస్టారెంట్స్‌లో అన్నిరకాలూ కనిపిస్తాయి ఇటాలియన్ నుంచీ ఇండియన్ వరకూ. భయ్యా చెప్పిన రుచి-శుచి కూడా ఆ రెస్టారెంట్స్ సముదాయంలోనే వుందిగానీ తను అటువైపు వెళ్లలా. కాశీ వెళ్ళినా శనేశ్వరం ఎందుకన్నట్టు అమెరికా వచ్చినా పాత చింతకాయ పచ్చడెందుకనుకున్నాడు. సరదాగా ఒకషాపువైపుకి దారితీశాడు.

అదొక కాఫీ షాపు. ఆ కాఫీ షాపు చాలా ప్రత్యేకంగా కనిపించింది. అక్కడ డిస్ప్లే చేసిన బోర్డును చూస్తే ఉత్సాహం పుట్టుకొచ్చి లోపలికి దారితీశాడు.

లోపల కనబడుతున్న వాళ్లందరూ అమెరికన్స్‌లానే వున్నారు. దాదాపు ముప్పై నలభైమంది యువతీయువకులతో కిటకిటలాడుతోంది. షాపు ఓనరనుకుంటాను, షాపు ద్వారందగ్గరే కుర్చీలో కూర్చుని వున్నాడు. ఎదురుగా వేసిన టేబిల్, దానిలో క్యాష్... టేబిల్ పైన కంప్యూటర్, చకచకా బిల్ వేసి ఇచ్చి, కస్టమర్లదగ్గర డబ్బు వసూలుచేసి క్యాష్‌ని లోపలేస్తున్నాడు. తెల్లగా, లావుగా మనోరంజన్ సినిమాలో కనిపించే షమ్మీకపూర్‌లా వున్నాడు. అతనికి ఎదురుగా ఒక పొడవాటి టేబిల్. దానిమీద కాఫీకి సంబంధించిన డికాక్షన్ తయారవుతుంది పొగలు కక్కుతూ. మరొకసారి ఆ డిస్ప్లే చేసిన బోర్డును పరికించి చూశాడు. ఆ బోర్డుమీద వున్నది చదివాడు. సిలోన్, కెనడా, కొలంబియా, బ్రెజిల్, ఘనా, పాకిస్థాన్, ఇండియా ఇలా చాటభారతమంత లిస్ట్ వుంది చాలా దేశాల పేర్లతో. అంటే ఆయా దేశాల కాఫీ ఇక్కడ దొరుకుతుందన్నమాట.

ఇంతవరకూ తనకి తెలిసిన కాఫీ అంటే ఒకటే రకం. అది ఇండియాలో తల్లి రోజూ తనకిచ్చే కాఫీ. అది ఏ కాఫీయో తనకి తెలీదు. కానీ రుచి చాలా బావుంటుంది. బహుశా తమిళనాడు కాఫీయేమో అది కూడా బాగా తెలీదు. ఎప్పుడూ తల్లినడగలా. టీలో రకాలుంటాయని తనకి తెలుసు. ఇరానీ, సిలోన్, సిమ్లా, డార్జిలింగ్, నీలగిరి లాటివి. కానీ కాఫీలో రకాలుంటాయన్న విషయం ఇప్పుడే చూస్తున్నాడు. అందులోనూ ఆ టేబిల్ మీద పొగలూ, నురుగులూ కక్కే ఆ డికాక్షన్‌ను చూస్తుంటే అతనికి నోరూరుతుంది. అర్జంట్‌గా అదేదో తాగేసెయ్యాలనిపించింది. అమెరికా వచ్చేప్పుడు తల్లి తనికిచ్చిన రూపీస్‌ని అక్కడే హైదరాబాద్‌లో మార్చి డాలర్లుగా తీసుకున్నాడు ఎందుకయినా మంచిదని. వచ్చిన వంద డాలర్లనీ భద్రంగా తన సూట్ కేస్‌లో దాచుకున్నాడు. అప్పుడే మిసెస్ కుల్‌కర్ణి మరో యాభై డాలర్లిస్తే వాటిని తరువాత తీసుకుంటానని చెప్పి, ఆ వంద డాలర్లూ తల్లిచ్చినవి భద్రంగా వుంచుకున్నాడు. ఇప్పుడా వందలో ఇరవై డాలర్లు తీసి తన జేబులో పెట్టుకున్నాడు ఇంటినుంచి బయలుదేరేప్పుడు.

డికాక్షన్ కాగుతున్న టేబిల్ దగ్గరకి నడిచాడు. "దీన్నేమంటారు? " అనడిగాడు.

"బ్రెజిలియన్ కాఫీ" అన్నాడు షఫ్ డ్రస్‌లో కాఫీని తయారుచేస్తున్న యువకుడు.

"కాస్ట్‌ప్లీజ్" అడిగాడు ప్రాణేష్.

చిన్న కప్పయితే డెబ్బైఅయిదు సెంట్లనీ,

పెద్దమగ్గయితే ఒక డాలర్‌మీద ముప్పై సెంట్లనీ చెప్పాడు.

అప్పుడు గుర్తొచ్చింది ప్రాణేష్‌కి లోగడ తన ఫ్రెండొకడు హైదరాబాద్‌లో చెప్పాడు "ఒరేయ్ మంచి కాఫీ షాపొకటి కొత్తగా పెట్టారు పంజగుట్టలో. దాని పేరే కాఫీ షాప్. అక్కడ దగ్గరదగ్గర వంద రకాల కాఫీలు దొరుకుతాయి. ప్రపంచంలో వున్న వెరైటీసన్నీ దొరుకతాయ్. ఆ కాఫీ తాగటా నికి ఎంతోమంది జనాలు పోటీపడి మరీ వస్తారక్కడికి. ఇంకో విషయం తెలుసా? మంచిమంచి 'కలర్స్' కూడా వుంటాయ్ అక్కడ తెలుసా? వి విల్ జస్ట్ హావ్ ఎ ఫన్.. అక్కడ కాఫీ తాగటం ఒక వింత అనుభవం" అని.

రోజూ తను తాగే కాఫీయే కదా దానిలో వింతేముందనుకున్నాడు. తన ఫ్రెండ్ చిన్న ప్పుడే ముదిరిపోయాడు అన్ని వ్యవహా రాల్లో. అతని భాషలో 'కలర్స్' అంటే ఆడ పిల్లలని అర్థం. అలాటి విషయాల జోలికి పోయేతత్వం కాని ప్రాణేష్ అతని ఫ్రెండ్ ఆహ్వానాన్ని తీసుకోలా. 'అంటే మన ఇండి యన్స్ కూడా బాగా నేర్చుకున్నారన్నమాట దేశదేశాలూ తిరిగి చూసి. అయితే ఆ కాఫీ షాపులో దొరికే కాఫీ ఇదేనన్నమాట' అను కున్నాడు. పాశ్చాత్య వేషభాషలపట్ల, వాళ్ల అలవాట్లపట్ల, వాళ్ల అభిరుచులూ రుచుల పట్ల ఇవాల్టి యువత తగని వ్యామోహాన్ని పెంచుకుని, ప్రాణాలు తీసుకుంటూన్నారన్న విషయం ప్రాణేష్‌కి ఇంకా అవగతమయి నట్లు లేదు. తనలో కూడా అలాటి భావాలు కొద్దోగొప్పో వున్నాయి కాబట్టే అత నిక్కడికి వచ్చాడు అటుపక్కనున్న 'రుచి-శు చి'కి వెళ్లకుండా.

"లార్జ్ మగ్ ప్లీజ్" అంటూ ఇరవై డాల ర్లిచ్చాడు. కాఫీ తయారు చేసేవాడు ఆ డబ్బు తీసుకుని మిగిలిన చిల్లర ప్రాణేష్ చేతిలో పెట్టాడు. వేడివేడి కాఫీనందుకు న్నాడు ప్రాణేష్.

చక్కెర, క్రీమ్ కావలసినంత తీసుకోండని ప్రాణేష్ ముందుకు తోశాడు వాటిని. అవి కూడా తీసుకుని ఒక పక్కగావున్న కుర్చీ చూసుకుని కూర్చున్నాడు వచ్చే పొయ్యేవా ళ్లని చూస్తూ కాఫీ తాగడానికి వీలుగా.

పేరుకు మగ్గు... టీ మగ్గేగానీ అది నిజా నికి టీ తాగే మగ్గులాలేదు. బీరు మగ్గులా పెద్దగా కనబడుతుంది. ఆ కప్పు అనబడే మగ్గులో చక్కెర, క్రీమ్ కలుపుకున్నాడు. క్రీమ్ చాలా చల్లగా వుంది. అయినా ఆ చల్లదనానికి కాఫీ చల్లారిపోలేదు పొగలు కక్కుతుండటంవల్ల.

నెమ్మదిగా సిప్ చెయ్యటం మొదలుపె ట్టాడు ఎదురుగా కనిపించే జనాల్ని చూసు కుంటూ. అక్కడవున్న ఆడ, మగ అందరూ దాదాపు తన వయసువాళ్లే. అందరూ స్థాని కుల్లా కనబడుతున్నారు. రకరకాల భాషల్లో మాట్లాడుకుంటూ, ఒకళ్లమీద ఒకళ్లు జోకులు వేసుకుంటూ, భుజాలమీద చేతులే సుకుంటూ, ఒకళ్లనొకళ్లు మోచేత్తో పొడుచు కుంటూ సరసాలాడుకుంటూ అధమస్థాయి అభిరుచిని ప్రదర్శించసాగారు. వాళ్లందరినీ నిశితంగా పరిశీలిస్తున్నాడు ప్రాణేష్. తనకు పాశ్చాత్యదేశాలంటే బాగా ఇష్టమేకానీ వాళ్ల సంస్కృతి తనకి ఇష్టంలేదనుకున్నాడు. అలా చింపిరి తలలూ, చెదరిన జుట్టూ, ముడతలు పడిపోయిన బట్టలూ, మగా, ఆడా ఇద్దరూ అయినదానికీ, కానిదానికీ వూరికే పూసుకోవడాలూ తనకు నచ్చదు.

కాఫీ సిప్ చేస్తున్నకొద్దీ చాలా రుచిగా అనిపిస్తోంది. అది గొంతులోంచి కడుపు లోకి దిగుతుంటే దాని చలనయానం అత నికి వింత అనుభూతినిస్తోంది. కడుపులో హాయిని కలిగించటమేకాక మెదడును కూడా ఉత్తేజపరుస్తోంది. అప్పటిదాకా వున్న కాస్తంత తలనొప్పి 'పోయేపోచ్చి'లా మటుమాయమయింది. కానీ అంత కాఫీ ఎలా తాగటమా అనుకుంటూ నెమ్మదిగా తాగుదామనుకున్నాడు. అమ్మ ఇచ్చిన

డబ్బుతో కొన్న ఆ కాఫీని వృధాచెయ్యటం అతనికి ససేమీరా ఇష్టంలేదు. అందులోనూ ఒక డాలర్‌పైన ముప్పైసెంట్లంటే దాదాపు అరవైరూపాయల కాఫీ అది. అందుకే ఒక్కోగుక్క మింగుతున్నాడు నెమ్మదిగా.

కాఫీ కప్పు ఖాళీ అయింది. గడియారం చూసుకున్నాడు. తనక్కడికొచ్చి గంటపైన యింది. ఇంటినుంచి బయలుదేరి రెండు గంటల యిందనుకున్నాడు. కడుపు చాలా బరువయిందని అప్పుడే అర్ధమయిందత నికి. 'మరేం ఫరవాలేదు. ఇల్లు చాలా దూరం వుందిగా. అంతదూరం నడిచేలోగా తాగిన కాఫీ సర్దుకుంటుందిలే' అనుకు న్నాడు. నెమ్మదిగా షాపునుంచి బయటికి నడిచాడు.

బయట ఐదారుగురు కుర్రాళ్లు, ఒక అమ్మాయి. అమ్మాయి స్లీవ్‌లెస్ టాప్, జీన్స్‌లో వుంది. వాళ్లందరూ చాలా సర్వసా ధారణంగా, చాలా యదేచ్ఛగా కబుర్లు చెప్పుకుంటున్నారు సిగరెట్లు తాగుతూ. 'బయటికొచ్చి సరదాగా కాలక్షేపం చెయ్య డమే తెలుసు తప్ప వాళ్లకి నీట్‌నెస్ తెలీదు' అనుకున్నాడు మనసులో. వాళ్లందరూ కూడా స్నానాలు చేసి రెండుమూడు రోజు లయిందనిపిస్తుంది వాళ్ల వాలకాన్నిబట్టి.

"హాయ్ యంగ్‌మాన్" అన్నాడొకడు ప్రాణేష్‌ని ఉద్దేశించి.

"హల్లో మైడియర్ ఫ్రెండ్ కమాన్" అన్నాడు మరొకడు.

ఏమిటో విషయమని ఒక్కక్షణం ఆగాడు ప్రాణేష్. వాళ్లలో ఒకడు నాయకుడులాటి వాడు తననితను పరిచయం చేసుకుని, మిగి లిన కుర్రాళ్లని కూడా పరిచయం చేశాడు. అమ్మాయిని పరిచయం చేసేప్పుడు "షి ఈజ్ జాకీ... జాక్వెలిన్ ది గ్రేట్... ఆ జాక్వెలిన్ కెనడీ కోట్ల అమెరికన్లకి రాణి అయితే ఈ జాక్వెలిన్ మాకు రాణి" అంటూ వెకిలిగా పరిచయం చేశాడు నాయకుడు.



"ఐయామ్ ప్రాణేష్... ఇండియన్" అని తనకితను పరిచయం చేసుకున్నాడు. అక్కడ వాళ్లతో మాట్లాడాలనిపించలేదు అతనికి. ఎందుకంటే లోగడ తను విని వున్నాడు అలాటి లోకల్ గ్రూప్స్ ఫారిన ర్స్‌గా కనిపించినవాళ్లని... అందులోనూ కాస్త డబ్బులున్నాయనుకున్నవాళ్లని ఎలాగో పరిచయం పేరుతో మాటల్లోకి దించి వీళ్ల దగ్గరున్న డబ్బుని వాళ్లకోసం ఖర్చుపెట్టించ టమో లేక డబ్బూ ఇతరత్రా విలువైన వస్తు వులని కొట్టెయ్యటమో చేస్తారని' వీళ్లని చూస్తే ఆ బాపతే అనిపించింది. అయినా జాక్వెలిన్ అని పేరు పెట్టుకున్న ప్రతి ఆడదీ జాక్వెలిన్ కెనడీ అయిపోతుందా? చెప్పాలంటే ఆ జాక్వెలిన్ కెనడీ అందం గురించి అతనికంతగా అవగాహనలేదు. ఆమె గొప్ప అందగత్తె అనీ... ఫ్యాషన్ ప్రపంచాన్ని కదిలించేసేదనీ, కోట్లమందికి ఆమె ఆరాధ్యదైవమనీ, ప్రపంచంలో అలాటి అందగత్తెలు ఇప్పటికి ఇద్దరే ఇద్దరనీ వారిలో ఒకరు జాక్వెలిన్ కెనడీ అయితే రెండోవ్యక్తి ప్రిన్సెస్ డయానా. వీరిద్దరినీ ఆరాధించినంతగా మరెవ్వరినీ ప్రపంచం ఆరాధించలేదనీ విని వున్నాడు. అందం గురించీ, స్టైయిల్ గురించీ ప్రిన్సెస్ డయా నాకంటే గొప్పది ప్రపంచంలో పుట్టలేదు, పుట్టదు. కానీ జాక్వెలిన్ అందం గురించి తనకంత అవాహనగానీ ఆరాధనగానీ కలగ లేదు. ఆమె ఫొటోలని చాలాసార్లు చూశాడు. టీవీలో కూడా రెండుమూడు సందర్భాల్లో చూశాడు. అలాగే డయానా. కానీ జాక్వెలిన్ అందం అతన్ని ఎప్పుడూ ఆకట్టుకోలేదు. ఆమె కళ్లలో అతనికెప్పుడూ మెరుపు కనిపించలేదు. ఒకవిధంగా చెప్పా లంటే ఆ కళ్లలో ఎక్కడో ఆవేదనలాటిదున్న దనిపించింది. ఆమె హెయిర్‌స్టైల్ గురించి కూడా చాలా చదివాడు. డయానాతో పోల్చితే అదంత గొప్పదని అతనికనిపించ లేదు. డయానా హెయిర్‌స్టైల్ ఒకప్పుడు ఆడపిల్లలకి ట్రెండయింది. కానీ ఈ జాక్వె

లిన్ కెనడీ బ్లంట్ హెయిర్‌కట్ ఎంత మంది ఆడపిల్లలకి అపురూపమయిందో అతనికి తెలీదు.

మొత్తానికి కఱ్ఱ విరగకూడదు. పాము చావకూడదు అన్నట్టు చాలా చాకచక్యంగా ఆ గుంపును హర్ట్‌చెయ్యకుండా... తను నష్ట పోకుండా నెమ్మదిగా అక్కడినుండి జారుకున్నాడు ప్రాణేష్. 'దుష్టులకు దూరంగా వుండాలి' అనే తల్లి మాటలు ఆ సమయంలో అతనికి బాగానే ఉపయోగపడ్డాయి.

సాయంకాలం నాలుగ్గంటలవుతుంది. పెద్దమమ్మీ కంగారుపడుతుందేమోనని భయపడుతూ వడివడిగా అడుగులేస్తున్నాడు. పరుగులాటి నడకతో ఇంటిని సమీపించాడు. గార్డెన్‌లో కనిపించింది తనకోసమే ఎదురుచూస్తున్నట్టు పెద్దమమ్మీ. జరిగిన విషయాలని ఆమెకి వివరించి, ఆమెతో బాటు లోపలికెళ్లాడు. ఆమె మనసు కుదుటపడింది అప్పుడు.

★ ★ ★

చూస్తూండగానే ఇరవైరోజులయిపోయింది అమెరికా వచ్చి. అసలు మూడు వారాలకోసమే వచ్చినా మీరాషామ్ బలవంతం చెయ్యటంవల్ల ప్రయాణాన్ని వాయిదావేసుకోవలసివచ్చింది మిసెస్ కుల్‌కర్ణికి. 'కొడుకు చెప్పేదీ నిజమేమరి. ఇంత డబ్బు ఖర్చుపెట్టుకుని పట్టుమని పదివారాలయినా వుండకపోతే ఎలా?' అనుకుంది. మీరాషామ్‌కి అసలు ఇంట్లో ఒకపూట కూడా తల్లితో గడపటానికి తీరిక దొరకటంలేదు. అందుకే ఇండియా ప్రయాణాన్ని కొద్దిరోజులు వాయిదా వేసుకోమని కోరాడు తల్లిని. ఆమె కొడుకుమాట కాదనలేకపోయింది.

ప్రాణేష్ తల్లితో వారానికొకసారి మాట్లాడుతున్నాడు ఫోన్‌లో. ప్రయాణం వాయిదా పడిన విషయం ఆమెకి చెప్పాడు. దూరదేశానికి వెళ్ళిన మనుషులు రావడం ఆలస్యమయితే ఎవరుమాత్రం ఏం చేస్తారు? ఉంటుంది మనసులో బాధ. ఆ వెళ్ళిన మనుషుల్ని చూడాలనే ఆరాటం. కానీ దుఃఖాన్ని మింగుతూ బతకటం తప్ప పద్మినికి చేసేది కూడా ఏదీలేదు. భర్తకి చెప్పింది ప్రయాణం వాయిదా పడిన విషయం. దుష్యంతరావు కోపంతో చిందులు తొక్కాడు. "అసలు వాడినెందుకు పంపినట్టు?" అని కసిరి, మిసెస్ కుల్‌కర్ణి మీద కూడా మండిపడ్డాడు. "పరాయివాళ్ల పిల్లల్లో వాళ్ల పిల్లల్ని చూసుకోవటమేమిటి... ఒకవేళ చూసుకున్నా అలా దేశాలు తిప్పుకోవటమేమిటి ఛండాలంగా" అని విసుక్కున్నాడు. "రేపు జరగరానిది దేశంకాని దేశంలో జరిగితే దానికి జవాబుదారి ఎవరో'ని విరుచుకుపడ్డాడు పద్మినిమీద. "అంత దూరం ఆలోచించలేదండీ... అయినా మూడు వారాలకోసమంటే పంపాగానీ ఇన్ని రోజులవుతుందంటే నేనసలు పంపేదాన్ని కాదు" అంది.

"ఇతరదేశాలు వెళ్ళిన మనుషులు మూడు వారాల్లో వస్తారని నువ్వెలా అనుకున్నావ్? కామన్‌సెన్స్ వుండక్కర్లా?" కసిరాడు. కళ్లలో నీళ్లు కుక్కుకుని లోపలికి వెళ్ళింది పద్మిని.

ప్రాణేష్‌కి బాధగా వుంది తల్లితో మూడు వారాలేనని చెప్పి వచ్చినందుకు. తనకి నిజంగా తెలీదు. ఒకవేళ తెలిస్తే వచ్చేవాడో లేదో. తల్లితో ఫోన్‌లో మాట్లాడితే ఆమె ఏమీ చెప్పలేకపోయింది అంతదూరంలో వున్న కొడుకు మనసు కష్టపెట్టడం బాధనిపించి. ప్రాణేష్‌కి మాత్రం తొందరగా ఇంటి కెళ్ళి తల్లిదగ్గరుండాలని వుంది. అసలే తల్లికి ఒంట్లో కులాసాగా వుండటంలేదనీ, తను కూడా లేకపోతే ఆమె బొత్తిగా ఒంటరిదయిపోతుందనీ అతనికి బాగా తెలుసు.

ఇరవైరోజుల్లో ఒక్కసారిమాత్రం మీరాషామ్ తల్లినీ, ప్రాణేష్‌నీ హాలీడేకని తీసికెళ్లాడు. అదీ మూడురోజులకోసం మాత్రమే. అందరూ కలిసి లాస్‌వేగాస్ వెళ్ళి అక్కడ హాయిగా గడిపారు. ఆ మూడురోజులూ

# ఏరినముత్యాలు

- నిర్బంధంలో శాంతిని స్థాపించలేము. ఒప్పించి దాన్ని సాధించాలి.

  – ఆల్బర్ట్ఐన్‌స్టీన్

- మర్యాదను నాటిన కృషీవలుడు స్నేహఫలసాయాన్ని పొందుతాడు.

  – చింగ్‌బే

- పొరపాటు కంటే కాలయాపన వాసి.

  – థామస్ జెఫర్‌సన్

- యుద్ధాలు, విభేదాలు మానవ మనసులలోనే ప్రారంభమవుతాయి. అందుకే శాంతిని అక్కడే ఏర్పరచుకోవాలి.

  – నెహ్రూ

- మందగించక ముందు అడుగేయి. వెనుకబడితే వెనుకేనోయి.

  – గురజాడ

- నీకు ఒకరిపై జాలి ఉంటే భగవంతునికి నీపై జాలి ఉంటుంది.

  – తాల్‌ముడ్

- అతికష్టమైన పని నిన్ను నీవు తెలుసుకోవడం. అతి తేలికైన పని ఇతరులకు సలహా ఇవ్వడం.

  – థెరిటస్

- కార్యనిర్వహణలోనే కవితా గానం ఉన్నది.

  – షేక్‌స్పియర్

- ఆకాశంలోకి ఎగురలేని పక్షులకు భగవంతుడు క్రింద చెట్ల కొమ్మలు కల్పించాడు.

  – టర్కిష్‌సామెత

- నలభైకే నిరాశతో నిస్పృహతో క్రుంగిపోయే వారికంటే డెబ్బయి దాటినా భవిష్యత్తులోకి ఉత్సాహంగా, ఆశాపూరితంగా చూసేవారు మెరుగు.

  – హోమ్స్

- మనం కొండంత సలహా ఇస్తాం. కానీ తీసుకునేది ఆవగింజంతే.

  – ఆల్జర్

- తీర్పు వికాసానికి, వివేకానికి సహవాసి.

  – అగస్టీన్

- ఎంత ప్రచారం చేసినా అధర్మం ధర్మం కాజాలదు.

  – గాంధీ

సేకరణ: లక్ష్మీసువర్చల

మీరాషామ్‌కి హాస్పిటల్ బాధ్యత లేదు. ఫోన్‌కాల్స్ పీడలేదు. ఫోన్ కాల్స్‌ని తప్పించుకుని హాయిగా తల్లితో ప్రశాంతంగా గడపటానికని మొబైల్‌ఫోన్ కూడా వెంటపెట్టుకోలేదు. ఆ మూడు రోజులూ ఎంత హాయిగా గడిచాయో చెప్పాలంటే ముగ్గురికీ కూడా ఆ మూడు రోజులూ జీవితంలో స్వర్ణాక్షరాలతో గుర్తుంచుకోవలసిన రోజులు. ఆ మూడు రోజుల్లో ప్రాణేష్ మీరాషామ్‌కి చాలా దగ్గరయ్యాడు. మీరాషామ్ కూడా తన సొంత తమ్ముడితో కలిసున్నట్టు కలిసిపోయాడు. అతని మంచితనానికీ మంచిమనసుకీ ప్రాణేష్ చలించిపోయాడు. నిజంగా అతను తనకి అన్నయ్యనే అనిపించింది. అతనిమీద గౌరవం కూడా పెరిగింది ప్రాణేష్‌కి. ప్రాణేష్‌కి ఏవేవో చాలా బహుమతులు కొనిపెట్టాడు మీరాషామ్ ఇండియాలో వాడుకోవటానికి. 'ఇన్నెందుకని అడిగితే "నా గుర్తుగా వాడుకో ఏం... తమ్ముడికి ఒక అన్నగా ఇవ్వకూడదా? " అని ఎదురు ప్రశ్న వేసేవాడు.

నెలరోజులయింది వచ్చి. ఒకసారి ఒక బీమాకంపెనీ పనిమీద తనకి టైమ్‌లేకపోవడంవల్ల మీరాషామ్ ప్రాణేష్‌ని డెట్రాయిట్ పంపాడు తనదగ్గర పనిచేస్తున్న ఒక డాక్టర్ని తోడుగా ఇచ్చి. ఆ ట్రిప్పు కూడా ప్రాణేష్‌కి బాగా నచ్చింది. భయ్యా ఇచ్చిన సూచనల ద్వారా జాగ్రత్తగా అతను చెప్పింది చెప్పినట్టు ఎక్కడెక్కడికి వెళ్ళాలో... ఎవరెవర్ని కలవాలో ఏమేమి మాట్లాడాలో అన్నీ కరెక్ట్‌గా చేశాడు ప్రాణేష్. అతను వెళ్ళిన ప్రతి చోటా అందరూ అతన్ని మీరాషామ్ తమ్ముడనే భావించారు పోలికల్నిబట్టి. వెళ్ళిన పని వారంరోజులకి తక్కువవదు. కానీ ప్రాణేష్ తెలివితేటల్తో ఆ పనిని ఐదురోజుల్లోనే పూర్తి చేసి ఇంటికెళ్లాడు. మీరాషామ్ ప్రాణేష్‌ని ఎంతగానో పొగిడాడు. ఇన్స్యూరెన్స్ పని అయిపోయింది. పదిలక్షల డాలర్ల చెక్ తెచ్చి భయ్యా చేతిలో పెట్టాడు ప్రాణేష్. మీరాషామ్ ఆనందానికి అవధులులేవు. ఆ చెక్‌ని తల్లికిచ్చాడు మీరా.

"చూడు మీరా... నేనేం చేసుకుంటానురా ఇంతడబ్బు. నేను చూడని డబ్బా ఏమన్నానా? మీడాడీ పుణ్యమా అంటూ ఎంతో డబ్బు చూశాను. ఇప్పటికీ ఆయన సంపాదించిన ఆస్తి తరగనంతగా వుంది. అదంతా కూడా నీదేకదరా. నీ దగ్గరే వుండనియ్యి రేపు పెళ్ళయితే పనికొస్తుంది" అంటూ కొడుక్కిచ్చేసింది.

"అదికాదు మమ్మీ... హైదరాబాద్‌లో వున్న మన ఇల్లు ఎప్పుడో డాడీ కొన్నది కదా. దాదాపు పాతిక సంవత్సరాలయింది దానిని కొని. నాకు ఊహ తెలిసిన తరువాత పెద్దగా రిపేర్లేమీ చేయించినట్లు లేదు. ఎప్పటిదో పాతబంగ్లా అది. దాన్ని కాస్త మోడర్న్‌గా చేయించి ఈ కాలానికి అనుగుణంగా చేయించు మమ్మీ. నా మేరేజ్‌కోసం నేను ఇండియా ఎట్లాగయినా రావాల్సిందే. వచ్చి రెండు మూడు నెలలుంటా. తరువాత కూడా ప్రతి సంవత్సరం మనమంతా ఇక్కడినుంచి అక్కడికి వెళ్ళి ఒకలాంగ్ హాలీడే స్పెండ్ చేద్దాం"

చాలా ఉత్సాహంగా అంటున్నాడనిపించింది ఆమెకి అతని కళ్లలో కనిపించిన మెరుపు చూసి. కొడుకు తన పెళ్ళి గురించి బాగానే ఆలోచిస్తున్నాడు అనుకుంది, మురిసిపోయింది త్వరలో తన కోరిక తీరబోతున్నందుకు.

వాళ్ల సంభాషణను వింటూ వాళ్లనే చూస్తున్నాడు ప్రాణేష్.

"ఊ... చూస్తున్నావులే. మీ మమ్మీకి చెప్పి నీ పెళ్ళి కూడా చేయిస్తాను భయ్యా పెళ్ళయిన వెంటనే. అయినా ఎంతకాలమిలా నేనూ, మీ మమ్మీ ఒంటరిగా దిక్కులేని బతుకులు బతకాలి బంగారంలాటి కొడుకుల్ని కళ్లముందుంచుకుని? పెళ్ళిళ్లు చేసుకుని, పెళ్ళాలను ఇంట్లో పడెయ్యండి మాకు తోడుగా. తరవాత మీరెక్కడయినా

వూరేగండి. సాయంకాలానికి ఇంటికొచ్చి చేరితే చాలు" కళ్లు గిరగిరా తిప్పుతూ చెప్పిందామె.

కళ్లార్పకుండా వింటూ చూస్తూన్నాడామెనే ప్రాణేష్. 'నిజంగా పెద్ద మమ్మీ ఎంత యాక్టివ్‌గా వుంటుంది. ప్చ్... మమ్మీ కూడా ఇలాగే వుండాలని కోరుకుంటా కానీ' అనుకుంటూ నిట్టూర్చాడు. ఇంటి పరిస్థితులూ, తల్లిపడే బాధలూ గుర్తొచ్చి మళ్లీ ఇంకొకసారి అనుకున్నాడు 'తొందరగా ఇండియా వెళ్ళాలి. మమ్మీని చూడాలి' అని.

రోజులు గడుస్తున్నాయి వేగంగా. రెండు నెలలయింది వచ్చి. వచ్చిన కొత్తల్లో బోర్ కొట్టినట్టు ఇప్పుడు లేదు. నిద్రలేవటం, గబగబా స్నానం, బ్రేక్‌ఫాస్ట్ ముగించుకోవటం... వెళితే ఎప్పుడయినా భయ్యాతో హాస్పిటల్‌కి వెళ్ళి అక్కడ కాసేపు అతనితో గడపటం. తిరిగి అతనితో కలిసి ఇంటికి రావటం. మీరాషామ్‌తో వెళ్ళటం బాగానే వుంటుంది తనకి ఎందుకంటే అతని ఆ మొబైల్‌హౌస్ బాగా నచ్చింది. దానిలోనే ఎప్పుడూప్రయాణిస్తాడు మీరాషామ్. తీరా హాస్పిటల్‌కి వెళ్లిన తరువాత ఆ వాతావరణం తనకు నచ్చదు. ఆ హాస్పిటల్ ఎంత అమెరికాది అయినా ఎంత అధునాతనంగా వున్నా రోగాలు ఎవరివయినా ఒకటే. బాధ అనేది ప్రపంచంలో ఏ ప్రాణికయినా ఒకటే. ఆ మందుల వాసనలూ, రోగుల బాధలూ ఇవన్నీ చికాకు కలిగించుతాయి ప్రాణేష్‌కి. అదీగాక మీరాషామ్ ఎప్పుడూ ఖాళీగా వుండడు. రోగులూ, వాళ్ళ తాలూకు బంధువులు, తోటి డాక్టర్లతో డిస్కషన్స్, ఆపరేషన్లూ వగైరా వగైరాలూ ఇదంతా అతనికి బోర్‌గా అనిపిస్తుంది.

ఒక్కోసారి తను ఒంటరిగా బయటికి వెళ్ళిరావడం బాగానే వుంటుంది. అలా వెళ్ళిరావడంవల్ల అక్కడి పరిసరాలనీ, విషయాలనీ సొంతంగా తెలుసుకోవడానికి అవకాశం దొరుకుతుంది. ఈ రెండు నెలల్లో మూడు నాలుగుసార్లు వెళ్ళాడు ఎవెన్యూ చివరవున్న కాఫీ షాప్‌కి. అక్కడ దొరికే బ్రెజిలియన్ కాఫీ, ఆ బీరు మగ్గునిండా పోయించుకుని, ఎప్పుడూ తను కూర్చునే సీట్లో కూర్చుని తాగాడు. తను వెళ్లే సమయం అంటే పగటిపూట పదకొండూ పన్నెండు గంటలవేళ అంత రద్దీగా వుండదు ఇరవై ముప్పైమందితో తప్ప. అదేచోటికి సాయంకాలాలు వెళితే అక్కడి జనాన్ని చూసి కళ్లు తిరిగిపోవాల్సిందే. కొన్ని వందల మంది జనాలు ఆ షాపులో ఎక్కడపడితే అక్కడ కిటకిటలాడుతూ మెసలటానికి కూడా సందు దొరకదు. బయట కూడా జనాలు గుంపులు గుంపులుగా పడిగాపులు కాస్తుంటారు. వాళ్ల టర్న్ కోసం. సాయంకాలాలు ఆ కాఫీషాపులో కనిపించే జనాల్ని చూస్తుంటే అది కాఫీషాపని నమ్మబుద్ధవదు. ఏదో సినిమా హాలో లేకపోతే షేర్‌బజారో అనిపిస్తుంది.

ఒకసారి రుచి-శుచికి వెళ్ళాడు మీరాషామ్, పెద్ద మమ్మీతో ప్రాణేష్. అమెరికాలో వుండి, వాళ్ళ హోటల్స్ చూసి అక్కడ మన రెస్టారెంట్స్ పెట్టిన మనవాళ్లు బాగానే నేర్చుకున్నారు నీట్‌నెస్‌ని అనిపిస్తుంది రుచి-శుచిని చూసినవాళ్ళకి. అదే రెస్టారెంట్ మన దగ్గరుంటే అదెలా వుండేదో వూహించుకున్నాడు. మొత్తానికి ఈ రెస్టారెంట్ మిగతా అమెరికన్ రెస్టారెంట్లతో పోటీ పడుతోంది. అంతేకాదు రుచి కూడా చెప్పుకోతగిన విధంగానే వుంది. ఆ హోటల్‌కి పెట్టిన ఆ పేరు బాగా సూటయిందనిపించింది. అక్కడ ముగ్గురూ పూరీ, దానితోబాటు మలాయికోఫ్తా, నవరతన్ కర్రీ, పాలక్‌పన్నీర్... ఇంకా కట్‌మిర్చీ కూడా తిన్నారు. చివరికి లార్జ్‌కప్ ఐస్‌క్రీమ్ తిని పొట్టబరువుతో బయటపడ్డారు ముగ్గురూ. అక్కడ ఆ స్థలం మహాత్మ్యమో ఏమోమరి. అక్కడున్న ప్రతి ఒక్క రెస్టారెంటూ జనాలతో కిటకిటలాడుతోంది.

మన ఇండియన్ రెస్టారెంట్‌లో ఇండియన్స్ ఎంతమంది ఉన్నారో ఫారినర్స్ కూడా అంతేమంది వున్నారు.

'మనవాళ్ళు చాలా గొప్పవాళ్ళు. బతుకుతెరువు కోసం అక్కడికి వెళ్ళిందిగాక అక్కడి వాళ్ళకి మన రుచులు అంటగట్టగల ధీమంతులు' అనుకుని నవ్వుకున్నాడు ప్రాణేష్. అక్కడ తింటూన్న కొంతమంది స్వదేశీయుల మొహాలయితే యర్రగా కమలాపళ్లలా తయారయ్యాయి తినుబండారాలలోని మసాలమూలంగా. ఒకపక్క కళ్లవెంట, ముక్కులవెంట నీళ్లొస్తూన్నా, ఆ తిండిని ఆపకుండామరీ తింటూన్నారు లొట్టలేసుకుంటూ. తింటూన్న ఆ మనుషుల్ని చూస్తే నవ్వొచ్చింది ప్రాణేష్‌కి.

అదే రెస్టారెంట్‌లో ఒకపక్కగా పాన్‌షాప్‌కూడా వుంది. ' అంటే... అమెరికా వెళ్లిన ప్రబుద్ధులు ఈ పాన్‌ని కూడా వదల లేదన్నమాట... దీన్ని కూడా ఆ తెల్లగుర్రాలకి రుద్దుతున్నారన్నమాట...' అనుకున్నాడు.

ముగ్గురూ ఇంటికి బయలుదేరారు మొబైల్ హౌస్‌లో.

ఇలాగే తను సొంతంగానూ, ఇంట్లోవాళ్ళతోనూ బాగానే బయటికి వెళుతున్నాడు. రెండునెలలే అయినా అతనికి అక్కడి విషయాలు బాగానే అర్థమయ్యాయి. అతనికి తెలిసిన ఎంతోమంది ఇండియన్స్ అమెరికాలోవుండి ఉద్యోగాలు చేసుకుంటూన్నారనీ వినేవాడు ఇండియాలో వున్నప్పుడు. అలా విన్నప్పుడు ఆ చెప్పేవాల్లవంక వాపిరికొట్టు మొహం వేసుకుని వినేవాడు తనకంత అదృష్టం కలగనందుకు, జీవితంలో ఆ ఆశ తీరదని వూహించుకున్నందుకు. ఇప్పుడు తను అమెరికా వచ్చిన తరువాత అర్థమౌతూన్నది ఇండియానుంచీ అమెరికా వచ్చిన ఇండియన్స్ చాలామంది ఎన్నికష్టాలు పడుతున్నారన్న విషయం. పెద్దపెద్ద ఉద్యోగాలూ, కేరీర్లూ వున్నవాళ్ల విషయం పక్కనపెడితే మిగతావాళ్ల కష్టాలు వర్ణనాతీతం. అమెరికన్స్ మనవాళ్లకిచ్చే ట్రీట్‌మెంట్ ఏమిటో చూస్తూంటే అసలక్కడ వుండబుద్ధవదు. మనవాళ్లు ఎంతగొప్ప పొజిషన్లో వున్నప్పటికీ వాళ్లు మనవాళ్లని చూసే విధానం దారుణంగా వుంటుంది. ఎంతసేపటికీ అక్కడ వున్న మనవాళ్లు మనవాళ్లతోనే పరిచయాలు పెంచుకుని, ఒకళ్లనొకళ్లు పూసుకోవలసిందే తప్ప వాళ్లు మనవాళ్లని పట్టించుకోరు.

మనవాళ్లు అక్కడ చేసే ఉద్యోగాలు పెట్రోల్‌బంకుల్లో హెల్పర్లగానో... డిపార్ట్‌మెంట్ స్టోర్‌లో సేల్స్‌మెన్‌గానో... ఆఫీసుల్లో క్లీనర్లగానో... పార్ట్‌టైమ్ హౌస్ హెల్పర్లగానో ఇలాటివే అన్నీ. ఎటొచ్చీ అక్కడ కష్టపడి పనిచేసేవాళ్ల పనికి విలువ వుంటుంది కాబట్టి, వాళ్లిచ్చే జీతాలుకూడా బాగావుంటాయి. ఒకమనిషి ఒకచోట చెయ్యడు. పార్ట్‌టైమ్‌లుగానే చేస్తాడు ఒక్కోగంటనో రెండుగంటలనో, ఉదయం లేవడం... పళ్లు సరిగ్గా కడుక్కోనో కడుక్కోకో... స్నానం పేరుతో రెండుచెంబులు ఒంటిమీదా... రెండుచెంబులు గోడమీదా చల్లుకుని గబగబా పరుగులు తియ్యాల్సి వస్తుంది టైమ్‌కి పని అందుకోవటానికి. టైమ్ విషయంలో అక్కడ రాజీపడే పనేలేదు. తిన్నా తినకపోయినా ఏమయినా సరే... ఆటైమ్‌కి సరిగ్గా పనివున్నచోట వుండాల్సిందే కష్టమో నిష్టూరమో. వారంలో గానుగెద్దులా ఐదురోజులు పని చేసి, ఆ ఐదురోజుల పనిలో అలసిపోయిన శరీరానికి రెండురోజులు విరామం ఇవ్వటానికి ఎటో అటు పరుగులు తియ్యటం 'వీకెండ్స్' పేరుతో, విశ్రాంతి తీసుకోవటానిక్కూడా పరుగులు పెట్టాల్సిందే. దేనికీ తీరికవుండదు. అంతా పరుగుపందాలు... నరాలు తెగిపోయే టెన్షన్ ప్రతిదానికీ, నాలుగు డబ్బులు సంపాదించుకుని సరిగా తినీతినకా కడుపు కట్టుకుని, వెనకేసుకున్న నాలుగు రాళ్లని ఎగ్జిబిషన్ పెడతారు మన

దగ్గరకొచ్చి... అక్కడేదో వాళ్లు విజయవంతమైన ఉద్యోగాలతో, విజయవంతమైన ధనార్జన చేస్తున్నట్టు. అక్కడికి వెళ్లాలనుకోవడం, దానికోసం కష్టపడి ప్రయత్నించి వెళ్లటమన్నది గొప్ప. ఇవాల్టిరోజున ప్రతి పది ఇళ్లలో ఏడు ఇళ్లలోని మనుషులు అమెరికా వెళుతున్నారంటే... మగపిల్లలు చదువు పేరుతోనో, ఆడపిల్లలు పెళ్లిపేరుతోనో అంటే మరి అక్కడ ఉద్యోగావకాశాలు, ధనార్జనకీ అంత అవకాశముందన్నమాట.

ప్రాణేష్‌కి అనిపించింది ఈ తతంగమంతా చూస్తే- జీవితాన్ని బాగా అనుభవించాలంటే ఎక్కడున్నా డబ్బేముఖ్యం. అమెరికాలో నాలుగు సంవత్సరాలు కష్టపడి పనిచేసి, ఆ డబ్బును ఇండియాకి తెచ్చుకుని అనుభవించటమో... లేక ఇండియాలోనే బాగా డబ్బు సంపాదించుకో గలిగితే సంవత్సరానికొకసారి అమెరికా వెళ్లి, అక్కడ మూడు నాలుగు నెలలుండి అన్నీచూసి జీవితాన్ని అనుభవించాలే తప్ప అక్కడే గానుగెద్దులా విసుగూ విరామం లేకుండా పనిచేస్తూ అలసిపోవటం, పరుగులు తియ్యటంలో సుఖమేదీ లేదనిపించింది.

ఇంకో పదిరోజులు ఎలా గడిచిపోయాయో తెలీదు. టైమ్ చకచకా కదిలిపోతూన్నది. ఎవరి గొడవల్లో వాళ్లు... ఎవరి ఆలోచనల్లో వాళ్లు సతమతమై పోతూన్నారు. సాయంకాలం మాత్రం తప్పనిసరిగా ముగ్గురూ కలిసి భోజనం చేస్తారు. భోజనానికి ముందు కొత్తగా అలవాటు చేసుకున్న బీరు చాలా ఉత్సాహాన్ని కలిగిస్తోంది ప్రాణేష్‌కి. ఆమధ్య ఇన్‌ష్యూరెన్స్ పనిమీద ప్రాణేష్ డెట్రాయిట్ వెళ్లి, ఆపనిని సక్సెస్ చేసుకువచ్చిన సందర్భంలో ఆనందంతో ఉప్పొంగిపోయిన మీరాషామ్ తమ్ముడికి మందుపార్టీ ఇచ్చాడు ఇంట్లోనే. ఆరోజు షాంపేన్‌తో మొదలయింది ప్రాణేష్ మందు ఆవిష్కరణ. అప్పటినుంచీ రాత్రిపూట భోజనానికి ముందు భయ్యాతో రోజూ ఏదోఒకటి పుచ్చుకుంటూనే వున్నాడు. తరచుగా వాళ్లిద్దరూ తీసుకునే డ్రింక్ బీరు. బీర్‌కాన్స్ ఎప్పుడూ ఫ్రిజ్‌లో ఉండాలి మీరాషామ్‌కి అంటూ ఉంటాడు కూడా ఎప్పుడూ. 'కారుటాంక్ నిండా గాసొలీన్, ఫ్రిజ్ తలుపునిండా బీరుబాటిల్స్ వుండకపోతే మజారాదు జీవితంలో'నని. అప్పటినుంచీ బీరు రుచిని బాగానే పట్టాడు ప్రాణేష్. జీవితంలో డబ్బుతో కొనుక్కోగలిగే ఆనందాల్ని నెమ్మదిగా రుచిచూడటం మొదలెట్టాడు.

సాయంకాలం సమయమది. అప్పుడే హాల్లోకొచ్చి కూర్చున్నది మిసెస్ కులకర్ణి గార్డెన్‌లో మొక్కలకి నీళ్లపెట్టి. బయటికెళ్లి వచ్చిన ప్రాణేష్ నిద్రపోతున్నాడు. ఆమె ఒంటరిగా కూర్చున్నది ఉదయం వచ్చిన న్యూస్‌పేపర్‌ని ముందేసుకుని కొడుకు హాస్పిటల్‌నుంచి రావడానికి టైమ్‌పడుతుంది. పేపర్‌ని అలా తిరగెయ్యటం మొదలు పెట్టింది.

ఫోన్ మోగింది. అవతలినుంచి ఒక ఆడ కంఠం... 'మేడం... దిసీజ్ యానా హియర్... సర్ పి.ఏని మాట్లాడుతూన్నాను హాస్పిటల్‌నుంచీ... ఈ శాడ్ ఇన్‌ఫర్‌మేషన్ని ఎలా చెప్పాలో తెలియటంలా... సర్... డాక్టర్ మీరాషామ్ మెట్ యాన్ యాక్సిడెంట్... ఇటీజె ఫాటల్ వన్... త్వరగా బయలుదేరండి మన హాస్పిటల్‌కి..." వినిపించింది.

శరీరంలోవున్న నరాలన్నీ ఒక్కసారి బిగుసుకు పోయినట్లని పించింది మిసెస్ కుల్‌కర్ణికి. కాళ్లూ చేతులూ ఆడటంలేదు. ఒళ్లు చల్లబడిపోయింది. ఏంచెయ్యాలో తెలీదు. అవతల మాట్లాడిన మనిషి ఫోన్ కట్‌చేసింది. కళ్లు బైర్లు కమ్ముకున్నాయి. సడన్‌గా ఒళ్లంతా బరువెక్కి నట్లనిపించింది. నెమ్మదిగా సోఫాపట్టుకుని లేవడానికి ప్రయత్నించింది. కళ్లు, ముక్కులోంచి వేడిగాలులు వస్తున్నాయి. నెమ్మదిగా అడుగులో అడు

గువేస్తూ నిద్రలోవున్న ప్రాణేష్ దగ్గరకెళ్లింది.

"బేటా... ప్రాణేష్... లే..." అంటూ అతన్ని కుదిపింది.

"ఏంటి పెద్దమమ్మీ?" అంటూ అతను తత్తరపాటుతో లేచాడు.

విషయం చెప్పిందామె. ఇప్పుడున్న పరిస్థితిని చాలా నాజూకుగా, చాలా జాగ్రత్తగా నడపాలన్న విషయాన్ని గమనించి "డోంట్ వర్రీ పెద్దమమ్మీ... భయ్యాకేమీ అవదు... గబగబా అన్నీ లాక్‌చేసి వెళ్లిపోదాం బయట కారు రెడీగానే వున్నదికదా..." అంటూ పరుగులు తీశాడు వీధిలోకి.

హాస్పిటల్‌కి వెళ్లటానికి గంటపట్టింది. హాస్పిటల్లో సిబ్బందంతా మౌనంగా.... గాభరాకళ్లతో తిరుగుతూన్నారు. ఎవరిని చూసినా ఆందోళనతో వున్నాయి వాళ్ల మొహాలు.



నిజంగా ఏంజరిగిందో అర్థంకావటం లేదు. గబగబా అందరినీ తప్పించుకుని ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌కి వెళ్లారు. హాస్పిటల్‌లో వున్న దాదాపు అందరు డాక్టర్లూ అక్కడే వున్నారు బెడ్‌ని గుమిగూడి. వాళ్లందరి వదనాలూ కొయ్యబారిపోయి వున్నాయి. బెడ్ దగ్గరకెళ్లి చూశారు ఇద్దరూ. తెల్లటి దుప్పటి కప్పబడివున్న ఆకారం మీదినుంచీ దుప్పటిని తొలగించాడు ప్రాణేష్. పూర్తిగా రక్తసిక్తమైన ఆ మొహాన్ని చూసి, తన భయ్యా నిజంగానే ఆ స్థితిలో వున్నాడని నమ్మలేకపోయాడు. అప్పటికే చాల్లా సేపయినట్లనిపించింది. అతని ప్రాణాలు పోయి ఆ స్థితిలోవున్న కొడుకుని చూసి మిసెస్ కులకర్ణి మూర్ఛపోయింది. ఆమెని కొంతమంది డాక్టర్లు పర్యవేక్షిస్తున్నారు. ప్రాణేష్‌కి దుఃఖం ఆగటం లేదు భయ్యాని అలా చూస్తాడని కలలోకూడా అనుకోలేదు. 'చాలా టూ మచ్' అనిపించింది. అంత మంచిమనిషిని ఇంత హృదయ విదారకమైన స్థితిలో చూస్తాడని తనెప్పుడూ వూహించలేదు.

హాస్పిటల్లో తొందరగానే పనిముగించుకున్న మీరాషామ్ ఆరోజు మధ్యాహ్నం ఇంట్లో తల్లీ, తమ్ముడి దగ్గర గడపటానికి బయలుదేరాడు తన మొబైల్ హౌస్‌లో. అది ప్రధాన రహదారి. వాహనాల రాకపోకలంతగా వుండక పోవడంతో బాగా స్పీడ్‌గా వెళుతున్నాడు మీరాషామ్. ఉన్నట్టుండి ఒక భారీవాహనం ఎదురువైపునుంచీ అత్యంత వేగంతో వచ్చి అతని వాహనానికి గుద్దుకోవడంతో రెండు వాహనాలూ అక్కడికక్కడే తునాతునకలైపోయి, రెండు వాహనాల్లోని మనుషులూ అక్కడికక్కడే ప్రాణాలను కోల్పోయారు. మీరాషామ్ దగ్గరున్న సెల్‌ఫోన్, డైరీలలో దొరికిన సమాచారం ద్వారా రంగంలోకి దిగిన పోలీసుల పని తేలికైంది. అతనొక గౌరవనీయమైన ఇండియన్ డాక్టరనీ, అతని హాస్పిటల్ పేరున్న కొద్ది హాస్పిటల్స్‌లో ఒకటనీ తెలుసుకుని, పోలీసులు అతని శరీరాన్ని హాస్పిటల్‌కు చేర్చి వాళ్ల పనిమీద వెళ్లిపోయారు. జరిగిన విషయం అదీ.

నెమ్మదిగా స్పృహవచ్చింది మిసెస్ కుల

కర్ణికి. ఆమె దుఃఖానికి అవధుల్లేవు. అసలు జీవితం ఎటు వెళుతూన్నదో ఏంజరుగుతూన్నదో ఏమీ అర్ధంకావటంలేదు. దాదాపు పిచ్చిదానిలా అయిపోయింది. నిజంగా ఆ పరిస్థితిలో ఆమెతో ప్రాణేష్ లేకపోయినట్ల యితే ఆమె పరిస్థితి చాలా దారుణంగా వుండేది. అదే అవకాశంగా తీసుకుని అక్కడి వాళ్లందరూ ఆమెను సునాయాసంగా ముంచేవాళ్లు. సంఘటనను చాలా బాగా నడిపించాడు ప్రాణేష్. హాస్పిటల్ లో వున్న కొన్ని ముఖ్యమైన గదులు సీల్ చేశాడు. ముఖ్యమైన డాక్యుమెంట్స్, కాగితాలు వున్న గదులు, అల్మైరాలు, లాకర్లు అన్నింటినీ భద్రంగా తన ఆధీనంలోకి తీసేసుకున్నాడు. అప్పుడప్పుడూ తను భయ్యాతో వచ్చేవాడు కాబట్టి అతనికి హాస్పిటల్ విషయాలు బాగా అవగతమయ్యాయి. పైగా అతనికి అడ్డుచెప్పేవాళ్లుకూడా అక్కడ ఎవ్వరూ లేరు అంతకుముందు బాస్ డాక్టర్‌తో కలిసి తిరిగేవాడుగా... స్వయానా తమ్ముడిగా చలామణి అయ్యాడు కాబట్టి.

మీరాషామ్ పోయి వారం దాటింది. పరిస్థితులన్నీ తారుమారయ్యాయి. ఒకపక్క హాస్పిటల్లో విషయాలు... ఒకపక్క పోలీస్ కూపీలు... వాళ్లకి సహకరించటం... మరో పక్క లీగల్ విషయాలు... ఇంకోవైపు మొబైల్ హౌస్ ఇన్‌ష్యూరెన్స్ పనులు- అన్నిటికంటే మిసెస్ కులకర్ణి పరిస్థితి. ఇవన్నింటితో ప్రాణేష్ సతమతమైపోతూన్నాడు నిమిషం తీరికలేక. ఇరవై నాలుగ్గంటలు అతనికి చాలటంలేదు. ఆమెకి టైమ్‌కి మందులు తప్పనిసరిగా వాడితేగానీ ఆమె కోలుకోలేని పరిస్థితిలో వుండటంవల్ల అతనికి ప్రతిక్షణం టెన్షన్‌గా తయారయింది.

వచ్చిన మూడువారాలకి ప్రయాణమవుతామంటే ఒప్పుకోలేదు మీరాషామ్ ఆరోజు. 'ఎందుకింత తొందరగా వెళ్లటమ'ని వెళ్లనివ్వలా. అతను ఆ రోజలా చెయ్యటం మంచిదయింది. దీనికితోడు ఇంకో గొప్ప విషయం... ఏమిటంటే మిసెస్ కులకర్ణితో అతను రావడమనేది అనూహ్యమైన విషయం...దైవేచ్ఛగా జరిగింది. లేకపోతే వ్యవహారాలన్నీ కుక్కలు చింపిన విస్తరిలా అయేవి. కానీ పరిస్థితి ఇలా రావడం నిజంగా దారుణమైన విషయం. ఇలాటి స్థితి ఎప్పుడూ ఎవరికీ కలగకూడదు. కానీ ఏ విషయమూ మన చేతిలో లేదన్నది మనిషికెప్పుడూ గుర్తుండదు.

ఇంకో పదిరోజులు గడపడంతో పరిస్థితి ప్రాణేష్ అధీనంలోకి వచ్చింది. మిసెస్ కుల్ కర్ణి అతని సపర్యలవల్ల త్వరగా కోలుకోగలిగిందిగానీ కొడుకులేని లోటు, కొడుకు అదృశ్యం ఆమె మనసుకి చాలా గాఢమైన గాయమైంది. దానినుంచి కోలుకోవటమన్నది ఆమెకి చాలాకాలం పట్టచ్చు అది ఎవరి చేతులోనూ లేదు. మందులు సమయానికి ఇచ్చి భోజనం సమయానికి చేయిస్తున్నాడుగానీ ఆమె మనసుని అతనెలా నయం చెయ్యగలడు?

హాస్పిటల్లో వున్న ఎక్విప్‌మెంట్, ఫర్నిచర్, ఇతర సామాను అంతా వున్నదున్నట్టుంచి అమ్మేస్తే స్థలంతోసహా వచ్చిన డబ్బు ఇరవైలక్షల డాలర్లు. ఆ డబ్బు తీసుకుని మిసెస్ కుల్ కర్ణికి ఇస్తే,

"బేటా... నేనీడబ్బు తీసుకుని ఏం చేస్తాను? ఎంత డబ్బుంటే మాత్రం ఏం లాభం వాడు పోయిన తరువాత? ఇదంతా జాగ్రత్తగా వుంచు బేటా... తరువాత చూద్దాం వీటి విషయాలు. నేనిలాంటి విషాయలేవీ ఆలోచించే స్థితిలో లేను. వ్యవహారాలన్నింటినీ త్వరగా పూర్తిచెయ్యి. నా మీరాలేని ఈ ఇంట్లోగానీ ఈ అమెరికాలోగానీ నాకు వుండాలని లేదు" అంటూ విలపించింది.

ఆమెను తన గుండెల దగ్గరకి తీసుకున్నాడు. "పెద్దమమ్మీ... బాధపడి చేసేదేమీ లేదు. ప్లీజ్ కాస్త ధైర్యంగా వుండాలి నువ్వు- వెళ్లిపోదాం త్వరగా. నాకు కూడా

వుండాలనిపించటంలా. ఇంకొక వారంలో మిగతా వ్యవహారాలు కూడా పూర్తవు తాయి. వెళ్ళిపోదాం తొందరగా" అన్నాడు.

మీరాషామ్ మరణంతో ప్రాణేష్‌లో చాలా మార్పు వచ్చింది. ముందులా అత నిలో చిన్నపిల్లాడి మనస్తత్వం లేదు. వ్యవ హారవేత్తలానూ, ఆరిందాలానూ తయార య్యాడు. మనిషిలో హుందాతనం, పెద్ద మనిషి తరహా వచ్చాయి. మొహంలో గంభీరత చోటుచేసుకుంది. జీవితంపట్ల బాధ్యత పెరిగింది.

పనులూ, వ్యవహారాలూ అనుకున్నంత తొందరగా పూర్తవటంలేదు. ఎంత తొంద రగా చేద్దామన్నా ఏదో ఒకరకంగా ఆలస్య మవుతున్నాయి అనేక డిపార్ట్‌మెంట్లలో సంబంధమున్న పనులవడంవల్ల. అక్కడ ఇండియాలో తల్లి ఆరోగ్యం అంతగా బాగా లేదని అర్థమైంది. ఇక్కడ పెద్దమమ్మీ ఆరోగ్య పరిస్థితి అంతంతమాత్రంగానే వుంది. ఎంతో చలాకీగా వుండేమనిషి. చలాకీతనానికే భాష్యం చెప్పగలిగిన మెరు పుతీగ అసలు మంచం దిగటమే మానే సింది. అచ్చంగా ఆమెను, ఇంటిని చూసుకో వడానికని హాస్పిటల్లో వున్న నర్సుని తెచ్చి పెట్టాడు ఇంట్లో ప్రాణేష్. గబగబా బయటి వ్యవహారాలమీద వెళ్ళటం, వాటిని ఒక కొలిక్కి తీసుకుని సాయంకాలానికల్లా ఇంటికి రావటం.

ముఖ్యంగా మొబైల్‌హౌస్‌కి సంబంధిం చిన ఇన్‌ష్యూరెన్స్ పనులు చాలా చికాకు పెడుతున్నాయి రోజుకో ఇన్‌స్పెక్షన్‌తో. మొత్తానికి పరిష్కారమైంది. ఇన్‌ష్యూరెన్స్ రంగం అక్కడ అమెరికాలో దాదాపు ప్రైవే ట్‌రంగాలే చూస్తాయి. వాళ్లెంత త్వరగా పరిష్కరిస్తారో అంతకంటే ఎక్కువ నిబంధ నలుంటాయి. ఎక్కడా ఎలాటి పొరపాటు గానీ, తాత్సారంగానీ వుండదు ఒకసారి అ న్నీ జరిగిపోయిన తరువాత. అన్ని లావాదే వీలూ చాలా పకడ్బందీగా జరుగుతు న్నాయి. చాలా ఖచ్చితంగా వుంటాయి ప్రైవేట్ కంపెనీలు. చివరికి ఎలాగో గట్టె క్కింది. వాళ్లు ఆ మొబైల్ హౌస్‌కి ఇచ్చిన నలభైవేల డాలర్ల చెక్‌నీ తీసుకుని మిసెస్ కుల్‌కర్ణికి ఇస్తే మళ్లీ ఆమె అదే సమా ధానం చెప్పింది ప్రాణేష్‌కి.

చివరికి పూర్తయిన ఇంకో వ్యవహారం ఇల్లు. అది మీరాషామ్ ఐదులక్షల డాలర్లకి కొన్నాడన్న విషయం ఇంట్లో లాకర్లోవున్న కాగితాలని చూస్తేగానీ తెలియలా. ఇప్పుడు దాని విలువ ఎనిమిది లక్షల డాలర్లయింది మొత్తం ఇంట్లోవున్న సామానుతోసహా. ఇల్లు అమ్మి, ఆ కొన్నవాళ్లదగ్గర రెండువా రాల సమయం అడిగాడు ఇంటిని వాళ్లకివ్వ డానికి. వాళ్లు 'సరే' అన్నారు. నిజానికి ఆ ఇల్లు వున్న ప్రదేశం చాలా మంచి ప్రదేశం. ఐశ్వర్యవంతులుండే ప్రదేశం. దానిలోవున్న డైనింగ్‌టేబుల్ ఇరవైవేల డాలర్ల ఖరీదుచే స్తుంది. డ్రెస్సింగ్‌టేబిల్, మంచం కలిపి ముప్పైవేల డాలర్లు చేస్తుంది. చాలా హైక్లాస్ ఫర్నిచర్ కొన్నాడు మీరాషామ్ ఆ ఇంటికి తగ్గట్టు. అదీగాక స్థలం విలువ కూడా పెరగటంవల్ల మంచి రేటు వచ్చింది. బాంకుల్లోవున్న డబ్బు, షేర్లు, మిగతా విలువైన ఆస్తులూ అన్నీ కలిపి ఐదు లక్షల డాలర్లు వచ్చాయి.

ఇంత డబ్బు అమెరికానుంచి ఇండియాకు కరెన్సీ రూపంలో తీసికెళ్లడం కష్టం. అలా గని మిసెస్ కుల్‌కర్ణి పేరుతో చెక్‌గా మార్చాలంటే బ్యాంకులచుట్టూ తిరగటం... మళ్లీ ఇండియా వెళ్లిన తరువాత అక్కడ బ్యాంకుల చుట్టూ తిరగటం, తతంగం ఆమెకు నిజానికి అసలు ఓపిక లేదు ఏప నికీ.

"బేటా... ఒక్కమాట విను. నా మీరానా ఎటూ లేదు, వాడు తిరిగిరాడు. ఏ నిము షాన నీలో నా మీరాను చూసుకోవటం మొదలయిందో ఆ నిముషంనుంచీ నువ్వు నాకొడుకువయ్యావు. సాక్షాత్తూ నువ్వే నా

మీరాషామ్‌వి. నీలో వాడి పోలికలు వుండటం నా అదృష్టం. నువ్వు వాడిని కలవటం, వాడితో కొంతకాలం గడపటం నిజంగా మంచిదయింది. మీరా పోయిన ప్పటికీ ఇంకా నేను బతికున్నానంటే నీలో వాడిని చూసుకోగలుగుతున్నాను కాబట్టి. ప్రాణేష్... నీమీద నాకెలాటి సందేహమూ లేదు. నువ్వు నాకు ద్రోహం చేస్తావన్నది చాలా తప్పుమాట. ఏ బిడ్డా ఏ తల్లికీ ద్రోహం చెయ్యడు. అందులో నువ్వసలు చెయ్యవు. నేనివాళ కోలుకుని మనిషినయా నంటే కేవలం నీ వల్లనే. నీలో ఏమాత్రం స్వార్థ చింతననేది వుంటే నువ్వు నన్ను పసిబిడ్డలా చూసుకు నేవాడివికాదు. డబ్బంతా నీ పేరుమీద చెక్‌గా తయారు చేయించు... ఆ డబ్బులో చిల్లిగవ్వకూడా నాకొద్దు. ఇదే కాదు... హైదరాబాద్‌లో వున్న ఆస్తిపాస్తులు కూడా నాకొద్దు. ఇకనుంచీ నా ఆస్తికీ, నాకు నువ్వే వారసుడివి. నువ్వే నా కొడుకువి. నేను నీ బాధ్యతని. నువ్వు



నన్ను బాగా చూసుకుంటావనే నమ్మకం నాకు వుంది. దట్సాల్! డబ్బంతా నీ పేరున బ్యాంక్‌లో వెయ్యి. పద్మినినీ, నన్నూ బాగా చూసుకో బేటా మేం బతికున్నంత కాలం" అంటూ అతని చేతులు పట్టుకుంది. అతని కళ్లలో నీళ్లు ధారలుగా కారాయి. ఆ భగవంతుడు ఆమె రూపంలో నిర్భాగ్యమైన తనని దీవించినట్లనిపించింది.

★ ★ ★

బేగంపేట ఎయిర్‌పోర్ట్... లోపలంతా లైట్లకాంతిలో మెరిసిపోతూన్నది. జనాలసందడి... గల్ఫ్‌దేశాలకెళ్లే ముస్లిమ్స్... వారి వెంట వాళ్ల బంధువులు... పూలదండలను వెళ్లేవాళ్ల మెడలలో వేస్తూ హడావుడిచేస్తున్నారు. వాళ్లలోనే నవ్వేవాళ్లు చాలా ఎక్కువగా నవ్వుతున్నారు. బాధపడేవాళ్లు చాలా ఎక్కువగా బాధపడుతున్నారు. వాళ్లలో స్త్రీలు ఎక్కువగా బాధపడుతున్నారు. పూలదండల్ని మెళ్లోవేసుకున్న వాళ్లు... వాళ్ల మొహాలుమాత్రం నూతనోత్సాహంతో కళకళలాడిపోతున్నాయి. ఉబ్బిపోతున్నారు ఆనందంతో. లాంజ్ సందడిగా వుంది వాళ్ల సంతోషంతో.

పద్మినీ, దుష్యంతరావు అక్కడే సోఫాలో కూర్చుని వున్నారు వచ్చేవాళ్లకోసం ఎదురుచూస్తూ. పద్మిని మొహం నీరసంగా వున్నా ఎక్కడో ఆనందం తొంగిచూస్తున్నది. కళ్లలో ఆతృత కనిపించుతూన్నది దాదాపు ఐదు నెలలక్రితం వెళ్లిన కొడుకుని చూడటానికి. దుష్యంతరావు మాత్రం అలాగే హుందాగా వున్నాడు. అతని మొహంలో ఎప్పుడూ వుండే దర్పంతప్ప ఏదీ కనిపించటంలేదు. అతని వాలకంలో కూడా ఏ మార్పూ లేదు.

మిసెస్ కుల్‌కర్ణి, ప్రాణేష్ నెమ్మదిగా వస్తూ కనిపించారు. వాళ్లను చూడగానే ప్రాణం లేచొచ్చినదానిలా గభాల్న సోఫాలోంచి లేచి పరుగులాటి నడకతో అతని దగ్గరకెళ్లింది పద్మిని. ఆమెను నవ్వుతూ చూస్తూన్న ప్రాణేష్‌ని కళ్లారా ఒక్కసారి చూసి, అతని పక్కనేవున్న మిసెస్ కుల్‌కర్ణిని గట్టిగా కౌగలించుకుంది ఆప్యాయం ఉట్టిపడే స్పర్శతో. పద్మినలా కౌగిలించుకోగానే కట్టలుగా తెంచుకొస్తూన్న ఆ పెద్దావిడ దుఃఖం ఆగలా. అసలే కొడుకుపోయిన పుట్టెడు దుఃఖంలో వున్నదేమో, పద్మినిని పట్టుకుని భోరుభోరున పసిపిల్లలా విలపించింది. పద్మిని ఆమెను వూరడించింది. ప్రాణేష్ ఆమె భుజాన చెయ్యివేసి నెమ్మదిగా నడిపించుకుంటూ సోఫాలో కూర్చోబెట్టాడు. జీవితంలో ఓడిపోయినదానిలా సోఫాలో కూలబడింది మిసెస్ కుల్‌కర్ణి. ప్రాణేష్ తల్లి దగ్గరకొచ్చి "మమ్మీ..." అంటూ నిట్టూర్చి ఆమె మెడచుట్టూ రెండు చేతులేసి గట్టిగా ఆమెను పట్టుకున్నాడు. ఇన్నాళ్ల తరువాత కొడుకుని చూసిన ఆమెకి దుఃఖం ఆగలేదు. ఎన్నో చెప్పుకోవాలనిపించింది. ఎన్నో మాట్లాడాలనిపించింది. ఎన్నో విషయాలు అతనినుంచీ వినాలనిపించింది. కానీ వాటిలో ఏమీ చెయ్యలేకపోతోంది, అంత వేదనలో వున్న మిసెస్ కుల్‌కర్ణిని చూస్తుంటే.

దుష్యంతరావు వాళ్ల ముగ్గుర్నీ చూస్తూ ప్రేక్షకుడిలా నిలబడ్డాడు. మిసెస్ కుల్‌కర్ణి అతన్ని చూసి తల దించుకుంది. ఆమె దగ్గరకెళ్ళి ఆమెని పరామర్శించాడు. కొడుకు చెయ్యి పట్టుకున్నాడు. ఏదో చెప్పాలనిపించినా చెప్పలేకపోతున్నాడు. "డాడీ..." అంటూ తండ్రి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. తండ్రి గుండెలో తలదాచుకోవాలనిపించినా అలా చెయ్యలేకపోతున్నాడు తనకా హక్కు వుందో లేదో తెలీక.

"మమ్మీ... చాలా సన్నగా అయిపోయావ్. నాకు తెలుసు నువ్వు సరిగా తినటంలేదని. ఆ కళ్లు చూడు ఎంత గుంటలు పడిపోయాయో. నిద్ర అసలు పోవటం లేదు కదూ?" స్టూడెంట్‌ని టీచర్ అడిగిన

ట్లడిగాడు.

కొడుకులో కలిగిన మార్పుకి తల్లిదండ్రులి ద్దరూ అతన్నే చూస్తూన్నారు. ఇప్పుడు అత నొక నిండుమనిషిలా కనబడుతున్నాడు. ముందున్న అమాయకత్వం అతనిలో మచ్చు కయినా కనిపించటంలేదు. తండ్రికంటే పొడ వుగా కనబడుతున్నాడు. అతన్ని చూస్తుంటే పాతిక సంవత్సరాల క్రితం తను చూసిన తన దుష్యంత్ గుర్తొస్తున్నాడు పద్మినికి. కొడుకులో హుందాతనం, ఆత్మవిశ్వాసం కని పిస్తున్నాయి. ఐదు నెలల క్రితం ఇదే ఎయి ర్‌పోర్ట్‌లో లోకం అంతగా తెలియని అతను కేవలం తల్లియిచ్చిన వంద డాలర్లతో అమె రికా వెళ్లి, ఇవాళ దాదాపు ముప్పై కోట్లరూ పాయలకి ఏకైక వారసుడన్న విషయం వాళ్లి ద్దరికీ తెలీదు. ఆ డబ్బే అతనిలో ఆత్మవి శ్వాసం తెచ్చిందని వాళ్లకు తెలీదు. అతను అమెరికాలో ఎదుర్కొన్న సమస్యలే అతనిలో నిండుతనాన్ని తెచ్చాయని కూడా వాళ్లకి తెలీదు. 'విధి' అనేది ఎంత విచిత్రమైనదో... ఎంత బలీయమైనదో ప్రాణేష్‌ని చూస్తుంటే అర్థమౌతుంది.

అందరూ బయలుదేరారు కారులో ఇంటికి. ప్రాణేష్‌కి ఏదీ నమ్మబుద్ధవటం లేదు. అప్పుడు తను అమెరికా వెళ్లే సమ యంలో కూడా అంతే తను నిజంగా అమె రికా వెళుతున్నాడంటే నమ్మబుద్ధవలేదు. ఇప్పుడు అక్కడినుంచీ ఇక్కడికి వచ్చాడంటే నమ్మబుద్ధవటంలేదు. నిన్నమొన్న బేగం పేట ఎయిర్‌పోర్ట్‌కి వచ్చినట్లనిపిస్తుంది. అమెరికాలో తను పడ్డ కష్టాలూ, చూసిన, ఎదుర్కున్న అనుభావాలూ, వాటన్నింటినీ పరిష్కరించుకుని ఇండియా రావటం అసలు నమ్మబుద్ధవటంలేదు. తనలోనే కాదు తన మానసిక ప్రవృత్తిలో కూడా చాలా మార్పు వచ్చింది. తనిప్పుడు కోటీశ్వ రుడంటే తనకే వింతగా వుంది. కోట్లు ఎలా వచ్చి అతనికి అదృష్టాన్ని కల్పించాయో అలాగే అతనికి బాధ్యతల్ని కూడా కలిగిం చాయి. అప్పుడు తనకి తన తల్లొక్కతే ప్రపంచంలో వున్న కావలసిన వ్యక్తి. ఇప్పుడు తన తల్లితోబాటు తనను మనస్ఫూ ర్తిగా నమ్మి, తనమీద అపారమైన నమ్మ కాన్ని పెట్టుకుని, తనకు అదృష్టాన్ని కల్పిం చిన ఆ దేవత కూడా ఇప్పుడు తన జీవి తంలో ఒక భాగమయింది. ఇప్పుడామె కూడా తన తల్లిలాగే తన బాధ్యతయిపో యింది. అమెరికాలో అన్ని నెలలు ఆమెతో గడిపిన తరువాత తన తల్లికీ ఆమెకూ వ్యత్యాసమే లేకుండా అయిపోయింది.

మిసెస్ కుల్‌కర్ణి తన ఇంట్లో దిగింది ముందు. స్నానం చేసుకుని, ఒకసారి ఇల్లంతా చూసుకుని వస్తానని చెప్పిందామె. దుష్యంతరావు, పద్మిని, ప్రాణేష్ ముగ్గురూ వాళ్లింట్లో దిగారు. ఇంటి ప్రాంగణంలో కని పించిన మొక్కలు చూస్తుంటే ముందు న్నంత చక్కగాలేవు. వాటిని సరిగ్గా సంర క్షించుతున్నట్లు కనిపించలేదు. ఇల్లు తను ఎప్పుడూ చూసినట్లుగానే వుంది. ఏ మార్పూలేదు. అదే పాత ఫర్నిచర్, పాత వెలిసిపోయిన గోడలు, రంగు పోయిన కర్టెన్లు, ఏదీ సరిగా అందంగా కనిపించలేదు ఎప్పటిలాగే.

ముగ్గురూ డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చు న్నారు. కబుర్లు చెప్పుకున్నారు. మీరాషామ్ యాక్సిడెంట్ విషయం వివరాలు తెలుసు కుని వాళ్లిద్దరూ బాధపడ్డారు. అతని మరణం పద్మినికి చాలా బాధ కలిగిం చింది. ఆమె బాధ మీరాషామ్ గురించి కాదు. అతను పోయినందుకు అతని తల్లి పడే బాధను వూహించుకుని. అమెరికాలో విశేషాలన్నీ చెప్పాడు ప్రాణేష్ వాళ్లిద్దరికీ. అతనికి పెద్దమమ్మీ ఇచ్చిన ఆస్తి గురించి చెప్పాడు. ఇక్కడ వున్న ఆమె ఆస్తులు కూడా కొద్దిరోజుల్లో తన పేరుకు బదిలీ చెయ్యబోతున్న విషయం చెప్పాడు. దుష్యం తరావు హతాశుడయ్యాడు. చాలా ఆశ్చర్య పోయాడు. నిజంగా నమ్మలేకపోయాడు.

కొడుకు చూపించిన చెక్కు చూసి అవాక్కయ్యాడు. తను తనకొడుక్కేదీ చెయ్యలేకపోయినందుకు సిగ్గుపడ్డాడు. పద్మిని ఆశ్చర్యపోయిందిగానీ కాస్తంత సంశయం ప్రకటించింది ఎందుకు అనవసరపు బాధ్యతలని. కొడుకుని పైచదువులకోసం ఫారిన్ తను పంపించకపోయినా వాడు సొంతంగా ఫారిన్ వెళ్లగలిగాడనీ, ఫారిన్‌లో పెద్దపెద్ద చదువులు చదివినవాళ్లు అక్కడ ఉద్యోగాలు చేసి కూడా సంపాదించలేనంత డబ్బు తన కొడుకు కేవలం అదృష్టంమూలంగా సంపాదించుకోగలిగాడని తృప్తి చెందాడు దుష్యంతరావు. ప్రాణేష్ మాత్రం అప్పుడెలా వున్నాడో ఇప్పుడు కూడా అలాగే వున్నాడు తల్లిదండ్రులపట్ల.

అమెరికానుంచి వచ్చి కాస్తంత ఊపిరి పీల్చుకున్న తరువాత మీరాషామ్ కోరికప్రకారం మిసెస్ కుల్‌కర్ణి తన ఇంటిని రీమోడల్ చేయించుదామనుకుంది. ఇంటిపనులన్నీ అయిపోయిన తరువాత ఆ ఇంటికి 'మీరాషామ్' అనే పేరు పెట్టమని అడిగింది ప్రాణేష్‌ని. ఆమె జారీచేసిన ఆర్డర్‌ని అతను అమలుచెయ్యదలిచాడు.

ఇంటి రిపేర్లు మొదలయ్యాయి. అందుకని మిసెస్ కుల్‌కర్ణి పద్మిని ఇంట్లోనే వుండటం మొదలెట్టింది. ఆమె వుండటానికి వీలుగా ఇంట్లో పాత ఫర్నిచర్‌ని తీసేసి, దానిస్థానంలో అందమయిన కొత్త ఫర్నిచర్ అమర్చాడు మంచాలతోసహా. ఇప్పుడా ఇంటిని చూస్తే అసలెవరూ గుర్తుపట్టలేరు. కార్టెన్లూ, దుప్పట్లూ, సామానూ అన్నీ కొత్తవి వచ్చాయి. ఏ.సీ.లు అమర్చాడు ప్రతి గదిలోనూ. తన బెడ్‌రూమ్‌ని పెద్దమమ్మీకి ఇచ్చాడు ప్రాణేష్. ఆమెకి ఏ లోటూ కలగకూడదని ఒక ఫుల్‌టైమ్ హెల్పర్‌ని ఏర్పాటు చేశాడు. ఇద్దరు తల్లుల్నీ పువ్వుల్లో పెట్టి చూసుకుంటున్నాడు.

తల్లి ఆరోగ్యమే అతనికి భయం కలిగిస్తుంది అప్పుడప్పుడు. పరీక్షలు చేయించితే డాక్టర్ ఇచ్చే సలహా ఒకటే. ఆమె నవ్వుతూ హాయిగా తింటూ తిరుగుతుంటే అంతా సరిపోతుందని. ఆమెకి మందు ఆమె భర్త ప్రేమ అని ప్రిస్క్రిప్షన్‌లో రాయటం చేతకాలేదు డాక్టర్‌కి.

మిసెస్ కుల్‌కర్ణి ఇల్లు రూపం మారిపోతోంది. దానిమీద బాగా ఖర్చుచేస్తున్నాడు ప్రాణేష్ దగ్గరుండి మరీ. ఖర్చుకసలు వెనకాడటంలేదు. తొందరగా అందంగా పూర్తిచేసి భయ్యా కోరిన విధంగా తయారుచేసి, దానికి భయ్యా పేరు పెట్టాలని అతనికోరిక. ఆ ఇల్లూ, మిగిలిన స్థిరచరాస్తులు కూడా ప్రాణేష్ పేరుకి బదిలీ చేయించింది మిసెస్ కుల్‌కర్ణి. ఎందుకంటే తన ఆరోగ్యం బాగున్నప్పుడే తనాపని చేస్తే మంచిదని చెప్పింది. తల్లుల్ని అప్పుడప్పుడు బయటికి తీసికెళ్లటానికి మంచి కారు కొనాలనుకున్నాడు.

"ఏ కారు కొనమంటావ్ పెద్దమమ్మీ?" అడిగాడు ఆమె మీద ఆమె అభిప్రాయం మీద వున్న మర్యాదకి.

"నీ ఇష్టం బేటా... నీకేది నచ్చుతుందో అది కొను. మంచిదీ... పెద్దగా వున్నదీ కొను" అని సలహా ఇచ్చింది.

మర్నాడు లాన్సర్ కారుతో ప్రత్యక్షమయ్యాడు వాకిట్లో. తల్లులిద్దరూ ఆనందించారు. ఇద్దర్నీ ఒక రౌండ్ తిప్పుకొచ్చాడు. తను ఆ కారు కొన్నదిగానీ తను బతుకుతున్నది కానీ కేవలం వాళ్ళిద్దరి గురించే. అతనికి వాళ్ళు తప్ప వేరే ప్రపంచంలేదు. తండ్రి వచ్చినప్పుడు చూశాడు కారుని. బావుందని చెప్పాడు. తను టూవీలర్ కొనుక్కుంటానంటే ఆయనెంత రాద్ధాంతం చేసిందీ గుర్తొచ్చి గుండెలు మండినయ్. సొంత కొడుకులా ఎప్పుడూ చూడలేదనిపించింది. ఆయనెప్పుడూ తనకి అసంతృప్తినే మిగిల్చాడు. ఏనాడూ ఒక ఆనందాన్ని చవిచూపించలేదు మనసారా. ఏ సంబంధమూ లేని మీరాషామ్ తననెంతో ప్రేమగా

# ఏరినముత్యాలు

* బాగా కష్టపడి పనిచేసేవారి ముఖం ఎంతో మనోహరంగా వుంటుంది.
– డెకర్

* ఎన్నడూ ఆశపడనివాడు, ఎప్పుడూ అసంతృప్తికి లోనుకాడు.
– బెర్నార్డ్‌షా

* జ్ఞానవృక్షం ఫలాలను ఆరగించి అరిగించుకోగలవాడే బలశాలి.
– కోలండీ

* స్నేహాలు ఈ జీవిత ప్రయాణంలో సేదతీర్చే చెట్లనీడలు.
– ముర్రే

* నీ జీవితాన్ని ఇతరుల జీవితాలతో పోల్చకుండా అనుభవించు.
– కండోర్సెట్

* అపజయాన్ని కఠినమైన శ్రమద్వారా తునాతునకలు చేయవచ్చు.
– లేయన్స్

* తెలుసుకోవాలన్న జిజ్ఞాస మనిషి అభివృద్ధికి తొలిమెట్టు.
–శామ్యూల్ జాన్సన్

* ప్రశాంతమైన మనస్సు విలువైన మూలధనం.
– స్వామి శివానంద

* గెలుపు అనేది సాంఘికపరమైనదైతే, ఓటమి వ్యక్తిగతమైంది
– రస్సెల్

* అసాధ్యం అనేమాట కేవలం తెలివి తక్కువవాళ్ళ మెదడు కుహరంలోనే వుంటుంది.
– నెపోలియన్

* ఎదుటి వ్యక్తిమీద అపనమ్మకం ప్రదర్శించు, నీమీద నీవు కాదు.
– బోవీ

* గెలుపు అందించే తియ్యదనం మరేదీ అందించదు.
– అలెగ్జాండర్ డ్యూయాన్

* జేబు బరువు తగ్గితే హృదయభారం పెరుగుతుంది.
– బెంజమన్ ఫ్రాంక్లిన్

* మంచిపనికోసం పాటుపడితే హృదయం విశాలమవుతుంది.
– జాన్సన్

* మన అజ్ఞానాన్ని గురించి తెలుసుకోవటమే నిజమైన విజ్ఞానం.
– రాధాకృష్ణన్

సేకరణ: దాసరి వెంకటరమణరావు

చూసుకున్నాడు. మనసారా తనని ఆదరిం చాడు సొంత అన్నకంటే ఎక్కువగా. పెద్ద మమ్మీ దేవతలా తనని ఆదుకుంది. ఆదుకో వటమే కాదు తనకెంతో సౌభాగ్యాన్ని కలగ జేసిందిగాక, సంఘంలో తలెత్తుకుని తిరగ టానికి దోహదం చేసింది. ఆమె తనకు చేసినదానికి ఎన్ని జన్మలెత్తినా ఆమె రుణాన్ని తీర్చుకోలేడు. ఇక తల్లి సరేసరి... ఎన్ని జన్మలెత్తినా తనకి ఆ తల్లే కావాలని కోరుకుంటాడు.

ఎదురింటిపన్లు గబగబా సాగిపోతు న్నాయి. మీరాషామ్ చెప్పినట్టు రీమోడల్ చేయించటం జరిగినా అనుకున్నదానికంటే బాగా వస్తోంది. అనుకోకుండా కాంట్రాక్టర్ కూడా మంచివాడు దొరికాడు. తను చెప్పిన ఆలోచనల్ని సరిగ్గా వస్తురూపంలో పెట్టగ లుగుతున్నాడు. ఇంత బాగా తయారవు తుందని ప్రాణేష్ అనుకోలేదు.

రోజులు చాలా వేగంగా పరిగెత్తుతూ వెళ్ళిపోతున్నాయి. పాత ఇంటికీ, ఇప్పటి ఇంటికీ అసలు పోలికలే లేకుండా వుంది. ఇంతకుముందు బంగ్లా పాత స్తంభాలతో, పాతగోడలూ, పాత కిటికీ రంగులూ, గోడ లకి పూసిన గోపీరంగూ... ఇవన్నీ చాలా పాతకాలానికి చెందినట్లుండేవి. ఇప్పుడలా కాదు. పాత స్తంభాలస్థానంలో అందమైన ఏనుగు స్తంభాలు వచ్చాయి. ఇంటిగోడలన్నీ మొత్తం తెలుపురంగులో కనబడుతున్నాయి. చక్కటి అందమైన పువ్వుల తీగలు, చక్కటి రమ్యమైన పొదరిళ్ళు, గులాబీల తోట, పోర్టి కోలో తెల్లగులాబీ గుత్తుల తీగె, పోర్టికో తెలుపు రంగులో వుంది. గోడలు తెలుపు పాలరాళ్లతో నిగారించి పోతున్నాయి. పోర్టికో స్తంభాలకి పాకించినది తెల్ల గులాబీ లత. అదీకాక ఇల్లు పూర్తయే సమయానికి మొక్కలు బాగా గుమ్మటంలా పెరగాలని పోర్టికో అంతా తెల్లటి గులాబీలూ, ఆకుప చ్చటి ఆకులతో కన్నులపండుగగా కనిపించా లని పోర్టికోకి రెండువైపులా అరడజను మొక్కలు చొప్పున పాతించాడు. అవి ఇప్పుడు పోర్టికోపైకి పాకి అసలు ఖాళీ లేకుండా ప్రాణేష్ అనుకున్నట్టే ఆకుపచ్చ దనం, తెల్లదనం తప్ప ఏదీ కనిపించటం లేదు. ఆ దృశ్యాన్ని చూస్తుంటే ఊటీలో మొక్కలను మరిపిస్తున్నాయి.

బంగ్లా పనంతా అయిపోయింది. ఇప్పు డది దాదాపు కొత్త బంగ్లా. అదొకప్పుడు పాతదంటే ఎవరూనమ్మరు. గేట్ కూడా ఆ బంగ్లాకు తగ్గట్టు తయారు చేయించి కలర్స్ వేయించాడు. గేట్ బయట ఎడమచేతివైపు గోడకి చక్కటి గ్రానైట్ ఫిక్స్ చేయించి 'మీరాషామ్' అనే పేరు బంగారు రంగు అక్షరాలతో ధగధగా మెరిసేలా పెట్టిం చాడు. గేట్‌కి వున్న పాత లైట్లని కూడా మార్చి అందమైనవి పెట్టించాడు. పాత బంగ్లా కొత్త పెళ్ళికూతురిలా ముస్తాబయి కళ్లకు హాయినిస్తోంది. దానిని చూసిన మిసెస్ కుల్‌కర్ణి నమ్మలేదు మొదట దానిలో తనుండేదంటే. రోజులతోబాటు పరిస్థితులు కూడా మారిపోయాయను కుంది. ఇల్లంతా తిరిగి చూసుకుంది. కళ్లలో నీళ్లు పెట్టుకుంది. ప్రాణేష్ అలా చేయించ గలడని తను అనుకోలేదు. ముఖ్యంగా మీరాషామ్ సైన్‌బోర్డ్ ఆమె మనసుని కది లించటమే కాకుండా ఆకట్టుకుంది.

బంగ్లాలో వున్న ఫర్నిచరూ, కర్టెన్లూ ఒక టేమిటి అన్నీ మారిపోయి, కొత్త అందాలను సంతరించుకున్నాయి. అంత అందమైన ఇంట్లో ఒక్కతే వుండాలంటే మనసు పీకు తుంది. అప్పుడు పాతబంగ్లాగా వున్న రోజుల్లో తన భర్త ఆర్.ఎస్.కుల్‌కర్ణి గుర్తు లుండేవి ఎక్కువగా ఆ ఇంట్లో ఇప్పుడవేమీ లేవు. ఆయన దగ్గరుండి, ఆయన అభిరుచికి తగ్గట్టు చేయించిన వస్తువులూ లేవు. గోడలూ లేవు, తలుపులూ లేవు, అంతా మీరాషామ్ అభిరుచికి తగ్గట్టున్నది. మీరా షామ్ ఆలోచనలకి ప్రాణేష్ ప్రాణాన్ని పోసి, నిర్వచనం చెప్పినట్టనిపిస్తుంది. కానీ కొడుకు

లేని ఇంట్లో తనుండాలంటే మనసు మొరా యిస్తుంది. అప్పుడు తను ఆ ఇంట్లో వున్న పరిస్థితి వేరు. కొడుకనేవాడు ఆరోగ్యంగా, ఆనందంగా ఎక్కడో వున్నాడు. ఆ భావనే ఆమెని నడిపించేది. ఇప్పుడలా కాదు.

గృహప్రవేశాన్ని ఆర్భాటంగా చేయించటం మిసెస్ కుల్‌కర్ణికి ఇష్టంలేదు. మంచిరోజు చూసి ఫార్మల్‌గా చేయించింది. ఏదో... కొడుకు చెప్పినట్టు చేయించిందిగానీ ఆ ఇంట్లో వుండటానికంటే చూడటానికే చక్కగా వుండేలావుంది. అందరం కలసి ఆ ఇంట్లోనే వుందాం అని అడిగింది పద్మినిని. అందుకు పద్మిని ఒప్పుకోలేదు. భర్తకి ఇష్టంలేని పనులు ఆమె ఎప్పుడూ కూడా చేసి ఎరగదు కాబట్టి. అతను ఆ యింటికి ఎంత రాకపో యినప్పటికీ బొత్తిగా పరాయివాళ్ల ఇంట్లో తన భార్యతో ఎలా వుండగలడు. ఎలా మాట్లాడగలడు? పద్మినికి విచక్షణాజ్ఞానం చాలా వుంది. భర్త అభిమతం ఆమెకి బాగా తెలుసు. అందుకే ఎదురు బంగ్లాలోకి వెళ్ళి వుండాలనే ఆలోచనని నిరాకరించింది. మిసెస్ కుల్‌కర్ణి అర్థం చేసుకుంది. సబబు గానే అనిపించింది. "సరే మీ ఇష్టం" అంది.

బంగ్లా పని అయిపోయి, గృహప్రవేశం అయిపోయి చాలారోజులవుతున్నా మిసెస్ కుల్‌కర్ణి అక్కడికి వెళ్ళి వుంటాననకపోవడా నికి కారణమేమిటో ప్రాణేష్‌కి తెలీలేదు. అనుమానం కలిగింది తను చేయించిన పనులు బాగా లేవేమోనని.

"పెద్దమమ్మీ... ఆ ఇంట్లోకెప్పుడెళదాం? మీకు నచ్చిందా? ఇంకా ఏమన్నా మార్పు లున్నాయా? "

"లేదు బేటా... నువ్వు చేయించిన తరు వాత నచ్చకపోవటమా? నా మనసు లోమాట చెబుతా... ఏమనుకోవుగా? "

"చెప్పండి పెద్దమమ్మీ... యూ ఆర్ ఎట్ లిబర్టీ... దానికి సందేహమెందుకు? "

"ఒక్కదాన్నే వెళ్ళి అక్కడ వుండాలనిపిం చటంలేదు. వాడు పోయిన తరువాత ఒంటరిదాన్నయిపోయాననిపిస్తోంది. ఏమ నుకోకపోతే నేనూ మీతోబాటే ఇక్కడ వుంటా. మమ్మీతో చెప్పా అందరం అక్కడి కెళ్ళి వుందామని, కానీ ఆమె అందుకు ఇష్ట పడలా. ఉండాలనిపించినంత కాలం మాతోనో వుండండని చెప్పింది. ఉండాలని పించినంతకాలం కాదు బేటా, ఎప్పటికీ మీతోనే వుంటా, దయచేసి నన్నొక్కదాన్నే అక్కడికి పంపద్దు" అతని చెయ్యి పట్టుకుని రోదించింది.

అతను చలించిపోయాడు అనుకోని సంఘటనకు.

"చూడండి పెద్దమమ్మీ, ఇంకా మీరు కొత్త వాళ్లలా మాట్లాడితే ఎలా? ఇదిమాత్రం మీ ఇల్లు కాదా? నేనెక్కడ వుంటే అదే మీ ఇల్లు, మీరు ఎక్కడా ఒక్కళ్లే వుండే సమస్య లేదు. అలా వదలను మిమ్మల్ని, ఓకే? " అన్నాడు.

"అదేంటి బేటా, నన్ను పరాయిదాన్ని చేసి 'మీరు...మీరు' అని సంబోధించటం తప్పు కాదా? మీ మమ్మీని 'మీరు' అనవుకదా? మరి నన్ను అలా అనకూడదు కదా? "

"తొందర్లో అలా దొర్లుతుంటుంది తప్ప మిమ్మల్ని పరాయి అనే ఫీలింగ్ నా మన సులో వుండదు పెద్దమమ్మీ, ఇకనుంచీ అలా అననులే" ఆమె అతనికళ్లలోకి చూస్తూ సరేనని తలూపింది.

"బేటా... కావాలంటే ఈ ఇంటిని కాస్త పెద్దది చేయించు దానిలాగే... పైన కొన్ని గదులు వేయించితే డాడీ వచ్చినప్పుడు అందరం కింద ఒకేచోట వుండకుండా మమ్మీతో మాట్లాడుకోవడానికి కాస్త ప్రైవసీ వుంటుంది. కాస్త ఆ విషయం కూడా ఆలో చించు ప్రాణేష్"

"నిజమే... డాడీకి అసలే మొహమాటం ఎక్కువ. అసలే ఆయన పరాయిమనిషిలా ప్రవర్తిస్తుంటారు. ఇంకా మనమందరం ఇలా వుంటే ఆయన్ని మనం ఎవాయిడ్ చేస్తున్నామని ఆయన మనల్ని ఎవాయిడ్

చేసినా ఆశ్చర్యపడక్కర్లా. అయితే అదే కాంట్రాక్టర్ని రేపు పిలిచి, పైన గదుల గురించి చెబుతా... చాలా మంచి ఐడియా వచ్చింది పెద్దమమ్మీ నీకు"

"అవును బేటా... సాధ్యమైనంత త్వరగా చేయించు ఈ ఇంటిపనులు కూడా" అంది.

ప్రాణేష్ తండ్రినడిగాడు ఇలా పైన కొన్ని గదులేయించి, ఇంటినికాస్త పెద్దగా చేయిం చాలనుకుంటున్నా, పెద్దమమ్మీ కూడా ఇక్కడే వుంటుంది మీకభ్యంతరం లేకపోతే నని. తనకేమాత్రం అభ్యంతరం లేదనీ, ఇష్టం వచ్చినట్టు చేయించుకో, అది మీ మమ్మీకి ఎప్పుడో కొనిచ్చాను. నీ ఇష్టం, ఆమె ఇష్టం అని చెప్పాడు దుష్యంతరావు. పద్మిని ఏమీ చెప్పలేదు. ఆ బాధ్యతని తండ్రీకొడుకులమీద పడేసింది. తండ్రి దగ్గ రనుంచీ గ్రీన్‌సిగ్నల్ వచ్చేసింది కాబట్టి పనులు చాలా వేగంగా జరిగిపోతున్నాయి. ప్రాణేష్‌కి పూనకం పట్టినట్టు చేయించుతు న్నాడు పనులని చకచకా.

మరో మూడు నెలల్లో పైన ఒక పెద్ద హాలు, రెండు బెడ్‌రూమ్‌లు, ఒక బాల్కనీ వేయించాడు. పెద్ద హాల్లో ఎదురెదురుగా రెండు డబుల్ మంచాలేయించి, వాల్‌టీవీ ఒకటి ఏర్పాటు చేయించాడు. రెండు మంచాలూ చెరొక తల్లికి, ఇద్దరూ కలసి టీవీ చూసుకోవడానికి వీలుగా వుండేలా చేయించాడు. హాల్లోనే ఒక సోఫాసెట్, సెంటర్‌టేబుల్ వేయించాడు. ఆ సోఫాలో కూర్చుని టీవీ చూసుకునేలాను, టీ తాగడా నికి వీలుగాను ఏర్పాటు చేశాడు. హాలునా నుకుని ఒక పెద్ద బాల్కనీ... దానిలో రక రకాల పువ్వుల చెట్లు, మొక్కలు.

మిగతా రెండు బెడ్‌రూమ్‌లలో ఒకటి ప్రత్యేకంగా పెద్దమమ్మీకని ఏర్పాటు చేశాడు. దానిలో కూడా అన్ని హంగులూ వున్నాయి. రెండో బెడ్‌రూమ్ తనకి ప్రత్యే కంగా వుంచుకుని, దానిలో కూడా అన్ని ఆధునిక సౌకర్యాలూ ఏర్పరచుకున్నాడు కంప్యూటర్‌తోసహా.

కిందవున్న ఇల్లంతా ముందువున్నలాగే వుంది వంటగదితో సహా. దాదాపు అందరూ పైకి మార్చారు మకాం. ఎదురిం టిని కొంతకాలం ఖాళీగా అలాగే వుంచుదా మని చెప్పింది మిసెస్ కుల్‌కర్ణి.

దుష్యంతరావు ఆ ఇంటికొక చీఫ్‌గెస్ట్ ఇప్పుడు. ఇంట్లో జరుగుతూన్న హడావుడేమీ అతనికి అర్థంకావటంలేదు. ఎప్పుడొచ్చినా ఏదో ఒక హడావుడి, ఏదో ఒక మార్పు. కొడుకు హయాంలో తనకిప్పుడు మాట్లాడేం దుకు ఏదీ లేదనిపిసోంది. తండ్రిని ఎదురిం టికి తీసికెళ్లి చూపించాడు ప్రాణేష్. ఆ ఇల్లు స్వర్గంలా వుందని చెప్పాడు తండ్రి. మనిషికి ఇంతకంటే ఏం కోరిక వుంటుంది అని చెప్పాడు. కొడుకు అదృష్టానికి సంతోషించి, కొడుకు భుజం నిమిరాడు ఆశీర్వచనంగా. ప్రాణేష్ మురిసిపోయాడు ఆ స్పర్శకి. అంత కుముందెప్పుడూ దుష్యంతరావు ఆ ఇంటిని చూడలేదు బయటినుంచి తప్ప. ఇల్లు చాలా పెద్దదనుకున్నాడు. అంత గొప్ప ఇల్లు తన కొడుక్కి చెందినదవడాన్ని నమ్మలేకపోతు న్నాడు. ఏది ఏమయినప్పటికీ అతను రావటం కూడా చాలా తక్కువయిపోయింది. అతనికతను వీళ్లనుంచి చాలాదూరం వెళ్లిపో తున్నాడు. పద్మినికి మాత్రం మనసులో విప రీతమైన దిగులు పట్టుకుంది. ఎవరిని ఏమ నాలో తెలీదు. తప్పెక్కడ జరిగిందో తెలీదు. ఏది ఎలావున్నా ఒకటిమాత్రం నిజం. తన దుష్యంత్‌మాత్రం ఇంటికిరావడం దాదాపు మానేసినట్టే. ఉండాల్సినంత ఆనందంగా ఆమె వుండలేకపోతోంది.

ఇంటినిండా పనివాళ్లు, వంటమనిషి, బయట వాచ్‌మన్, ఇంట్లో కుక్కలు, ఇంట్లో లేనిదంటూ ఏదీలేదు. పద్మినికి అదివరకు ఏదయినా కావాలనిపించినా, దేనిమీద యినా కొద్దిపాటి కోరిక కలిగినా అవన్నీ దూరంగానే వుండేవి. చాలావాటికి చాలా కాలం ఎదురుచూడాల్సి వచ్చేది. ఇప్పుడలా

కాదు. నోట్లోనుంచీ మాట వచ్చీరాగానే కావలసినవి రెక్కలు కట్టుకుని వాలిపోతున్నాయి ఇంట్లో. అది భర్త హయాం. ఇది కొడుకు హయాం. ఇన్ని హంగులున్నా, ఇంత ఆర్భాటాలూ, హడావుడివున్నా ఆమె మాత్రం చాలా నిర్లిప్తంగా వుంటుంది. ముఖమంతా పాలిపోయి కనబడుతుంది. అప్పటికీ చాలాసార్లు హాస్పిటల్‌కి తీసికెళ్లాడు ప్రాణేష్. కానీ ఆమెలో ఏమాత్రం మార్పు కనబడటంలా. ప్రాణేష్‌కి తల్లిదొక సమస్య అయిపోయింది. పెద్దమమ్మీ కాస్త మనలోకంలోకి వస్తుందిగానీ మమ్మీయే రోజురోజుకీ చాలా డల్లయిపోతుంది అనుకున్నాడు.

ప్రాణేష్‌కి ఒక ఆలోచన తట్టింది. దాన్ని నిజం చెయ్యాలనుకున్నాడు. మేడ్చల్‌కి పది కిలోమీటర్ల దూరంలో వంద ఎకరాల భూమి ఎవరో ఎన్నారై చవకగా అమ్ముతున్నాడని వినగా, దాన్ని కొని దానిలో మీరాషామ్ పేరుమీద ఒక మంచి హాస్పిటల్ కట్టించాలని అనుకున్నాడు. ఇలా చేస్తే ఇంట్లో ఇద్దరు తల్లుల ఆరోగ్యాలకీ పనిచేస్తుంది, తనెటూ సైకాలజీ చేశాడు కాబట్టి, ఆ విభాగం తను చూసుకోవచ్చు. అదీగాక మీరాషామ్ డాక్టర్‌గా చేశాడు కాబట్టి అతని పుణ్యమా అంటూ తనివ్వాళ ఈ స్థితిలో ఉన్నాడని అలా ఒక హాస్పిటల్‌ని ప్లాన్‌చేద్దామనిపించింది. వెంటనే మిసెస్ కుల్‌కర్ణిని సంప్రదించాడు.

"పెద్దమమ్మీ... ఒక పని చేద్దామనుకుంటున్నా... భయ్యా పేరు మీద ఒక మంచి పెద్ద హాస్పిటల్ కట్టించుదామనుకుంటున్నా. అంతేగాక మనకందరికీ పనికొస్తుందీ, జనాలకి కూడా ఉపయోగంగా వుంటుంది"

"బేటా... నిజంగా గొప్ప ఐడియా, నాదేముంది చేసేవాడివి నువ్వు, నువ్వేంచేసినా చక్కగా చేస్తావనే నమ్మకం నాకుంది బేటా... కానీ... నీకేం తక్కువ? కోట్లడబ్బుంది. దాన్ని మంచి పనులకుపయోగించు బేటా... మనతోబాటు బయట పదిమందికి కూడా పనికొస్తే అప్పుడే ఆ డబ్బుకి విలువ వుంటుంది. మమ్మీని కూడా ఒకసారి కనుక్కో" అంది.

తల్లిదగ్గరకెళ్ళి చెప్పాడు విషయం. ఆమె నుంచి ఎలాటి రియాక్షనూ లేదు. అంతా కొడుకుమీద వదిలేసింది. ఏదయినా బాగా ఆలోచించి, ఆచరణలో పెట్టమని సలహా ఇచ్చింది. తండ్రిని సంప్రదించమంది.

మళ్ళీ ఈవిడ తండ్రంటుందని మనసులో అనుకున్నాడు. ప్రతి విషయానికీ ఆయన వూసెత్తందే ఆవిడ ఏదీ చెయ్యలేదని ఆమె మీద జాలిపడ్డాడు. ఆవిడ జీవితం అలా డిజైన్ చేసుకుంది. దానికి ఎవరు మాత్రం చేసేదేముందని అనుకున్నాడు.

ఎన్నారై దగ్గర వంద ఎకరాల భూమిని రిజిస్ట్రేషన్ చేయించాడు. హాస్పిటల్ శంకుస్థాపన అయింది. ముఖ్యమంత్రి స్వయంగా వచ్చి, కొబ్బరికాయ కొట్టి, పునాదిరాయి వేశాడు. ఇంకా సిటీలోవున్న పెద్దతలలు వచ్చి తలా ఒక రాయినీ పాతి, ఆయా తలల పేర్లు ఆయా రాళ్లమీద అచ్చుగుద్దించి వెళ్ళారు. ఆ హాస్పిటల్ అచ్చంగా యాక్సిడెంట్లని మాత్రమే చూసేలా, ఎలాటి యాక్సిడెంట్ అయినా అక్కడ వైద్యం చెయ్యబడేలా అన్ని రకాల విభాగాలూ వచ్చేలా ప్లాన్ చేశాడు.

యాక్సిడెంట్‌లో మనుషులకి మెదడు ఆపరేషన్ అవసరం రావచ్చు, ప్లాస్టిక్ సర్జరీ అవసరం పడచ్చు, ఎముకలకు సంబంధించిన ఆపరేషన్ అవసరపడచ్చు, కళ్ల మార్పిడి అవసరం పడచ్చు, ఒకటేమిటి చిన్న పిల్లలదగ్గరనుంచీ పెద్దవాళ్లదాకా, కాలిగోరునుంచీ తలదాకా ఎన్ని అవసరాలుంటాయో, యాక్సిడెంట్లలో గాయపడ్డ మనుషులకి ఎన్ని రకాల వైద్యసదుపాయం కావాలో అన్ని రకాలూ ఈ హాస్పిటల్లో అందుబాటులో వుండేలా "ప్లాన్ చేశాడు.

మీరాషామ్ భయంకరమైన ప్రమాదంలో పోయాడు. అలాటి ప్రమాదం సంభవించినప్పుడు ఏమాత్రం బతికే అవకాశం వున్నా ఎంతోమంది డాక్టర్లు ఎన్నో రకాలుగా ప్రాణాలను నిలిపే ప్లాన్ చేశాడు. హాస్పిటల్ పేరు కూడా మీరాషామ్ యాక్సిడెంట్ స్పెషల్ హాస్పిటల్ అనే పేరు నిర్ణయించాడు. ఇరవైనాలుగ్గంటలూ రోగులకు అందుబాటులో వుండాలని అతని కోరిక. దానికి సంబంధించి వాషింగ్టన్‌లో భయ్యా దగ్గర పనిచేసిన కొంతమంది డాక్టర్లని కూడా సంప్రదించాడు. అవసరమైతే వాళ్లలో కొంతమంది ఇండియా వచ్చి, వాళ్లంతు సేవలనందించుతామని చెప్పారు.

ప్రాణేష్‌కి మళ్లీ ఏదో పూనకం పట్టినట్టు, పని దయ్యం పట్టినట్టు, పనిలో మునిగిపోయాడు. ప్రపంచంలోని హేమాహేమీల చేత ప్లాన్ చేయించి, వ్యయప్రయాసలతో హాస్పిటల్ నిర్మాణ కార్యక్రమాన్ని ఒక పట్టు పట్టాడు.



ప్రాణేష్ కంట్రీక్లబ్బుకి వచ్చింది కూడా ఇదే విషయం మీద. నిమ్స్‌లో ఎవరో సర్జన్ అమెరికానుంచి వచ్చాడన్న సంగతి తెలిసి, అతన్ని కలిసి, అతన్ని హాస్పిటల్‌లో కన్సల్టెంట్‌గా ఉండమని ప్రతిపాదించుదామని వచ్చాడు. అతన్ని కలిసి, ఆ పని అయిపోయిన తరువాత, ఇంకేదో పని అమీర్‌పేటలో చూసుకుని, ఆకలేసినట్లనిపిస్తే కంట్రీక్లబ్బుకి వచ్చాడు. ఆ వచ్చినప్పుడే చక్రధరరావు, పాప కనిపించి, చికాకు పెట్టారతన్ని. వాళ్లని వదిలించుకుని, లోపలికెళ్లి, తినాలనిపించినవి తిన్నాడు.

క్లబ్బునుంచి తిన్నగా ఇంటికెళ్లాడు మధ్యలో తాజా పళ్లు కొని. రోజూ ఇద్దరు తల్లులకీ పళ్లరసం అవసరం. వంటమనిషి పని వాళ్లిద్దరికీ పళ్లరసం టైముకి ఇవ్వడం.

క్లబ్బులో చక్రధరరావు, ఆయన భార్య కనిపించిన సంగతి తల్లికి చెప్పాడు. ఆమె విన్నదిగానీ ఏమీ అనలేదు. మిసెస్ చక్రధరరావు భార్య అన్న మాటలు ఆమె గుండెని ఎంతతూట్లుగా పొడిచాయో ఆ గాయాలు ఇంకా తాజాగానే వున్నాయి ఆమె గుండెలో.

సంవత్సరం గబగబా దొర్లిపోయింది. అతను అమెరికానుంచి వచ్చి ఈ లోపల వచ్చిన ఆరు నెలల్లో రెండు ఇళ్ల రిపేర్లు చేయించాడు. తరువాత హాస్పిటల్ పని మొదలుపెట్టాడు. ఇంకో మూడు నెలల్లో హాస్పిటల్ ప్రారంభమవుతుంది. దానిక్కావలసిన పరికరాలన్నీ అమెరికానుంచి వచ్చేశాయి. హాస్పిటల్ వాలకం చూస్తుంటే ఎవరో విదేశీయులు దాన్ని కడుతున్నారనిపిస్తుంది. లేకపోతే విదేశీయులతో చేతులు కలిపిన స్వదేశీయుడెవరో కడుతున్నాడనిపిస్తుందిగానీ ఒక ఇండియన్, అందులోనూ ఒక కుర్రాడు ఒంటరిగా, సొంత బుర్రతో పనులు చేయిస్తున్నాడంటే నమ్మరెవ్వరూ.

కొడుకు చేస్తున్న బృహత్తర కార్యం గురించి దుష్యంతరావు తెలుసుకుని ఆశ్చర్యపడటం కూడా మానుకున్నాడు. వాడిలాటి పనులేవీ చెయ్యకపోతే ఆశ్చర్యపడాలిగానీ చేస్తే ఎందుకాశ్చర్యం?' అనుకున్నాడు. వయసు, తెలివితేటలు, పట్టుదల వీటికి

తోడు డబ్బు తోడయితే ఇక ఆ మనిషి ఎంత ఎత్తుకెదుగుతాడో ఎవరైనా వూహించుకోవచ్చనుకున్నాడు.

గబగబా తయారవుతున్నాడు ప్రాణేష్ హాస్పిటల్ సైట్ దగ్గరకు. ఇంతలో పనివాడు పరుగుతో అతనిదగ్గరకొచ్చి

"సర్... మమ్మీగారు కిందపడిపోయారు. అర్జంట్‌గా రండి" అన్నాడు కంగారుగా. పనివాడి వెనక పరుగుతీశాడు ప్రాణేష్.

పద్మిని తన మంచందగ్గర నేలమీద పడి, నెమ్మదిగా లేవడానికి ప్రయత్నిస్తోంది. గాభరాగా తల్లిదగ్గరకెళ్లాడు ప్రాణేష్.

"మమ్మీ... మమ్మీ... ఏమయింది... ఎందుకు పడ్డావ్?"

"ఏంలేదు ప్రాణా...నీరసంగా అనిపించింది. కళ్లు తిరిగాయి. ఎప్పుడు పడ్డానో నాకు తెలీదు, దాహంగా వుంది కాస్త నీళ్ళివ్వు"

పనివాడు నీళ్లు తెచ్చిచ్చాడు. తల్లిని పట్టుకుని నెమ్మదిగా లేవదీసి మంచంమీద పడుకోబెట్టి, పక్కనున్న కుర్చీలాక్కుని దానిలో కూర్చుని.

"ఏమయింది మమ్మీ, ఎలా, ఎలా జరిగింది? బాగా డల్‌గా వుంది మొహం, ఏమయిందంటే ఏదీ చెప్పవు, మందులు వాడవు, పద డాక్టర్ దగ్గరికి" అంటూ ఆమెని నెమ్మదిగా చెయ్యిపట్టుకుని నడిపించాడు మెట్లదాకా. జాగ్రత్తగా ఆమెని చిన్నపిల్లని పట్టుకున్నట్టు పట్టుకుని నడిపించాడు ఇంకో మనిషి సహాయంతో.

పద్మినిని హాస్పిటల్‌కి తీసికెళ్లాడు ప్రాణేష్. మిసెస్ కుల్‌కర్ణి కూడా వచ్చింది వాళ్లతోటే.

పరీక్షలన్నీ పూర్తయ్యాయి. ఇంటికొచ్చేశారు. పద్మిని చాలా నీరసంగా కనిపించింది. ఆమెకు పూర్తి బెడ్‌రెస్ట్ అవసరమని చెప్పాడు డాక్టర్. మంచంమీద పడుకోబెట్టి ప్రాణేష్ కూడా తల్లిపక్కనే కూర్చున్నాడు. ఆమె చేతిని తన అరచేతిలో పెట్టుకుని. పద్మిని ఏమీ మాట్లాడటంలేదు. పడుకుని కొడుకునే చూస్తున్నది. ఆమె కళ్లలో నీళ్లు దిండుమీదికి జారిపడుతున్నాయి.

"మమ్మీ... ప్లీజ్... హాపీగా వుండటానికి ప్రయత్నించు... నువ్వలా అయితే నేనెలా వుండగలనే చెప్పు? నువ్వు అనారోగ్యంగా వుంటే నేను భరించలేను మమ్మీ, ప్లీజ్" తల్లిని బతిమాలుతున్నాడు. ఆమె ఏదీ మాట్లాడకుండా చిరుదరహాసం కొడుకుమీద వదిలి కళ్లు మూసుకుంది.

డాక్టర్ చేసిన పరీక్షల రిపోర్టులన్నీ వచ్చాయి. పద్మిని నెర్వస్ సిస్టం అంతా బాగా దెబ్బతిన్నదని చెబుతున్నాయవి. బీపీ కూడా చాలా తక్కువయి పల్స్‌బీట్‌లో కూడా చాలా తేడాగా కనిపిస్తోంది. ఆమె ఆరోగ్యం చాలా క్షీణించిందని డాక్టర్ చెప్పాడు. మందులకంటే కూడా ఆమెకి మెంటల్‌పీస్ అవసరమనీ, మెంటల్ హాపీనెస్ అవసరమనీ డాక్టర్ వక్కాణించాడు. ప్రాణేష్ గుండె ఆగిపోయినంతపనయింది. నీరసంగా కనబడుతోంది. కానీ తన తల్లి ఆరోగ్యం అంతగా క్షీణించిందని అతననుకోలేదు. ఆమె కూడా ఎప్పుడూ అతనికి చెప్పలేదు. ఆమెని చాలా జాగ్రత్తగా చూసుకోమని, ఆమె మనసులో అలజడి లేకుండా నిర్మలంగా వుంచాలనీ, ఆమె మనస్సు స్థిరంగా వుండాలనీ చెప్పాడు డాక్టర్. ఎక్కువగా వత్తిడిని భరించడంవల్ల ఆమె సిస్టమంతా దెబ్బతిన్నదని చెప్పాడు. వెంటనే తగ్గిపోవటానికి ఈ సమస్య ఒకటీ రెండు రోజులలో వచ్చింది కాదనీ, దీనికి చాలా నాజూకు ట్రీట్‌మెంట్ అవసరమనీ చెప్పాడు.

విషయం బాగా అర్థమైంది ప్రాణేష్‌కి. తల్లి ఎప్పుడూ బాధపడుతుంటుందనీ, ఆ కారణంచేత ఆమె ఆరోగ్యాన్నిలా పాడుచేసుకున్నదనీ గ్రహించుకున్నాడు. రిపోర్టులన్నింటినీ కవర్లో పెట్టుకుని పసిపిల్లవాడిలా విలపించాడు ఒంటరిగా. గుండె తేలికయేలా

రోదించాడు.

తండ్రికి ఫోన్‌చేసి ఇంటికి రమ్మన్నాడు. దుష్యంతరావు వచ్చాడు. భార్య తలదగ్గర కుర్చీలో కూర్చున్నాడు. ఆమె తలమీద చేత్తో సుతారంగా నిమురుతున్నాడు. ఆమె అతన్నే చూస్తున్నది. తల్లి, తండ్రికి దూరంగా నిలబడ్డాడు వాళ్లనే చూస్తూ ప్రాణేష్. దుష్యంతరావు వచ్చాడని మిసెస్ కుల్‌కర్ణి మేడమీద తన గదిలోకి వెళ్ళింది.

ప్రాణేష్‌కి ఏం మాట్లాడాలో తెలీటంలేదు. తండ్రితో ఏం చెప్పాలో తెలీటంలేదు. దీని కంతటికీ కారణ నువ్వే. నువ్వు మమ్మీని సవ్యంగా చూసుకున్నట్లయితే, ఆమె మనసుకి దుఃఖం కలిగించకపోయినట్లయితే, ఆమె తన దుఃఖాన్ని ఇన్ని సంవత్సరాలుగా కడుపులో పెట్టుకుని దిగమింగి బతక్కపోయినట్లయితే అంతా బాగా వుండేదని చెప్పాలని వుంది. అసలు సరిగ్గా చూసుకోలేనివాడిని ఆమెనెందుకు చేసుకున్నావని నిలదియ్యాలని వుంది. కానీ ఏదీ చెయ్యలేకపోతున్నాడు.



కడుపు భగభగా మండిపోతున్నది తండ్రిమీద. తల్లినలా చూస్తుంటే గుండె పగిలిపోతోంది. కోపంతో పిడికిళ్లు బిగుసుకుపోతున్నాయి. వాటిని కనిపించకుండా రెండు చేతుల్నీ వెనకాల పెట్టుకున్నాడు. రిపోర్టులను చూస్తుంటే అరికాలిమంట నెత్తికెక్కుతోంది.

దుష్యంతరావు కాసేపు భార్యదగ్గర కూర్చుని ఏవో చిన్నచిన్న మాటలు చెప్పాడు. ఆమెను బుజ్జగించాడు. ఆమెతో ప్రేమగా మాట్లాడాడు. ఆమెను నవ్వించడానికి ప్రయత్నించాడు. ఆమెనలా చూడాలంటే చాలా బాధగా వుందతనికి. నిజంగా తను ఆమెను అశ్రద్ధచేశానని మనసులో బాధపడ్డాడు. తన జీవితం చాలా నాశిరకంగా తయారయింది. తను పెట్టుకున్న రెండు సంసారాల్లో బాధితురాలు పద్మినని గ్రహించాడు. అతన్ని నమ్మిన బలిపశువులా అయిపోయిందని బాధపడ్డాడు. భార్య స్థితికి తనే కారణమని గ్రహించి సిగ్గుతో తల వంచుకున్నాడు.

ఇవతలకొచ్చి కొడుకును పిలిచాడు. పద్మిని దగ్గర వంట మనిషిని కూర్చోపెట్టి, మళ్లీ వస్తామని కిందికెళ్ళి హాల్లో కూర్చున్నారు. కొడుకు పక్కన కూర్చున్న దుష్యంతరావు మొదలుపెట్టాడు సంభాషణని.

"ప్రాణేష్... నువ్వలా నన్ను చూస్తుంటే నన్ను నిలవేస్తున్నట్లుందిరా, ప్లీజ్, అలా చూడకు. మమ్మీకి మామూలయిపోతుంది. నువ్వు అమెరికా వెళ్ళినపుడు రోజులతరబడి భోజనం మానేసేది, ఒక్కోసారి నేనొచ్చి చూస్తే అలాగే తిండీ తిప్పలూ లేకుండా పడుకుని వుండేదిరా, నేనెంత చెప్పినా వినేదికాదు. అప్పటికీ నేను ఫోన్‌లో టచ్‌లో వుండేవాడిని. చెప్పేవాడిని వేళకి భోజనం చెయ్యమని, సరేననేది. తరువాత పనిమనిషినడిగితే అది చెప్పేది అమ్మగారు సరిగా ఏదీ తినటంలేదు. ఎప్పుడు చూసినా అలాగే పడుకునే వుంటున్నారని. ఐదారు నెలలు మానసికంగా నలిగిపోయిందిరా.

"నేను లేకపోవటంకన్నా డాడీ, మీ సపోర్టువుంటే ఆవిడకి చాలా బాగుండేది. మీరు తన దగ్గరుండరని నేను అమెరికా వెళ్లడానికి ముందంతా బాధపడేది డాడీ. ఆవిడ వంటరితనాన్ని నా అమెరికా ప్రయాణం ఇంకా వంటరిదాన్ని చేసింది" తండ్రిని గట్టిగా నిలదియ్యలేక పోయాడు తన తల్లినెందుకు అశ్రద్ధ చెయ్యాల్సి వచ్చిందని. తండ్రినెలా అడగాలో అతనికేమాత్రం తెలీలేదు. ఆయన పెద్దవాడు. తనకి తండ్రి, ఆయన కళ్లెదుట పెరిగాడు. అలాటి వ్యక్తినెలా ఎదిరించి ప్రశ్నిస్తాడు? తండ్రితో ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

"అవును ప్రాణేష్, అంతకుముందునుంచే నా సమస్యలు మొదలవటంవల్ల తనని నెగ్లెక్ట్ చెయ్యాల్సివచ్చింది. గత ఐదారు సంవత్సరాలుగా నా సమస్యలన్నీ నన్ను తెగ వేధిస్తున్నాయి. చెప్పుకోగలిగేవి కొన్నయితే చెప్పుకోలేనివి కోకొల్లలు. మగవాడిగా, అందులోను సొంత కొడుకుతో ఈ విషయాలు చెప్పుకోవటమెంత దౌర్భాగ్యమో అయినప్పటికీ చెబుతున్నా. మమ్మీ మూలంగా ఇంట్లో గొడవలూ, మోహిని ఆంటీతో గొడవలూ, పిల్లలు ఆమెని వత్తాసేసుకుని, నామీద అసంతృప్తి ప్రకటించటం, సంఘం, మర్యాద, గౌరవం. ఒకటి కాదురా ప్రాణేష్... మీ మమ్మీని చేసుకుని నేనెన్ని బాధలు పడ్డానో నాకే తెలుసు. నా మాటను నిలబెట్టుకోవడానికి, నేను పద్మినికి ఇచ్చిన మాటను నిలబెట్టుకోవటానికి తనని చేసుకున్నా. కానీ తనకి పూర్తిగా న్యాయాన్ని చేకూర్చలేకపోయాను. మధ్యలో మీనాయనమ్మ ఒకటి. అదే నాకు తల్లిరా, అది వున్నది వూరికే వూరుకోక నాచేత ప్రామిస్ చేయించుకుంది మమ్మీని చూడకూడదనీ, మమ్మీదగ్గరకు రాకూడదనీ. అయినా ఆవిడ కళ్లుకప్పి ఎప్పుడో వచ్చేవాడిని. అసలు ఆవిడమూలంగానే మా ఇద్దరి మధ్యా అగాధం ఏర్పడింది. చుట్టాలలో తన పరువు పోతుందనీ, మోహిని తల్లికిచ్చిన మాటకోసమనీ, మోహిని మర్యాద కాపాడటంకోసమని నన్ను నన్నుగా బతకనివ్వలేదామె. మోహినీ, ఆమె ఇద్దరూ చేరి నాకు నరకం సృష్టించారు"

"వాళ్ల చేతుల్లో కీలుబొమ్మయే మనిషను కుంటే అసలు తన తల్లిని ఎందుకు చేసుకోవాలి? తన తల్లిమాత్రం ఆడది కాదా? ఆమెకి మాత్రం జీవితం లేదా? ఆమెకి పరువు అక్కర్లేదా? " లోలోపల అనుకుంటూన్నాడు. కానీ పైకి ఏమీ అడగలేకపోతున్నాడు.

"నాయనమ్మ పోయిన తరువాత పోనీ గొడవలు పోయినయ్యనుకుంటే ఇంట్లో ఒక్కొక్కటీ వచ్చిపడ్డాయి. నందిని ఢిల్లీ నుంచీ పురిటికి రావటం, దానికి పిల్ల పుట్టటం, బాధ్యతలు"

"ఈయనకి మేంతప్ప అన్నీ బాధ్యతలే" మాటలు మౌనంగా ఆవేశపడ్డాయి.

"ఆమధ్య నా ఆరోగ్యం బాగుండకపోవడం, మోహిని ఆరోగ్యం బాగుండకపోవడం, ఏవేవో చికాకులు, ఒక్కటికాదు, ఎనీవే, చూద్దాం. కాస్త నువ్వు మమ్మీని చూసుకుంటుండు, నేనూ వస్తుంటాను"

"వస్తుంటానట... వస్తుంటానెందుకు? ఇక్కడే కొంతకాలం వుంటాననచ్చుగా? కొంపలేమన్నా అంటుకుపోతయ్యా? లేక ఈయన పాతివ్రత్యానికి కళంకం వాటిల్లుతుందా? " మనసు మళ్ళీ మొరాయించింది.

దుష్యంతరావు అతని ధోరణిలో చెప్పుకుంటూ పోతున్నాడు. "నేను వస్తుంటానులే ఫ్రీక్వెంట్ గా... నువ్వు కూడా మమ్మీకి చెప్పు డాడీ వస్తారు రోజూ అని"

ఏం మాట్లాడలేదు ప్రాణేష్.

"నేను రిజైన్ చెయ్యకముందు ఒక దిగులు... ఆఫీసులో తెలిసి, ఏం గొడవవుతుందోనని. రిజైన్ చేసిన తరువాత ఇంకొక దిగులు... ఈయన పెళ్లాం పిల్లల్ని వదిలేసి, ఇక్కడే వుంటున్నాడని అనుకుంటారే

మోనని. ఏంటో... అంతా అస్తవ్యస్తంగా వుంది"

ఆఫీసువుంటే ఆఫీసువాళ్లమీద వంక, అది లేకపోతే జనాలమీద వంక. అసలు ఈయనకే పిరికితనం ఎవరూ ఏదీ అనుకోకపోయినా అనకపోయినా. తన పెద్ద మనిషితనంకి ఎక్కడ భంగం కలుగుతుందోనని భయం, డబుల్‌స్టాండర్డ్స్! అలాంటప్పుడెందుకీ గొడవలు? సమాజం చెయ్యని పనులు మనం చెయ్యాలంటే, ఆ సమాజాన్ని ఎదిరించగల గుండెధైర్యం వుండాలి! మరి ధైర్యం లేనప్పుడు సమాజానికి వ్యతిరేకమయిన పనెలెందుకట చెయ్యటం? అదేమంటే జనాలూ, ఇమేజ్- ఈ జనాల్లో ఎవడు సవ్యంగా వున్నాడు కాబట్టి? దొరికితేనేకదా దొంగ? దొరక్కపోతే అందరూ దొరలే" మళ్ళీ అంతే మాటలని గుండె చప్పుడురూపంలో వ్యక్తపరిచింది.

"కాస్త చూసుకో ప్రాణేష్ మమ్మీని, నీ పనులు కొంచెం తగ్గించుకో, నాలుగురోజులు పనుల బాధ్యతల్ని ఎవరికయినా అప్పగించు, కాస్త ఇంటిపట్టున వుంటుండు, మెడికల్ రిపోర్ట్ చూస్తుంటే కాస్త సీరియస్‌గానే వుంది"

"సరే డాడీ" ముభావంగా సమాధానమిచ్చాడు ప్రాణేష్.

ఇద్దరూ కలసి మేడమీదున్న హాల్లోకెళ్లారు పద్మిని దగ్గరకు. కళ్లు తెరుచుకుని పడుకుని వుంది పద్మిని. తన దగ్గరికి వచ్చిన వాళ్లిద్దర్నీ చూసింది. మళ్లీ ఆమె తలదగ్గరున్న కుర్చీలో కూర్చున్నాడు దుష్యంతరావు.

"మినీ... చూడు, నువ్వు బాగా తినాలి. ఆలోచించటం మానెయ్యి.నీకు నేను లేనా? ఎందుకు బాధపడతావ్? నీకేం తక్కువయిందని? కొండంత అండగా వున్న కొడుకు నీపక్కనున్నాడు. నేనున్నాను, దేనికీ దిగులు పడకు. నాలుగు రోజులు బాగా రెస్ట్‌తీసుకో అన్నీ సార్టౌట్ చేద్దాం. మరి నేను వెళ్లి, రేపొస్తా" ఆమె చెయ్యి పట్టుకుని ప్రేమగా చెప్పాడు దుష్యంతరావ్.

కొండంత కొడుకుంటే ఏం లాభం భర్త వుండీ లేనప్పుడు? వాడితో నేనేం చెప్పుకుంటాను? ఈ సమయంలోనయినా కనీసం ఇంట్లో వుండి నీతో కాసేపుంటాను. నీ స్థానం నా గుండెల్లో పదిలంగా వుందని చెప్పటం చేతకాని పెద్దమనిషి- నేనేం నేరం చేశానని నాకీశిక్ష? ఏం నాతో ఒక్కరోజు గడిపితే ప్రపంచం తల్లకిందులవుతుందా? ఇప్పుడెళతాడట, రేపొస్తాడట లోలోన అనుకుంటూ దుష్యంతరావు కళ్లలో కళ్లుపెట్టి చూస్తోంది. ఆమె కళ్లు చమర్చాయి.

"వస్తా మినీ... పొద్దున్నే తొందరగా వస్తా" లేవబోయాడు.

మీకు తెలీదు దుష్యంత్, మీమీద నేనెంత ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నానో, మీకేం తెలుస్తుంది ఆడదాని మనసులో వున్న ప్రేమ విలువ? ఎప్పుడూ మీ గొడవే గానీ నా గొడవెప్పుడు ఆలోచించారు కాబట్టి? పొద్దున్న వస్తానని అంటారు. ఆ పొద్దున అవడానికి ఎన్ని గంటలుందో! ఏదయినా జరగటానికి ఒక్కక్షణం చాలు భర్తను చూస్తూ ఆలోచనల దొంతర్లని పదిలంగా మూసేసింది పద్మిని.

"మందులేసుకో... భోజనం చెయ్యి రాత్రికి...వస్తా" అంటూ ఆమె భుజంమీద చెయ్యివేసి వెనుతిరిగి వెళ్ళిపోయాడు దుష్యంత్‌రావ్. అతను వెళ్ళినవైపే కన్నార్పకుండా చూస్తుండిపోయింది పద్మిని. పడుకుని సీలింగ్‌పైన వున్న ఫానుని రెప్పవాల్చకుండా చూస్తోంది.

తల్లి ఆరోగ్యరీత్యా హాస్పిటల్ వ్యవహారాలను ఇంటిదగ్గరనుంచే చక్కబెడుతున్నాడు అదివరకు తను, తనతల్లి వున్న కింది పోర్షన్‌నుంచి. మిసెస్ కుల్‌కర్ణి పద్మిని దగ్గరే వుంటున్నది. ఆమెని ఓదార్చడానికి, ఆమె బ్రెయిన్‌ని వాష్‌చేసి, మామూలు మను

షుల్లో కలుపుదామని శతవిధాలా ప్రయత్నిస్తోంది. తన భర్త పోయినప్పటి పరిస్థితులూ, కొడుకు పోయినప్పటి పరిస్థితులూ అన్నీ ఒకదాని వెంట ఒకటి చెబుతోంది. అన్ని విషాదాలు తన జీవితంలో సంభవించినప్పటికీ, తను మనుషుల్లో కలిసిపోయి బతకటంలేదా అని ప్రశ్నించింది. ఏ ఒక్కళ్లవల్లా ఏ ఒక్కరి జీవితమూ స్థంభించిపోదని చెప్పింది.

అలా ఎవరికోసమూ బాధపడకూడదని బోధించింది. మనిషి దగ్గర లేనంత మాత్రాన అతని గురించి రాత్రింబగళ్లూ దిగులుపడుతూ కూర్చుంటే జీవితం పాడయిపోతుందని వివరించింది. మనుషులను శాశ్వతంగా పోగొట్టుకున్న తన బతుకుకంటే ఆమె జీవితం చాలా మేలనీ, కనీసం దుష్యంత్‌రావు ఎప్పుడయినా కనిపిస్తుంటాడు కదా అని అడిగింది. అందని మనిషికోసమని ఇంత తెలివితక్కువగా ఆరోగ్యాన్ని పాడుచేసుకోకూడదని ప్రబోధిం



చింది. కనీసం ప్రాణేష్ కోసమయినా ఆరోగ్యాన్ని తిరిగి పొందటానికి ప్రయత్నించమని బతిమాలింది.

"దీదీ... ప్రాణేష్‌కేంతక్కువ? ఏ నిముషాన నేను దుష్యంత్ సమక్షంలో యశోదతో వున్న కృష్ణుడి పెయింటింగ్ చూశానో ఆ నిముషం నా జీవితంపట్ల గొప్ప ప్రభావాన్ని చూపినట్లు, కృష్ణుడికి ఇద్దరు తల్లులున్నట్లు వాడికి కూడా ఇద్దరు తల్లులున్నారు. కృష్ణుడు దేవకి దగ్గరకంటే యశోద దగ్గరే హాయిగా ఆనందంగా వుండగలిగాడు. అలాగే నాకంటే కూడా మీరే వాడిని బాగా చూసుకుంటారు. వాడికి మీరంటే చాలా ఇష్టం! వాడికి మీరున్నారనే ధైర్యం నాకెప్పుడూ వుంది. వాడు మీ కొడుకు! వాడికి నేనేమివ్వగలిగాను? వాడు కోరుకున్నవీ, ఆశపడినవీ నేనేమీ ఇవ్వలేకపోయాను. మీరు అన్నీ ఇచ్చారు వాడికి. మీరే వాడికి నిజమైన తల్లి" ఏడ్చింది పద్మిని.



"పిచ్చిదానా... అలా మాట్లాడకు... మనలో మనం నీదినాదీ అనుకోకూడదు. అంత సెన్సిటివ్‌గా వుండకూడదు... కమాన్... ప్రాణేష్‌ని పిలుస్తా... బయటికెళ్లొద్దాం కాస్త ఫ్రెష్‌గా వుంటుంది" అని ప్రాణేష్‌ని పిలిచింది మిసెస్ కుల్‌కర్ణి. ముగ్గురూ కలసి సికిందరాబాద్ క్లబ్‌కి వెళ్లారు.

పదిరోజులవుతున్నా పద్మినిలో మార్పేదీ కనిపించటంలేదు. ప్రాణేష్ గాభరాపడుతున్నాడు. డాక్టర్ దగ్గరనుంచి ఎప్పుడూ వచ్చే సలహా మామూలే. దుష్యంత్‌రావు వరుసగా మూడు రోజులు వచ్చి, పద్మిని దగ్గరుండి, కాసేపు ఆమె మనసును రంజింపజెయ్యటానికి ప్రయత్నించాడు. మళ్ళీ నాలుగు రోజుల తరువాత అతని ధోరణి మామూలే. హటాత్తుగా మళ్లీ ఇంకొకరోజున కనిపించి ఏవో సాకులు చెప్పాడు పెళ్ళాం, కొడుకుతో... తను రాకపోవడాన్ని గురించి. తండ్రి ధోరణి తెలిసినా ఈసారి అతనిమీద ప్రాణేష్‌కి అసహ్యం పుడుతూన్నది తల్లి ఈ పరిస్థితిలో వున్నా పట్టించుకోకుండా ఏవేవో చెబుతున్నాడని. పద్మిని మౌనంగా వుండి, అలాగే పక్కమీదే కాలక్షేపం చేస్తోంది. చాలా నలిగిపోయి కనబడుతోంది అప్పటినుంచీ. సడన్‌గా ముసలిదానిలా కనబడుతోంది. ఆమెని చూస్తుంటే ప్రాణేష్ గుండెలు పగిలిపోతున్నాయి.

తెల్లారుతోంది. ఆరోజు ఎందుకో త్వరగానే లేచాడు అలారం పెట్టుకుని. తయారయ్యాడు గబగబా. మేడమీద తన బెడ్‌రూమ్‌లోంచి పక్కనున్న తల్లుల దగ్గరకొచ్చాడు. తల్లులిద్దరూ వాళ్లవాళ్ల పక్కలమీద దుప్పట్లు కప్పుకుని నిద్రలో వున్నారు.

తల్లి దుప్పటి సరిచేద్దామనుకుని దగ్గరకెళ్లాడు. గభాల్న అతని గుండె కొట్టుకోవడం ఆగిపోయింది మంచంకోడుని చూడగానే. మంచంకోడుమీద ఎర్రచీమలు బారులుగా పాకుతూ కనిపించాయి. అతని ఒళ్లు ఝల్లుమంది. శరీరం నిస్త్రాణమైనట్టనిపించి, భయంభయంగా తల్లి దుప్పటి ముసుగు తీశాడు ముఖంమీదినుంచి. చూసి హతాశు

డయ్యాడు. పద్మిని చెవిలోంచి ఎర్రచీమలు బయటకు పాకుతూ కనిపించాయి. ఆమె బుగ్గ ముట్టుకుని చూశాడు. చల్లగా వుంది. అతనికర్థమయిపోయింది.

తల్లి తననొదిలి వెళ్ళిపోయిందన్న నగ్నస త్యాన్ని అతను జీర్ణించుకోలేకపోతున్నాడు. అంటే... ఏ అర్ధరాత్రో ప్రాణం పోయింద న్నమాట! చాలా దారుణమనిపించింది. పక్కగదిలో తనుండి కూడా ఆమె పోయిన విషయం తెలుసుకోలేకపోయాడు. అంటే... అప్పుడు కూడా తనని ఆ బంగారుతల్లి ఇబ్బంది పెట్టలేదు. ఇంతగా తనని ప్రాణా నికి ప్రాణంగా ప్రేమించిన తన తల్లి శరీరా నికి చీమలు పాకుతుంటే తను చూస్తూ ఏమీ చెయ్యలేకపోయాడు.

బతికుండగా ఆమె ఎవరినీ ఎలాటి ఇబ్బందీ పెట్టలేదు. పోయిన తరువాత కూడా ఎవరినీ విసిగించలేదు. పక్కనున్న కొడుకు ఆమెను చావునుండి తప్పించలేక పోయాడు. ఊళ్లో వున్న ఆమె భర్త ఆమె పోయే సమయంలో ఆమె పక్కన లేకుండా పోయాడు. ఇదీ భార్యాభర్తల బంధమంటే. ఎంత హాస్యాస్పదంగావుందో తెలీలా ప్రాణేష్‌కి.

ప్రాణేష్‌కి బతుకుమీద విరక్తి కలిగింది. తండ్రిమీద రోత కలిగింది. ఇక ఆ తల్లే లేక పోయిన తరువాత ఆయన్ని లెక్కచెయ్యట మెందుకనుకున్నాడు. అయినా సమాచా రాన్ని ఆయన కందించాడు.

అన్నింటికంటే హృదయాన్ని కదిలించిన సంఘటన మరొకటుంది... కళ్లు తెరచినా కళ్లు మూసుకున్నా అదే కనిపిస్తోంది ప్రాణేష్ కళ్లలో. తల్లి శరీరాన్ని మంచంమీ దినుంచి తీసేప్పుడు మంచంమీదున్న పరుపు అడుగున ఒక ఫోటో కనిపించింది. ఆ ఫోటోలో తను మూడేళ్ల వయసులో వున్నప్పుడు తన తల్లి తనని వీపుమీద ఉప్పెక్కించుకుని తీయించుకున్న ఫోటో అది. ఆమె వీపుమీద చిన్న ప్రాణేష్ గర్వంగా చూస్తున్నాడు. ఆమె వంగింది కొడుకుని వీపుమీద ఎక్కించుకుని. ఆ ఫోటో వెనకాల ఆమె హస్తాక్షరాలతో రాసి వుంది "నా బిడ్డ... నా సర్వస్వం" అని. అది చూసిన ప్రాణేష్ మూగవోయాడు. తల్లి తనని ఒదిలి వెళ్ళిపోయిందనే నిజం గుర్తొచ్చి ఒళ్లంతా ఒణికిపోయింది. కడుపు రగిలింది. ఆ ఫోటోకి పక్కన ఇంకొక ఫోటో దుష్యంతరావుది. దానిలో అతనొ క్కడే వున్నాడు. దాని వెనక ఆమె రాసు కుంది. "ఐ మిస్ యూ... ఐ లవ్ యూ" అని. అది చూసి ఆవేశంతో ప్రకంపించిపో యాడు ప్రాణేష్. తండ్రినేం చేస్తే అతని కసి తగ్గుతుందో అతనికర్థంకాలేదు. ఆయ నంత కర్కశుడు ప్రపంచంలో వుండడేమో అనిపించి, చీదరపుట్టింది తండ్రిమీద. ఆ ఫోటో పక్కన ఒక తెల్లకాగితం. దానిమీద అందమయిన గుండ్రని అక్షరాలతో రాసు కుంది పద్మిని మిసెస్ కుల్‌కర్ణిని ఉద్దేశించి. "దీదీ... థాంక్యూ" అని.

అంత గొప్ప తల్లిని పోగొట్టుకున్నందుకు నరకయాతన అనుభవిస్తున్నాడు. అంటే... ఆమె అస్వస్థతకు గురయిన తరువాత ఆ ఫోటోలనీ, ఆ కాగితాన్నీ తన తలకింద పరు పులో పెట్టిందన్నమాట! నిజంగా తన తల్లి ఎంత గొప్పది. ఆమె తన తండ్రిని ఎంతగా ప్రేమించింది. తనని ఎంతగా ప్రేమించి ప్రాణాలిచ్చిందని ఆవేదనతో కుమిలిపో యాడు. అమ్మకోసం అలమటించాడు.

బతికున్నప్పుడు ఆమెనోటితో చెప్పలేని భాషనూ, భావాన్నీ రెండు ముక్కల్లో ఒక్కొ క్కళ్ల గురించీ రాసుకుందంటే ఆమె అంత రాంత రాళాల్లో మనుషులపట్ల ప్రేమ... అంకితభావం, కృతజ్ఞత- వీటన్నింటినీ మించిన ఓర్పు, బతికివున్నరోజుల్లో ఆమె మనసులోని వేదననూ, మనోభావాలనూ ఎవరూ చదవలేకపోయారు. ఎందుకంటే భర్త ఆమెకు ఎప్పుడూ అందని ఆకాశమే. ఎప్పుడు ఎలాటి భావం కలిగినా భార్యగా

ఆమె అతనితో పంచుకోవడానికి అతనెప్పుడూ ఆమెకు అవకాశాన్ని కలిగించలా బాధ్యతాయుతమైన పెద్దమనిషి హోదాలో.

ఇక కొడుకు- అతనికి వయసు వచ్చింది. అందులోనూ మగపిల్లవాడు... అసలే కోపిష్టి. తండ్రిపట్ల అతనికెంత వ్యతిరేకభావాలున్నాయో ఆమెకు బాగా తెలుసు. అలాంటిది ఆ కొడుక్కి ఏం చెప్పగలదు? ఏం చెప్పదలచినా ఆమె భావాలన్నీ దుష్యంతరావు చుట్టూనే పరిభ్రమించేవయినప్పుడు కొడుకుతో ఏం చెప్పగలదు? దానివల్ల కొడుకు రెచ్చిపోయి, తండ్రిపట్ల మరింత ద్వేషాన్ని పెంచుకోవటం తప్ప? అలా వాళ్లిద్దరి మధ్యా చిచ్చు రేపదలుచుకోలా. వాళ్ల మధ్య అగాధాలను సృష్టించదలుచుకోలా... వాళ్లమధ్య వున్న దూరాలను సమాంతర రేఖలుగా చెయ్యదలుచుకోలా. ఆడపిల్లయితే తల్లితో చనువుగా వుండటం, తల్లి భావాల నర్థం చేసుకుని, తండ్రిననునయించి, ఆయన ప్రేమను జయించి, తండ్రికి నచ్చచెప్పగలిగేదేమో. ఒకవేళ ప్రాణేష్ మగపిల్లాడయిపోయాడు మరి.

ఫోటోలను, కాగితాన్ని పదిలపరుచుకున్నాడు అపురూపంగా. ఇక మీదట తల్లికి సంబంధించినంతవరకూ ఆమెను చూడాలంటే ఆమె జ్ఞాపకాలను మననం చేసుకోవటమే. ఆమె తాలూకు వస్తువులలో ఆమెను చూసుకోవడానికి మించి ప్రాణేష్ చెయ్యగలిగిందేదీ లేదు.

దుష్యంతరావు సంగతి సరేసరి. అతనికి భార్య పోవడంవల్ల పడే బాధకంటే కూడా పశ్చాత్తాప బాధతో కుమిలిపోతున్నాడు. భార్య పోయిన దిగ్భ్రాంతినుండి బయటపడలేదు. సొంత తల్లి, తండ్రి పోయినప్పుడు కూడా ఇలా ఏడిచాడో లేదో తెలీదుగానీ ఇప్పుడు మాత్రం దుఃఖంతో గిలగిల్లాడిపోతున్నాడు. నీళ్లనుండి బయటపడ్డ చేపలా దిక్కుతెలీని స్థితిలో వున్నాడు. పసిపిల్లవాడిలా విలపిస్తున్నాడు. అతనేడిచినంతగా ప్రాణేష్ కూడా ఏడవలేదేమో.

దహనసంస్కారం... తతంగం, క్రియలూ యధావిధిగా జరిగిపోయాయి. తండ్రీకొడుకులిద్దరూ ఒకళ్లతో ఒకళ్లు సహకరించుకుని, అన్నీ యధావిధిగా జరిపించారు.

దుష్యంతరావు దుఃఖాన్ని చూసి ప్రాణేష్ ఏవగించుకున్నాడు. తండ్రిమీద మరింత ద్వేషాన్ని పెంచుకున్నాడు. దీనంతటికీ కారణం కేవలం ఆయనేనని బలీయమైన నమ్మకం అతనికి. ఇద్దరూ కలసి తతంగాన్నంతటినీ జరిపించినా మనసులో తండ్రి మీద విపరీతమైన ద్వేషం రగిలిపోతోంది. ఆయన ఆవిడని ప్రేమగా చూసుకుని, ఆమె పట్ల శ్రద్ధచూపించి, ఆవిడని కూడా తన భార్యగా గౌరవించి, చూసుకున్నట్లయితే తన తల్లికి ఇలాటి అకాలమరణం సంభవించేది కాదని అతని అభిప్రాయం. తన తల్లి తనకు తెలిసినంతవరకూ ఎప్పుడూ కోరలేదు వాళ్లందరినీ వదిలిపెట్టి, తనతోనే వుండమని. తన తల్లి అలాటి రాక్షసికాదు. కానీ ఆయనే తన తల్లికి తీరని ద్రోహం. అన్యాయం చేశాడు. తన తల్లిలాటి వ్యక్తిని సమాధానపరచటం ఎవరికయినా చాలా తేలిక. ఆమెలాటి ఫ్లెక్సిబుల్ మనుషులు చాలా అరుదుగా కనిపిస్తారు. కాస్తంత ప్రేమ, శ్రద్ధ, దయ- ఇవన్నింటినీ చూపించి భర్తగా తన బాధ్యతలెప్పుడూ ఆమెకుంటాయన్న నమ్మకాన్ని ఆమెకు కల్పించినట్లయితే పరిస్థితి వేరేవిధంగా వుండేది. ఎంతసేపటికీ తల్లినీ, తననూ గాలికి వదిలేసి, కావలసిన కాస్త డబ్బేదో వాళ్లమొహాన పడేస్తే బరువు బాధ్యతల్ని చూసుకున్నట్లెలా అవుతుంది? ఇంట్లో మనిషి పరాయిమనిషనుకునే దౌర్భాగ్యం ఎందుకుంటుంది? 'మన' అనుకున్నవాళ్లు మనవాళ్లు కాదనుకుంటేనే కదా మనుషులకి జీవితంపట్ల విముఖత, విరక్తి, విచారం, తీరని వేదన?

ప్రపంచంలో సహజమైన ఎడబాట్లు భార్యాభర్తలకి సంబంధించి రెండు వుంటాయి. ఒకటి... భార్యాభర్తలమధ్య అవగాహనలేక

నిత్యం నరకం అనుభవించటం చేతకాక విడా కులు తీసుకోవడం. రెండోది ఇద్దర్లో ఎవరో మరణించటం, చావెటూ నిజమనే నగ్నస త్యాన్ని చేదుమాత్రగా చేసుకుని మింగి, ఎడ బాటును బలవంతంగా అలవాటు చేసుకుని కాలప్రవాహానికి ఎదురీదడం. ఇవి రెండూ సహజ ఎడబాట్లు. కానీ ఇంకోరకం భార్యాభ ర్తలు కలసి వుంటూ విడివిడి జీవితాలని గడ పడం, దగ్గరగావుంటూ దూరంగా బతకటం. వివాహబంధం తెంచుకోలేనంత బలీయమ యినప్పుడు పరిస్థితులకు తలవొంచి విడివి డిగా బతుకుతూ 'వ్యవస్థ' అనే ముసుగులో మనల్ని మనం మోసంచేసుకుంటూ బత కడం, మనదికాని జీవితాన్ని మనమీద ఆపా దించుకుని జీవచ్ఛవంలా బతకడం 'మన' అనే మనుషులు మన పరిసరాల్లో లేకుండా, అందుబాటులో లేకుండా అస్థిమిత పరిస్థితిలో సస్పెన్స్‌తో బతకడం. సొంతమనుకున్న మని షితో మనసు కోరుకున్న కొన్ని క్షణాలను హాయిగా గడపడం. ఇదంతా జీవన్మరణాల మధ్య కలిగే పెనుగులాట అవుతుంది. అలాటి ఇద్దరు వ్యక్తుల జీవితంలో ఎవరో ఒకళ్లు నరకయాతనకు గురికావడం జరిగిన ప్పుడు అనుక్షణం జరిగే మానసిక పోరా టంలో, ఆలోచనల వెల్లువలో, తిరస్కారపు ఆవేదనలో మనసు అడుగడుగునా రక్తపుమ డుగులో స్నానం చెయ్యాల్సి వస్తుంది. అవా స్తవమయిన తృణీకారపు జీవితాన్ని బలవం తంగా భరించాల్సిన సమయంలో శరీరపు నరాలవ్యవస్థ క్షీణించక అభివృద్ధినెలా పొందు తుంది? ఆలోచనల ఆవేదనల వాడి, వేడికి నరాలు చిట్లక గట్టిగా బలంగా వుండటానికి అవేమన్నా ప్లాస్టిక్ తాళ్ళా?

ఇలాటి మూడోరకపు ఎడబాటులో బత కడం మానవమాతృలకు అసాధ్యం. అందు లోనూ పద్మినిలాటి సెన్సిటివ్ మనుషులక సలు సాధ్యంకాదు. ఇలాటి జీవితాలకి మనుషులు ఏదో ఒక పరిష్కారం చేసుకోక పోతే భగవంతుడు ఇంకోవిధంగా చేస్తాడు. అప్పుడు మనం బాధపడతాం. ఎందుకంటే మనుషుల్ని భగవంతుడు తన బిడ్డలుగా భావించుకుని, సహజమైన వాతావరణాన్ని కల్పించాడు హాయిగా బతకమని. కాని ఇలాటి అసహజమైన వాతావరణంలో అను క్షణం బతుకుతుంటే భగవంతుడి సృష్టిని వ్యతిరేకించినట్లు. అందుకే ఆయన అలాటి తీర్పునిచ్చేది దీనంతటికీ పరిష్కారం ఒక్కటే. పరిస్థితిని మనసారా అంగీకరించి, బతకడానికి ప్రయత్నిస్తే సమస్య దానంత టదే పరిష్కారమవుతుంది.

దోషి స్థానంలో దుష్యంతరావు మనసు పుట్టెడు దిగులుతో నలిగిపోయింది. భార్య పట్ల అతనికున్న భావాలు అతనికొక్కడికే తెలుసు. అతన్ని మనిషిగా మన్నించి, ఆద రించి, గౌరవించి, ఓదార్చగలిగింది ఇప్పుడు మిసెస్ కుల్‌కర్ణి మాత్రమే. ఆమె అతని పట్ల అవగాహన పెంచుకుని పెద్దదానిలా వ్యవహరించింది. కొన్ని సమయాల్లో కొడు కునిలా సుతారంగా మందలించింది కూడా.

పద్మిని పోయిన తరువాత కాలెండర్‌లో ఐదారు పేజీలు గబగబా వెళ్ళిపోయాయి. మిసెస్ కుల్‌కర్ణికీ, ప్రాణేష్‌కీ ఆమె లేని ఇల్లు నరకంగా వుంది. కన్నకొడుకుతోబాటు సొంత చెల్లెలిలా వుండే పద్మిని. ఇద్దరూ కళ్లముందు కనుమరుగవటం మిసెస్ కుల్ కర్ణికి మింగుడుపడటంలేదు. తల్లిలేని ఇల్లు దేవుడులేని దేవాలయంలా, నీళ్లులేని బావిలా అనిపిస్తోంది ప్రాణేష్‌కి. అప్పుడు భయ్యా, ఇప్పుడు తల్లి, ఇద్దరూ వెళ్ళిపోవ డాన్ని చూసిన ప్రాణేష్ జీవితాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించాడు.

పద్మినికి సంబంధించిన వస్తువులు ఖరీద యినవీ, ముఖ్యమైనవీ అన్నింటినీ పది లంగా ఒక బీరువాలో పెట్టాలని తీర్మానిం చారు ప్రాణేష్, మిసెస్ కుల్‌కర్ణి. మొదలె ట్టారు వాళ్లా పనిని. పద్మిని బట్టలున్న వార్డ్‌రోబ్ తెరిచారు. దానిలో కనిపించిన విచిత్రమైన వస్తువులు, చిన్నచిన్న సాధారణ

వస్తువులూ, మరికొన్ని విషయాలూ వారిని తీవ్రమనస్తాపానికి గురిచేశాయి.

చాలా చిన్నచిన్న పాలిథిన్ కవర్లు, వాటిని జాగ్రత్తగా సీల్ చేసివున్నాయి. వాటి లోపల వున్న వస్తువులు. ఒక్కో కవర్‌లో ఒక్కో వస్తువు. దాని వివరణలున్నాయి. అవి... కాలిబూటుకి సంబంధించిన బకిల్, దాని వివరణ దానిలోనే ఫలానా తారీఖున దుష్యంత్ బూట్ నుంచీ విడిపోయిన బకిల్ అయినట్లు, ఇంకో కవర్‌లో దుష్యంతరావు పాత విజిటింగ్ కార్డు, అది ఈ.సీ.ఐ.ఎల్‌లో మొదటి డిజిగ్నేషన్‌కి సంబంధించిందని వివరణ. ఇంకొకదానిలో బాగా శిథిలావస్థలో వున్న పేలవంగా అయిపోయిన ఒక గులాబీ పువ్వు. అది పసుపుపచ్చటి గులాబీ అనీ, దాన్ని దుష్యంత్ మొట్టమొదటిసారి తనను హైదరాబాద్‌లో నౌబత్‌పహాడ్‌మీద కలిసినప్పుడిచ్చినట్టు రాసుకుంది. ఇంకా కొన్ని పాతపడిపోయిన సినిమా టిక్కెట్లు, పెన్నూ, షర్టు గుండీ, కొన్ని లవ్‌లెటర్స్, దుష్యంత్‌రావు పద్మినికి అతిప్రేమగా రాసినవి. ఆ లెటర్ అతనికి ఆమెపట్ల వున్న ప్రగాఢమైన ప్రేమను ప్రతి అక్షరంలో తెలియజేస్తుంది.

అక్కడ వున్న వస్తువులన్నింటినీ చూసిన తరువాత గుడ్లప్పగించుకుని అలాగే చూస్తుండిపోయాడు ప్రాణేష్ మిసెస్ కుల్‌కర్ణివైపు. అసలు తన తల్లి నిజస్వరూపం బయటపడింది. ఆమె ఆయన్నెంతగా ప్రేమించిందీ, అతని ఎడబాటును ఎంతగా అసహ్యించుకుందీ, అసలు దుష్యంతరావు లేని జీవితాన్ని ఆమె ఒక్క క్షణమైనా గడపలేని అసహాయత.

ప్రాణేష్‌కి పిచ్చిపట్టినట్లయింది తల్లి వ్యక్తిగత వస్తువుల్ని చూసి. అవి బయటివాళ్లకి చాలా వ్యర్థమైనవీ, చెత్తసామాను. కానీ ఆమె కవి ఎంతేసి విలువైనవనీ, ఎంత అపురూపమైనవనీ ఆమె వాటిని దాచుకున్న తీరునుబట్టి ఇట్టే గ్రహించుకోవచ్చు. ప్రాణేష్ తలనడ్డంగా పంకించుతున్నాడు. తన తల్లి అసలు విలువలను తెలుసుకున్నందుకు. భర్తమీద ఆమెకుగల అపారమైన ప్రేమ ఎడబాటులో పిచ్చిదానిలా అయిందేమో. ఎడబాటును తట్టుకోలేనంతటి స్థితిలో వెళ్ళిపోయిందేమోనని నిట్టూర్చాడు, ఏడిచాడు, అతనిగుండె బరువుతో మూలిగింది.

మరి తండ్రి కూడా చిన్నప్పుడు ఆమెను చాలా ఇష్టపడ్డాడు. ఆమెని అతను ప్రాణప్రదంగా చూసుకున్నాడు. ఒక్కో ఉత్తరంలో వివరించాడు కూడా ఆమె లేనిదే అతనెంత బతకలేనిదీ, మరి ఎందుకిలాగయాడు అన్నదతనికి అంతుపట్టలా. బహుశా అందుకేనేమో తండ్రిమీద తనతల్లి అంతగా ప్రేమను పెంచుకున్నదని అనుకున్నాడు. కానీ మరెందుకతని గుండె ఛాయయిందో, ఎందుకు ఆమెనంత అశ్రద్ధ చేశాడో ఏమీ అర్థంకాలేదు.

ఆ వస్తువులనన్నింటినీ మళ్లీ వాటివాటి స్థానాల్లోనే వుంచి, ఆ వార్డ్‌రోబ్‌ని జాగ్రత్తగా మూసేశాడు ప్రాణేష్. వస్తువులను చూసిన మిసెస్ కుల్‌కర్ణి నిజంగా ఆశ్చర్యపోయింది. ఆమె కళ్లలో నీళ్లు వర్షించాయి. పద్మినిని బాగా అర్థంచేసుకోగలిగింది. ఆమె హృదయం ఎంతగొప్పదో, ఎంత నిష్కల్మషమైనదో అర్థమయ్యేలోపు ఆమె మతిపోయినంత పనయింది. తనకి కూడా తన భర్తంటే ప్రేమే, అందుకే అతని కళ్లని శాశ్వతంగా సొంతంచేసుకుంది. దానితో సరిపుచ్చుకుంది. తరువాత అతని పుట్టిన రోజునాడు, పోయిన రోజునాడు అతన్ని గుర్తుచేసుకుని బాధ పడుతుందిగానీ అతని ప్రేమలో పిచ్చిదయిపోలేదు. మరి ఈ పిచ్చిపిల్లెందుకిలా చేసిందని బాధపడింది. పద్మినిపట్ల చాలా ప్రేమ వుండేది ఆమెకు. ఆ ప్రేమ ఇప్పుడు అచంచలమైన గౌరవంగా మారిపోయింది, నిట్టూర్చింది.

అసలు వాళ్లిద్దరూ చెయ్యాలనుకున్న సర్దుడుపనిని మర్చిపోయారు ఆ వస్తువులిచ్చిన

విద్యుద్ఘాతంతో. ఇక ఆ స్థలాన్ని వదిలి ఆ పని ఇంకోరోజుకి వాయిదా వేసుకుని ఎవరి పనుల్లోకి వాళ్లెళ్లారు.

దుష్యంతరావు పద్మిని పోయిన తరువాత నాలుగయిదుసార్లు వచ్చాడు. కొడుకుని పలకరించిపోవడానికొకసారీ... ఆమె బాంక్ లాకర్ కీ ఇచ్చిపోవడానికొకసారీ... ఇంటి ప్రాపర్టీ విషయాలు మాట్లాడటానికొకసారీ... ఇంకేదో అతను వచ్చిన అన్ని సార్లూ ప్రాణేష్ తండ్రిని కలవలేకపోయాడు హాస్పిటల్ నిర్మాణ వ్యవహారాల మూలంగా.



కాసేపు కూర్చుని, పద్మినిని మనసులో జ్ఞాపకం చేసుకుని, ఒకకప్పు కాఫీ తాగి వెళ్ళిపోయేవాడు. పద్మిని పోవడం అతని అసలు వయసుకి పది సంవత్సరాలు పెరిగినట్లు కనిపిస్తున్నాడు. మనిషి బాగా కృంగిపోయి, నీరసంగా కనబడుతున్నాడు. ఇవేవీ గమనించని ప్రాణేష్ తండ్రిని క్షమించలేకపోతున్నాడు. తండ్రితో ముభావంగానే మాట్లాడాడు కలిసిన కొన్ని సార్లు కూడా. ఏమీ చెయ్యలేని, మాట్లాడలేని పరిస్థితిలో దోషిలా తలవంచుకుని వెళ్ళిపోతున్నాడు.

అలా తలవంచుకుని పోతున్న ఆ నిండు పెద్దమనిషిని చూస్తుంటే మిసెస్ కుల్‌కర్ణికి ఎంతో బాధగా అనిపిస్తోంది. కొడుకు ప్రవర్తన ఆమెకి అసలు నచ్చటంలా. అతనికి నచ్చజెప్పటానికి చాలాసార్లు ప్రయత్నించి, విఫలురాలయింది. ఎదిగిన పిల్లలకి ఏ తల్లిదండ్రులయినా కొంతవరకే చెప్పగలరు. వాళ్లని బలవంతం చేసి, వాళ్లచేత ఏ పనినీ చేయించలేరు.

హాస్పిటల్ పనులన్నీ పూర్తయిపోయాయి. ప్రారంభోత్సవం చాలా ఆర్భాటంగా చెయ్యాలని ముందునుంచీ తహతహలాడిన ప్రాణేష్ తల్లి పోవడంతో ఆ ఆలోచనని విరమించుకుని ఏదో నామమాత్రంగా చేశాడు ముఖ్యమంత్రి, ఆరోగ్య మంత్రి తదితరులతో ప్రారంభోత్సవాన్ని... హాస్పిటల్‌తోబాటు ముందులేని ఆలోచన, పద్మిని పోయిన తరువాత వచ్చిన ఆలోచన, ఏమిటంటే పద్మిని పేరుమీద అనేక రకాలుగా బాధతో మగ్గిపోతూ అణువణువూ అనుక్షణం నరకయాతనకు గురయిన స్త్రీలకోసం ప్రత్యేకించి స్త్రీ సంక్షేమవిభాగాన్ని ప్రారంభించాడు.

భర్తపోయిన స్త్రీలు... భర్తనుంచి విడాకులు పొంది అన్నిదారులూ స్తంభించిపోయిన స్త్రీలు, పెళ్ళికాని స్త్రీలు, పిల్లల నిరాదరణకు గురయిన వాళ్లు, ఒకళ్లేమిటి సమాజంలో ఎన్నిరకాల పీడలుంటాయో అన్ని రకాల పీడిత స్త్రీలకోసమని అనేక రకాల విభాగాలుగా విభజించి, ప్రతి విభాగానికీ సహాయ సహకారాలనందించి, వాళ్లకి అన్ని రకాల చేదోడువాదోడుగా నిలవగలిగే వ్యక్తుల్ని ఏర్పాటుచేసి, ఎంతో శ్రమ తీసుకున్నాడు. ముఖ్యంగా రెండో భార్యస్థానంలో వున్న స్త్రీ సమాజపు తిరస్కారాన్ని భరించి, ఎన్నిరకాల కష్టాలు పడుతుందో తన తల్లిని చూసి వ్యక్తిగతంగా తెలుసుకున్న ప్రాణేష్... అలాంటివారికోసం ప్రత్యేకమైన విభాగాన్ని ఏర్పరచిం

దేకాక, దానికి తనే ప్రాతినిధ్యం వహిం చాడు. తన ఆశ్రయాన్ని కోరిన ఏ స్త్రీ ఏ పరిస్థితిలో ఏ సమయాన వచ్చినా ఆ ప్రాంగణం ఆ స్త్రీని ఆదరించడమేకాకుండా, చేయూతనిచ్చి, జీవితకాలానికి కావలసిన డబ్బు, గౌరవమర్యాదల్ని సంపాదించుకోవ డానికి వీలుగా తనకు చేతనయిన సహా యాన్ని నిస్సందేహంగా అందించడానికి కంకణం కట్టుకున్నాడు. అలాటి ఏ స్త్రీని చూసినా, ప్రతి స్త్రీలోనూ తన తల్లిని చూసు కుంటున్నాడు ప్రాణేష్.

ఇలాంటి సేవా కార్యక్రమాల్నందించ టమే కాకుండా సమాజంలోని కుళ్లుని ప్రక్షా ళనం చెయ్యదలచాడు కొన్ని సంస్కరణల ద్వారా. సంస్కరణలెందుకంటే చక్రధర రావు భార్యలాటి అసూయాపరులను బాగు చెయ్యాలంటే అలాటి వారిపట్ల కొంత సంస్కరణ తప్పదని అతని నమ్మకం. 'హిప్రోకసీ' అనే ఊడలతో పెనవేసుకుపో యిన ఈ సమాజాన్ని బాగుచెయ్యడానికి ఎంతో పట్టుదల కావాలి. త్రికరణ శుద్ధితో సాధించాలి. సమాజం బాగుపడాలంటే పిల్లలు చైతన్యవంతులవాలి. పిల్లలు చైతన్య వంతులవాలంటే వారికి చిన్నప్పటినుంచే సరయిన శిక్షణ అవసరం. అది పాఠశాలకి వెళ్లకముందునుంచే అవసరం. కాబట్టి అలాటి శిక్షణ కావాలంటే ఆ శిక్షణను పిల్ల లకిచ్చే తల్లులు సుశిక్షితులవ్వాలని అతని వాదం. దానికి తగినట్లుగానే ఆ పంథాలోనే ప్రయాణిస్తున్నాడు ప్రాణేష్. స్త్రీ సంక్షేమ కార్యక్రమాల్లో మిసెస్ కుల్‌కర్ణి తన ఒంతు సేవలని చాలా చురుకుగా అందిస్తూ, కొడుకు చేసే మంచి పనికి సహకారాన్నం దిస్తోంది. తన ఒంటరి జీవితానికి ఈ పని సరయిన సమాధానమనుకుంది. ఆమె ఆర్మీ ఆఫీసరు భార్య అవడంవల్ల ఆమెకు ఈ పని చాలా సుళువుగా వుంది.

ఒకవైపు మీరాషామ్ పేరున నడుస్తున్న హాస్పిటల్... మరోవైపు స్త్రీ సంక్షేమ వ్యవ హారాలు. రెండూ ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నాయి పెద్దపెద్ద హేమాహేమీలు సేవాతత్పరతతో సేవలనందించడంవల్ల.

స్త్రీ సంక్షేమ విభాగంలో మూడువేల చద రపు అడుగుల్లో ఒక పెద్దహాలు చాలా అధునాతనంగా కట్టించాడు. హాలంతా ఏ.సీ. చేయించాడు. దానిలో పది మీటర్ల పొడవు, ఐదు మీటర్ల వెడల్పు వున్న ఒక పెద్ద స్టేజి. ఆ స్టేజి మొత్తం నలుపు గ్రానై ట్‌తో చెయ్యబడివుంది. హాలంతా మిల్క్ వైట్ పాలరాళ్లతో చెయ్యబడివుంది. నలుపూ తెలుపుల కలయిక చాలా అందంగా వుంది. ఆ స్టేజ్‌మీద ఏడడు గుల పాలరాతి విగ్రహం ప్రతిష్ఠింపబడి వుంది. గభాల్న చూసేవాళ్లకి సాక్షాత్తూ పద్మినివచ్చి నిలబడినట్లనిపిస్తుంది. ఆ విగ్ర హాన్ని అంత సహజంగా చెక్కారు శిల్పకా రులు. ఒక్కోసారి మనసు బొత్తిగా అలసి పోయినప్పుడు మనసు బాగాలేనప్పుడు తల్లి జ్ఞాపకాలు అతన్ని బాధపెట్టేప్పుడు ఆ విగ్రహం దగ్గరకెళ్ళి, ఆమె చేతిని పట్టుకుం టాడు. దానితో మామూలు మనిషయిపో తాడు ప్రాణేష్.

శిక్షణను పూర్తిచేసుకున్న స్త్రీలు చివరిరోజు మీటింగ్‌కోసం ఆ హాలును వాడుకుంటారు. దానిలో వందమంది కూర్చోవడానికి కుర్చీలు, మైకులు, స్పీకర్లూ అన్ని హంగులూ వున్నాయి. ఏవైనా ప్రత్యేక సందర్భాల్లో కూడా వాడుతుంటారు ఆ హాలును. హాస్పి టల్‌లో మీరాషామ్ విగ్రహాన్ని కూడా అదే కొలతలతో చేయించి ఒక పెద్ద హాలు ప్రత్యే కంగా చేయించి, దానిలో మెడికల్ కాన్ఫరె న్స్‌లూ వగైరాలూ జరిపిస్తుంటాడు ప్రాణేష్. అలాటి కాన్ఫరెన్స్‌లు ప్రపంచ ప్రఖ్యాతిగాం చిన డాక్టర్లూ, సర్జన్లతో వైభవోపేతంగా జరు గుతుంటాయి.

★ ★ ★

పద్మిని పోయిన తరువాత రెండవ వార్షి కోత్సవాన్ని జరిపించాడు ప్రాణేష్. హాస్పి

టల్ ప్రాంగణంలోవున్న స్త్రీ సంక్షేమ విభాగంలోనే చేయిస్తాడు. ఆరోజు స్త్రీలంతా పాల్గొని అమ్మ బొమ్మని కళకళలాడేలా తీర్చిదిద్దారు. అమ్మ విగ్రహంలో వున్న పద్మినికి ప్రత్యేకమైన తెల్ల గులాబీలనూ, తెల్ల కార్నేషన్ పువ్వులనూ మాలగా చేయించి, దానితో అలంకరించాడు ప్రాణేష్.

పిలవకపోయినా వెతుక్కుంటూ వచ్చాడు దుష్యంతరావు ఆరోజు. నిశితంగా పరీక్షించే వాళ్లకు బాగా అర్థమౌతుంది అతని మొహంలో ముందున్న కళాకాంతులు పోయాయని. బహుశా అతని మీదున్న ప్రేమతో పద్మిని వాటిని తీసికెళ్ళిపోయిందేమో ఆమెతోబాటు అతని గుర్తుగా. ఉన్నట్టుండి పెద్దవాడయిపోయినట్టు కనిపిస్తున్నాడు అంత పెద్దతనం లేకపోయినా. తల్లి విగ్రహాన్ని చూస్తూ నిలబడ్డ కొడుకు దగ్గరకొచ్చి నిలబడ్డాడు. అందమైన ఆ విగ్రహానికి తెల్లటి తెలుపు గులాబీలు, కార్నేషన్లతో చేసిన దండ ఎంత అందాన్నిస్తున్నదో చూడటానికి రెండుకళ్లు చాలడం లేదు. అలాగే తల్లిని తన్మయత్వంతో చూస్తూ నిలబడ్డాడు. తన తల్లి జీవితంలోనూ, ఆమె పోయిన తరువాత తన జీవితంలోనూ ఇంతేసి మార్పులొస్తాయని కలలో కూడా వూహించలేదు. తల్లిని తదేకంగా చూసే అతని కళ్లు చెమ్మగిల్లాయి. 'అసలు నువ్వెందుకు నన్నొదిలి వెళ్ళిపోయావు? నా ప్రేమలో నీకేం తక్కువయింది? ఎంతసేపటికీ ఇంటికిరాని ఆయనకోసం బాధపడ్డావ్‌గానీ ఇంట్లో వున్న నా గురించి ఎందుకు పట్టించుకోవు? నువ్వు నన్నిలా అనాథలా వొదిలి వెళ్లటం తప్పు కాదా? మొదటినుంచీ డాడీవుండీ లేనివాడినయ్యాను. ఆయన్ని కూడా నీలోనే చూసుకునేవాడిని. నువ్వు కూడా నన్నొదిలి వెళ్ళిపోతే నా గురించి ఎవరు ఆలోచిస్తారు చెప్పు?' ప్రాణేష్ మనసు రోదిస్తోంది, బుగ్గలమీద కన్నీరు కిందికి జారుతోంది. ఆమె కొడుకుని నవ్వుతూ చూస్తున్నట్టనిపిస్తోంది. అదే విగ్రహాన్ని మరోసారి చూశాడు. కానీ ఆమె తనవంక చూడకుండా ఈసారి అతని పక్కగా దృష్టి మళ్లించినట్లనిపించిందతనికి. తేరిపారా చూశాడు. ఇప్పుడూ అలాగే అనిపించింది. పక్కనే ఓరగా చూశాడు. తనపక్కన తండ్రి నిలబడి అదే విగ్రహాన్ని చూస్తూ నిలబడివున్నాడు. 'ఇక్కడ... ఇప్పుడు కూడా ఈయన మా ఇద్దరిమధ్య దాపరించాడు. ఫిజికల్‌గా ఆమెను నానుంచి దూరం చేసింది చాలక మానసికంగా కూడా ఆమెను నానుంచి దూరం చెయ్యాలని కంకణం కట్టుకున్నాడులా వుంది. అందుకే అప్పటిదాకా నన్ను చూస్తున్న మమ్మీ ఈయన రాగానే ఈయన్ని చూసినట్లుంది అనుకుని నిట్టూర్చాడు. అక్కడినుంచి నాలుగడుగులు ముందుకేశాడు.

"ప్రాణేష్... ఒక్కక్షణం ఆగరా"

"ఏంటి డాడీ? "

"నీతో నాలుగు నిముషాలు మాట్లాడాలి"

"మళ్ళీ కలుద్దాం. నాకు కాస్త పనుంది హాస్పిటల్‌లో" అంటూ ముందుకు నడిచాడు.

"పెద్దమమ్మీ... డాడీకేంకావాలో చూడండి" అంటూ హాస్పిటల్ వైపు వెళ్ళిపోయాడు.

దుష్యంతరావు బరువుగా నిట్టూర్చాడు. కొడుక్కి తనతో మాట్లాడటానికి సమయం లేదని. అతనలా బాధపడుతున్నాడేమోనని గ్రహించిన మిసెస్ కుల్‌కర్ణి దుష్యంతరావుని మరోవైపునకు తీసికెళ్ళి, మర్యాదలు చేసింది. కన్విన్స్ అవకపోవడం ఇప్పుడు దుష్యంతరావు వంతయింది.

కొడుకుతో మాట్లాడటానికి నాలుగయిదు సార్లు వచ్చాడు హాస్పిటల్ కాంపస్‌కి, అభి

మానాన్ని చంపుకుని మరీ. కానీ కొడుకుని కలవడం కుదరటంలేదు. ఇక్కడికొస్తే అక్కడ వున్నాడనీ, అక్కడికి వెళితే ఇక్కడున్నాడనీ చెబుతున్నారు హాస్పిటల్ సిబ్బందీ, స్త్రీ శిక్షణా విభాగంలో వాళ్లు. అన్ని బిల్డింగులలో ఎక్కడున్నాడో అర్థం కాదు. పోనీ మిసెస్ కుల్‌కర్ణిని కలుద్దామన్నా ఆమె ఎక్కడెక్కడ తిరుగుతూంటూందో తెలీదు. ఆమె తంతు కూడా ప్రాణేష్ తంతులాగానేవుంది. అప్పటికీ కొడుకుతో మాట్లాడాలని అతని సెల్‌కి చేస్తే సమాధానం వుండటంలేదు. 'విధి' వక్రించి తారుమారయిందని వెళ్లిపోయే వాడు తిరిగి.

హాస్పిటల్‌లో తన కాబిన్‌లో కూర్చుని వున్నాడు ప్రాణేష్. అటెండెంట్ సీల్డ్ కవర్నొకదాన్ని తెచ్చి ప్రాణేష్‌కిచ్చి, "సార్... పెద్దాయనెవరో ఇదిచ్చి, 'ఎమ్‌డీగారికిమ్మ'ని చెప్పారు సార్. పేరడిగితే చెప్పలేదు. మీకు తెలుసని వెళ్లిపోయాడు సార్" వెళ్లిపోయాడు ఆ అటెండెంట్.

"అలాగా..." అంటూ కవర్నందుకున్నాడు ప్రాణేష్. టూ... వెలగపూడి ప్రాణేష్ అని రాసి వుంది తననుద్దేశించి. ఎవరయినా తనకి 'వి.ప్రాణేష్ కౌండిన్యస' అని రాస్తారుగానీ ఇలా ఇంటి పేరును వివరంగా రాయరు. చూస్తే ఆ చేతి దస్తూరి తనకు సుపరిచితమైనదే. తండ్రిది- చదవటం మొదలెట్టాడు.

డియర్ ప్రాణా-

ఇలా మీ మమ్మీ పిలిచేదని అనుకుంటున్నావుకదూ... అవును, నువ్వు తల్లీతండ్రీ లేని అనాథవయి, ఎంతోమంది దిక్కులేని వాళ్లకు పెద్దదిక్కయావు. అది నీ గొప్పదనం, నీ వ్యక్తిత్వం. నువ్వే ఎంతోమందికి తండ్రిలాటివాడివిప్పుడు. నిజానికి నీకు తండ్రే అవసరంలేదు తల్లి తప్ప. కానీ ఆ తల్లిని నీనుంచి దూరంచేసిన ఘనత నాకే దక్కిందేమో అనిపిస్తుంది.

నీ మనసులో నామీద చాలాకోపం వుందన్న విషయం నాకు బాగా తెలుసు. ఎందుకంటే నీ ముఖకవళికలను చదవగల నీ తండ్రిని నేను! నేను మిమ్మల్నిద్దర్నీ సరిగా చూసుకోలేకపోయానని నాకు బాగా తెలుసు. రెండో పెళ్లి చేసుకోవటమన్నది, దానిలోని తప్పొప్పులను అలావుంచితే చేసుకున్న తరువాత రెండో భార్యని కూడా భార్యల్లా చూసుకోవటం ఆ మగవాడి బాధ్యత. అలా చూసుకోలేనివాడికి ఆ పెళ్లి చేసుకునే అర్హతలేదు.

ఏ మగవాడయినా రెండోభార్యను బాగా చూసుకోనప్పుడు అతను వంకలకోసం ఎదురు చూస్తాడు పెద్దభార్యకిష్టంలేదనో, ఆ భార్య బిడ్డలకిష్టంలేదనో. ఇవి ముఖ్యమైన సాకులు మిగతావాటికంటే కూడాను. ఏ మగవాడినీ కూడా ఏ భార్యా మరోపెళ్లి చేసుకోమని చెప్పదు. ఆమెకి తెలియకుండా అతను చేసుకున్నప్పుడు ఏ భార్యా ఆనందంతో గంతులెయ్యదు సరికదా గొడవలు మొదలెడుతుంది. ఎందుకంటే మూడోవ్యక్తి వాళ్లిద్దరిమధ్యా చోటుచేసుకోవటం కంటకం కాబట్టి. సాధ్యమయినంతవరకూ భర్తను తనవైపు తిప్పుకోవడానికో... ఆ ముల్లుని తీసేసుకోవడానికో విశ్వప్రయత్నం చేస్తుందామె. ఈ ప్రయత్నపు ప్రక్రియలో అతని అనేక రకాల బలహీనతల్ని ఆమె తన ఆయుధాలుగా ఉపయోగించుకుంటుంది. కొన్నాళ్లు ఓపిక వున్నంతవరకూ భర్తకు నరకం సృష్టించటానికి ప్రయత్నిస్తుంది. ఆ సమయంలో అతను రెండోభార్యను ఏ పరిస్థితిల్లో చేసుకోవలసి వచ్చిందో వివరించాల్సిన బాధ్యత అతనిమీదుంది. ఎందుకంటే ఒకసారి చట్టబద్ధంగా వివాహం జరిగిన తరువాత మరోవివాహం చేసుకోవటమన్నది, రిస్క్ చెయ్యటమన్నదీ ఎవరూ కావాలని కోరుకోరు బలీయమైన కారణాలు వుంటేతప్ప. ఆ కారణాలను, నిజాలను వివ

రించుకుని, విశ్లేషించి, ఎదుటివ్యక్తి అపోహ లను దూరం చెయ్యాల్సిన బాధ్యత ఆ భర్తకి వుంది. నా విషయంలో ఆ తప్పే జరిగింది. ఎందుకంటే ప్రేమించడానికి తయారయినవాణ్ణి పెళ్లిచేసుకోవాల్సి వచ్చిన ప్పుడు తల్లిదండ్రులు గుర్తొచ్చారు అంతకు ముందు గుర్తురానివాళ్లు. ప్రేమించిందొక దాన్నయితే పెళ్లిచేసుకున్నదొకదాన్ని. బాధ పడ్డాను, ఏడిచాను. నాలో ఏ దౌర్బల్యం నాచేత ఆ పెళ్లి చేయించిందో తెలీదు. పశ్చాత్తాపపడ్డాను. తరువాత తప్పు తెలుసు కుని మమ్మీని చేసుకున్నాను రహస్యంగా.

ఆ చేసుకోవడమే గొప్ప పనిచేశాననుకు న్నానేగానీ అది నా బాధ్యతగానూ... ఆమె కూడా నా భార్యే అనిగానీ ఆలోచించలేక పోయాను. మమ్మీని బాగా చూసుకోవటా నికి ఇంట్లో పరిస్థితులు అడ్డువచ్చాయి. ఇంట్లో పరిస్థితులు నా మంచితనం మూలంగా నానెత్తికెక్కి కూచున్నాయి. అప్పుడు కూడా మెతకగా ఉండిపోయానే తప్ప ఒక బాధ్యతగల వ్యక్తిగా ప్రవర్తించ లేదు. వాళ్లని ఎదిరించటంగానీ, కన్విన్స్ చెయ్యటంగానీ చెయ్యలేకపోయాను. అది నాతప్పు ముమ్మాటికీ. వ్యతిరేకించటం వాళ్ల హక్కయితే, వాళ్లని కన్విన్స్‌చేసి, వాళ్లని నా దోవలోకి తెచ్చుకోవటం నా బాధ్యత. ఇది నేను చెయ్యలేకపోయామ నా అతిమంచితనంవల్ల. అందుకే దొంగలా అయి, దొంగతనంగా జీవితాన్ని గడపాల్సి వచ్చింది. నేనుగా నేను ఏవో లేనిపోని ప్రాబ్లమ్స్‌ని వూహించుకుని పద్మినిని పక్కన పెట్టాగానీ నిజానికి నేనూహించినం తలేదు. ఏవేవో భయాలు నన్ను కమ్మే సేవి... పద్మినిని కూడా భార్యగా స్వీకరిం చటానికయినా, ఆమెతో కూడా భర్తగా జీవించటానికయినా. మమ్మీ నన్ను చాలా సార్లు బతిమాలింది తనను ప్రేమగా చూసుకోమని. చాలాసార్లు ఏడిచింది తన పరువు కాపాడమని. కానీ వాటిని నేనంత సీరియస్‌గా పట్టించుకోలేదు ఉద్యోగం, ఇంటి బాధ్యతలతో. ఎంతసేపటికి ఎవరె వరో ఏదో అనుకుంటారని అనుకున్నాగానీ నన్ను ప్రేమించిన నా మినీ నా గురించి ఏమనుకుంటుందో వూహించలేని పిచ్చివాణ్ణ య్యాను.

నువ్వు పుట్టిన కొత్తల్లో చాలాసార్లు నన్ను బెగ్ చేసేది ఏదయినా వూరు తీసు కెళ్లమని. ఆమెను నేనంత పట్టించుకోలా. చెప్పే విషయాలనంత సీరియస్‌గా తీసు కోలా. ఎంతసేపటికీ రెండోభార్యని బాగా చూసుకుంటే ప్రపంచం దృష్టిలో నేను దుర్మార్గుణ్ణి అవుతానేమో అనుకున్నాగానీ నాకోసం జీవితాన్ని, ఎన్నింటినో త్యాగంచే సిన వ్యక్తి కూడా నాకు భార్యే, ఆమెక్కూడా న్యాయం చెయ్యాలన్నది నాకు ఎప్పుడూ తోచలేదు. ఇలాటి విషయాల్లో ఎవరిక యినా ఇంట్లోవాళ్లు వ్యతిరేకించక పూలదం డలు వెయ్యరుకదా. కానీ వాళ్లని నయానో భయానో కన్విన్స్‌చేసి, వాళ్లకి నమ్మకం కలిగించి, రెండుచోట్లా బాగా చూసుకోవల సిన బాధ్యత నామీద వున్నా నేను చెయ్య లేకపోయాను.

ఇది గ్రహించిన నేను... నీకు గుర్తున్నద నుకుంటా అప్పుడు మమ్మీ మంచంమీది నుంచీ పడింది కదా... ఆ సమయంలో తనకి ఏదయినా చెయ్యాలని సీరియస్‌గా అనుకున్నా. మమ్మీ దగ్గర కొన్నాళ్లుండాలని ఇంట్లో మోహినికి చెప్పి, గొడవచేసి కిందా మీదా పడి మొత్తానికి ఒప్పించా. అందుకే అప్పుడు రాలేకపోయాను ఆ గొడవల్లోపడి. తీరా ఇద్దర్నీ సమంగా చూసుకోవాలని ఒక పథకాన్ని తయారుచేసుకున్న తరువాత ఆమె మరణవార్త నాకు అందింది.

ప్రాణా... నన్ను నమ్ము నాన్నా నీ మమ్మీమీద నీకేకాదు, అంతకంటే ఎక్కువ ప్రేమ నాకుంది. ఎందుకంటే నీకంటే ముందు ఆమె నాకు తెలుసు. మా

ప్రేమకు గుర్తుగా పుట్టావ్ నువ్వు. ఆమె మీదే కాదు, నీమీద కూడా నాకు ఎంతో ప్రేమ వుంది. మోహిని పిల్లలమీద బాధ్యత వుంటే, నీమీద నాకెంతో ప్రేమ వుంది. ఎందుకంటే తండ్రి వుండీలేనివా డివి నువ్వు. ఈ విషయం నిన్నెంత బాధిం చేదో, బాధిస్తూన్నదో కూడా తెలుసు నాయనా నాకు. ఏమీ చెయ్యలేకపోయినా నీ విషయంలో అమానుషంగా ప్రవర్తిం చాను వాళ్ల బాధ్యతల ముసుగులో. తప్పె యిందిరా ప్రాణా. నన్ను క్షమించవూ? నాకు నువ్వన్నా, మమ్మీ అన్నా చాలా ప్రాణం. కాకపోతే నా మనస్తత్వం ఈ మాటని నా నోటిద్వారా చెప్పించలేకపో యింది. మీ మీదున్న ప్రేమని నా గుండె ల్లోనే పెట్టుకున్నానుగానీ పెదవులుదాటి బయటికి రానివ్వలేని పిచ్చివాడినిరా నేను. నేను ఫిజికల్‌గా అక్కడ వుండేవాడినేగానీ నా మనసంతా రాత్రింబగళ్లు మీ ఇద్దరిమీదే వుండేదంటే నమ్మవూ? ఒక తండ్రి కొడు కుతో చెప్పలేని విషయం ఇది. మగవా డిలా నేనెలా చెబుతాను చెప్పు నువ్వంటే నాకిష్టమని? ఐ లవ్ యూ సోమచ్ మై చైల్డ్!

నీకు నామీద చాలా కోపముందని నాకు తెలుసు. నిన్నిక విసిగించదలుచుకోలా. ఇక నీకంటికి కూడా కనిపించను. వస్తా, గుడ్‌బై-

డాడీ

ఉత్తరం చదివి విలపించాడు తండ్రిని అర్థంచేసుకోలేకపోయినందుకు. నలుగురు మనుషుల్ని నాలుగు మూలలకీ పంపించాడు ఆయన్ని వెతికించటానికి. ఇంకో మనిషిని ఆయనింటికి పంపించాడు. దుష్యంతరావు ఎక్కడా దొరకలా. ప్రాణే ష్‌కి గుండె ఝల్లుమంది. మొదటిసారి అతనికర్థమయింది తనకి తల్లంటేనే కాదు; తండ్రిమీద కూడా పంచప్రాణాలని. తండ్రి లేని జీవితాన్ని వూహించుకుని గజగజలా డాడు.

రెండురోజులు గడిచాయి. తండ్రి జాడ తెలీలా. ప్రాణేష్ గిల్టీగా బాధ పడుతు న్నాడు పెద్దాయన్ని అనవసరంగా కష్టపెట్టి, పొట్టన పెట్టుకున్నానేమోనని. ఏ అఘాయి త్యమో చేసుకున్నాడేమోనని. అన్నం సంయించలా రెండురోజులు. ఒక్కక్షణం ఒక్కచోట నిలవలేకపోయాడు. అతని పరి స్థితి తల్లకిందులయిపోయినట్టనిపించింది. ఆయన్నొకసారి మనసారా చూడాలని వుంది. ఎలా?

మూడోరోజు స్త్రీ సంక్షేమ విభాగంలో వుండే వాచ్‌మాన్ వచ్చాడు కాబిన్‌లోవున్న ప్రాణేష్ దగ్గరకి. ఎవరో ముసుగు కప్పు కున్న ఒక వ్యక్తి అమ్మ హాల్లో విగ్రహం దగ్గర పడుకుని వున్నాడని చెప్పాడు. గబ గబా పరుగెత్తాడు ప్రాణేష్ ఏ టెర్రరిస్టో నని.

చూసి నివ్వెరపోయాడు మాసిపోయిన గడ్డంతో కనిపిస్తూన్న డాడీని చూసి. కదల లేక అలాగే పడుకుని వున్నాడు. కళ్లు తెరచి కొడుకుని చూస్తున్నాడు.

"డాడీ... డాడీ... క్షమించండి! మిమ్మల్ని నేను సరిగా తెలుసుకోలేకపోయాను..." ఏడుస్తూ పసిపిల్లాడిలా తండ్రి మెడచుట్టూ చేతులేశాడు. పసి ప్రాణేష్ గుర్తొచ్చాడు దుష్యంతరావుకి. అతననుకోలా కొడుకు తనని క్షమిస్తాడని.

కొడుకు మెడచుట్టూ చేతులేసి, "నువ్వు నాకు దొంగకొడుకువి కాదురా నాయనా, నువ్వు నా కొడుకువి... నా దొరవి" అంటూ దుఃఖించాడు. తండ్రి కళ్లలో కళ్లు పెట్టి చూశాడు ప్రాణేష్ జైలునుంచి విముక్తి కలిగిన భావనతో. వాళ్లిద్దర్నీ చూస్తున్న పాలరాయిలోని పద్మిని వదనం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

# చతుర ప్రపంచం

## అప్పటి పద్ధతులు

మూడువందల ఏళ్ళక్రితం అమెరికాలోని జీవన విధానాన్ని ఆర్ట్‌రిచ్‌ఫీల్డ్ అనే ఓ అమెరికన్ పరిశోధించి ఈ కింది సత్యాలను బహిర్గతం చేశాడు.

✦ అప్పట్లో కెమేరాలేదు. మనిషి ఆకృతిని పెయింటింగ్‌లో కానీ లేదా శిల్పంలో కానీ మాత్రమే ప్రతిబింబించగలిగేవారు.




బొమ్మలు గీసేవాళ్ళు చిత్రంలో ఎంతమంది మనుషులను చిత్రీకరించారన్న దానిమీద కాక ఎన్ని అవయవాలు గీశారు అన్నదాని మీద వాళ్ళకిచ్చే రుసుము ఆధారపడేది. చేతులు, కాళ్ళని అవయవాలుగా లెక్కపెట్టేవారు. సాధారణంగా చాలామంది డబ్బు ఆదా చెయ్యడానికి ఏ పూలకుండీ చాటునో నిలబడి కాళ్లు, చేతులు కనపడకుండా బొమ్మ గీయించుకునేవారు.

✦ మే, అక్టోబర్ నెలల్లో అంటే ఏడాదికి రెండుసార్లు మాత్రం తలంటు పోసుకునేవారు.

✦ ఆడవాళ్ళు తమజుట్టు కనపడకుండా టోపీ పెట్టుకుంటే, మగాళ్ళు గుండు గీయించుకునేవారు. దీనికి కారణం పేలు.

✦ 1700లలో అమెరికాలోని చాలా ఇళ్ళలో ఒకే కుర్చీ వుండేది. దాంట్లో ఇంటి యజమాని మాత్రమే కూర్చునేవాడు. మిగిలినవాళ్ళంతా నేలమీద కూర్చునేవారు. ఛెయిర్‌మాన్ అన్న పదం ఈ అలవాటులోంచే పుట్టింది. ఇంటికి వచ్చిన అతిథిని ఆ కుర్చీలో కూర్చోమనడం అతన్ని గౌరవించడానికి సూచనగా వుండేది.

✦ ఆ రోజుల్లో వినోదం పేకాట. పేక ముక్కల అమ్మకంమీద పన్ను వుండేది. ఆ పన్నుని ఎగ్గొట్టడానికి 52 బదులు 51 పేక ముక్కలున్న బొత్తినే కొనేవారు. ఇస్పేటు ఆసుని తీసుకునేవారు కారు.

✦ ప్రజాభిప్రాయ సేకరణకి ఆ రోజుల్లో రాజకీయ నాయకులకి రేడియోలు, టీవీలు, దినపత్రికలు లేవు. కాబట్టి తమ సహచరు

లని, సహాయకులని లోకల్ బార్‌లకి పంపేవారు. వారక్కడ మద్యం తాగుతూ రాజకీయాలమీద ప్రజలు మాట్లాడుకునేది విని ఆ సమాచారాన్ని సేకరించేవారు. అలా వెళ్ళి తాగే పద్ధతిని 'గోసిప్' అనే వారు. అది చివరికి గాసిప్‌గా రూపాంతరం చెందింది.

✦ ఆరోజుల్లో గుర్రాలమీదే ప్రయాణాలు సాగేవి. గుర్రంమీద రోజంతా ప్రయాణం చేస్తే అలసిపోతుందని 2, 3 గంటలు ప్రయాణించాక తమ గుర్రాన్ని తాజాగా వున్న గుర్రంగల యజమానికి కొంత రుసుము ఇచ్చి ఆ గుర్రాన్ని తీసుకునేవారు. అంటే కొంచెం అద్దె కట్టేవారన్నమాట. తిరిగి వచ్చాక ఆ గుర్రాన్ని దాని యజమానికి అప్పచెప్పి తమ గుర్రాన్ని తీసుకునేవారు. ఉదయంవెళ్ళి సాయంత్రం వచ్చేవారంతా ఈ పద్ధతిని అవలంబించేవారు.

✦ మనుషులు కొంత రుసుముకు వ్యక్తిగత వార్తలని ఈ ఊరునుంచి మరో ఊరుకి చేరవేసేవారు. ఇంకో ఊరువెళ్ళి వాళ్ళకి చెందిన సమాచారం చెపితే వారు ఉచిత భోజనం, పడక వసతి కల్పించేవారు. ఊరుకో పద్ధతి వుండేది.

✦ చదవడం, రాయడం అందరికీ రాదు. డబ్బిచ్చి ఉత్తరాలు, పత్రాలు రాయించుకునేవారు. అలా కొంతమంది మాత్రమే చదువుకున్నవారు వుండడంతో ఈ రకం ఆదాయం వాళ్ళకి బాగానే గిట్టుబాటు అయ్యేది.

✦ రాత్రి ఇంట్లో దీపం ఆర్పాక వాళ్ళింటికి ఇరుగుపొరుగువారుగానీ, బంధుమిత్రులుగానీ వెళ్ళడం అమర్యాదగా భావించేవారు.

---

## ఆటలు

**ఆ**టలు రెండు రకాలు. ఒకటి ప్రమాదరహితమైనవి. మరొకటి ప్రమాదంతో కూడుకున్నవి. వారివారి మనస్తత్వాలని బట్టి మనుషులు వాటిలో ఏదో ఒకరకం ఆటలని వినోదానికి ఎన్నుకుంటారు.

ప్రమాద రహితమైనవి క్రికెట్, ఫుట్‌బాల్ లాంటివి. ప్రమాదంతో కూడుకున్నవి **లాంగ్‌జంప్, ఎత్తయిన** కొండలని ఎక్కడం, **విమానంనుంచి ప్యారాచూట్లతో** దూకడం లాంటివి.

ఫ్రాన్స్‌కు చెందిన 'వరల్డ్ ఎయిర్ స్పోర్ట్స్ ఫెడరేషన్' ఏటా ప్యారాచూట్ జంపింగ్ పోటీలను ప్రపంచంలో ఏదో ఒక దేశంలో నిర్వహిస్తూ వుంటుంది.

2000లో బ్రెజిల్‌లోని 'రియో డిజైనరీ' నగరంలో, 2001లో స్వీడన్‌లో, 2002లో సౌత్ ఆఫ్రికాలో ఆ పోటీలను నిర్వహించారు. 2003లో ఆసియాలోని థాయ్‌లాండ్‌లో బ్యాంకాక్ నగర సమీపంలో దీన్ని నిర్వహించారు. ఇందులో ప్రపంచంలోని వివిధ దేశాలకి చెందిన 672 మంది స్కయ్ డైవర్స్ పాల్గొన్నారు. అంతకుముందు సంవత్సరం 588 మంది మాత్రమే పాల్గొన్నారు. వీరిలో 250 మంది థాయ్‌లాండ్ ఎయిర్ ఫోర్స్‌కి చెందినవారున్నారు.

ఆరు ఎయిర్‌ఫోర్స్ విమానాల్లోంచి వీరంతా కొద్ది నిమిషాల తేడాలో బ్యాంకాక్ నగర సమీపంలో కిందికి దూకారు. ఇందుకు సి-130 విమానాలను వాడారు. భూమికి 7000 అడుగుల ఎత్తునుంచి స్కై డైవర్స్ ప్యారాచూట్లతో దిగారు.

వీరిలో ముగ్గురికి నేలమీదికి దిగుతుండగా బలమైన దెబ్బలు తగిలి హాస్పిటల్ పాలయ్యారు. వాళ్ళలో ఒకరు ఫ్రాన్స్‌కి, ఇద్దరు చైనాకి చెందినవారు. మొత్తం 42 దేశాలకి చెందిన స్కైడైవర్స్ ఈ పోటీలో పాల్గొన్నారు. చైనీస్ స్కైడైవర్స్‌కి ప్రథమ బహుమతి, ఉగాండాకు చెందినతనికి రెండవ బహుమతి, హాలెండ్‌కి చెందినత




నికి మూడవ బహుమతి లభించాయి. తర్వాతి 10 స్థానాలు పాకిస్థాన్, అమెరికా, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, చెకోస్లోవేకియా, పోలెండ్, ఇరాన్, న్యూజిలాండ్, ఇండియా, రష్యాలకి చెందినవారు గెలుచుకున్నారు.

వారు విమానాల్లోంచి దూకిన సమయంలో బలమైన గాలులు వస్తుండడంతో అధికభాగంమంది బ్యాంకాక్ నగరంవైపు తోయబడి ఆ నగరంలోనే దిగారు. ఒకరు యూనివర్సిటీ భవంతిమీదా, మరొకరు సరాసరి ఓ మంచినీటి నూతిలో, ఇంకొకరు ఓ వివాహవేదికమీద, మరొకరు వేగంగా వెడుతున్న బస్‌టాప్‌మీద దిగారు.

ఒకరు 13 అంతస్థుల భవంతిలోని టీవీ ఏంటిన్నాకు చిక్కుకుని వేలాడగా వేరొకరు లేడీస్‌కాలేజీలో దిగారు. ఆరోజు బాంకాక్‌లోని పత్రికా విలేకరులు ఇలా చిత్రవిచిత్రమైన ప్రదేశాల్లో దిగే స్కైడైవర్ల ఫొటోలు తీయడంలో బిజీ అయిపోయారు. అదృష్టవశాత్తూ ఎవరి ప్యారాచూట్లోనూ లోపం లేకపోవడంతో ఎవరికీ ప్రాణహాని కలుగలేదు.

ముందురోజు స్కైడైవర్స్‌కి ఎలాంటి ప్రమాదం జరగకూడదని బౌద్ధభక్తులు బౌద్ధారామాల్లో ప్రార్థనలు చేశారు. ఆరోజు బ్యాంకాక్‌లో అనేకమంది ఆకాశంలోంచి రంగురంగుల పారాచూట్స్‌తో దిగుతున్న స్కైడైవర్స్‌ని చూసి ఆశ్చర్యపోయారు. తక్కువమందికి మాత్రమే ఈ పోటీగురించి ముందుగా తెలియడం కారణం.

## ఆస్కార్

**హా**లీవుడ్ రాజధాని అయిన లాస్‌ఏంజిలిస్‌లో ఏటా ఫిబ్రవరి లేదా మార్చిలో జరిగే ఆస్కార్ అవార్డుల ప్రదానోత్సవం ఎంతోమందిని ఆకట్టుకుంటోంది. ఆ నగర ప్రజలు ఉత్సవానికి వచ్చే హాలీవుడ్ స్టార్స్‌ని చూడడానికి ఎగబడతారు. అంతేకాదు టీవీలలో చూపించే ఆ కార్యక్రమం తాలూకు ప్రత్యక్ష ప్రసారాన్ని కూడా ప్రపంచమంతటా 100 దేశాల్లోని 2 కోట్ల మందిదాకా తిలకిస్తారు.

1928లో మొదలైన ఆస్కార్ అవార్డుల ఉత్సవం ఇప్పటికి 76 సార్లు జరిగింది. ఈ ఉత్సవంలోని ఉత్కంఠ ఓ అదనపు ఆకర్షణ. బహుమతి గ్రహీతలని నిర్ణయించాక

వారి వివరాలను గోప్యంగా ఓ సీల్డ్ కవర్‌లో వుంచి ఆ బహుమతి ప్రదానోత్సవ సమయంలోనే ఈ సీల్డ్ కవర్‌ని అందరి ముందూ చింపి ప్రకటిస్తారు.

బంగారు పూతగల ఆస్కార్ బహుమతి అందుకోవడం కళాకారులంతా ఎంతో గొప్పగా భావిస్తారు. ఆ బహుమతి పొందినవారు సినిమాల్లో తీసుకునే పారితోషికం నాలుగింతలు పెరగడమే కాకుండా వారి

అనే వ్యాపార సంస్థ ఏటా 50 ఆస్కార్ అవార్డ్ విగ్రహాలను తయారుచేసి ఆర్గనైజర్స్‌కి అందిస్తుంటుంది. వారు వాటిని మరెవ్వరికీ చేసి ఇవ్వకూడదన్న అదనపు నియమం వుంది. ఇంతదాకా ఈ సంస్థ బహుమతులు పొందినవారి 160 విగ్రహాలను రిపేర్ చేసి ఇచ్చింది.

సుమారు 4 కిలోల బరువుండే ఈ విగ్రహం 13 అంగుళాల ఎత్తుంటుంది.




వెంట చిత్రనిర్మాతలు పడతారు. వారికి అవకాశాలు మునుపటిమీద మెరుగుపడతాయి.

1939 దాకా ఈ బహుమతి పేరు వేరు. ఆ ఏడాదే ఆస్కార్ అనే పేరు పెట్టారు. అదీ చిత్రంగా జరిగింది. ఆస్కార్ అవార్డ్ ఆఫీసులో కొత్తగా చేరిన లేడీ టైపిస్టు ఆస్కార్ బహుమతి విగ్రహాన్ని చూసి 'ఇది అచ్చం మా అంకుల్ ఆస్కార్‌లా వుంది' అంది. అది విన్న అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్స్ లైబ్రేరియన్‌కి ఆ పేరు నచ్చడంతో అదే స్థిరపడింది. ఆ టైపిస్ట్ పేరు మార్గరెట్ హెర్రిక్. షికాగోలోని ఆర్. ఎస్. క్రౌన్స్



ఫిల్మ్‌రాక్ మీద నిలబడి, చేతిలో ఖడ్గంగల ఓ సైనికాధికారి బొమ్మ అది.

అమెరికాలోని 46 పట్టణాల్లో ఆస్కార్ అవార్డు బహుమతుల ప్రదాన సంరక్షణగా డిన్నర్ పార్టీలను ఏర్పాటుచేస్తారు. దానికి హాజరవడానికి హెచ్చు మొత్తంలో డాలర్లు చెల్లించాల్సివుంటుంది. అలా పోగయిన మొత్తాన్ని హాలీవుడ్‌లోని బీద నటీనటులకు, టెక్నీషియన్స్‌కు ఖర్చు చేస్తారు. ఏటా 17 లక్షల డాలర్లు ఇలా పోగవుతుంటుంది.

ఈ ఆస్కార్ బహుమతిని ఎం.జి.యమ్.కి చెందిన ఆర్ట్ డైరెక్టర్ సెడ్రిక్ గిబ్బన్స్ డిజైన్ చేశాడు.

★

# ఈ వేకువ మీకోసం పై సమీక్షలు

**జూన్ 'చతుర'లో ప్రచురితమైన సూరేవల్లి విజయ నవల 'ఈ వేకువ మీకోసం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు**




## మారిన మానవీయకోణం

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ఆకాశసౌధాలలో వుంటూ విశ్వమానవ సౌభ్రాతృత్వం గురించి పదేపదే చెప్పేవాళ్లకు తమ పక్క వాటాలోనో అపార్టుమెంటులోనో వుండే వాళ్ల గురించి ఏమీ తెలియదు, తెలుసుకోరు అని అంటే అది అతిశయోక్తికాదేమో. జీవన విధానం, విలువలు, అందులో మానవీయకోణం ఇవి చాలా మారిపోయి ఎంతో కాలమయింది. 'అనుబంధం, ఆత్మీయత ఒక బూటకం ఆత్మతృప్తికై మనుషులు ఆడుకునే నాటకం' అని ఒక కవి రాసింది ఎంతైనా నిజం. వ్యాపారాత్మక సంబంధాలు తప్ప మరో రకమైన భావాలు కరువైపోతున్నవి. 'నేను సైతం సమాజానికి' అనే నినాదాలను ఎలుగెత్తి చెప్పేవాళ్లు కూడా కులమతాల జబ్బుతో కొట్టుకొని చస్తున్నారు. ఇక కుటుంబ జీవిత వ్యవస్థలో ఎక్కడా దేనికీ ఒక నియమం, విధానం అనేవేలేవు. జీవితం ఎలా గడపాలీ అనేది ఎవరిష్టం వారిదే. అష్టకష్టాలు పడి పిల్లలకోసం ఎంతో చేశామని పెద్దవాళ్లు అంటే అది మీ బాధ్యతకాదా, పిల్లలనుంచి ఏమీ ఆశించకూడదుగదా అంటారు. అబ్బే ఆర్థికంగా వాళ్లనుంచి ఆశించడంకాదు, కేవలం ఆలంబన అని పెద్దలంటారు. సగటు జీవితాల ఆశయం ఎలా వుందంటే నేను, నా జీవితం, నా పిల్లలు, నాది ఇలాగే తప్ప మరొకరి ఉనికి భరించలేని పరిస్థితి. కనీసం భార్యాభర్తలు కూడా వ్యాపార పద్ధతిలోనే జీవితం సాగించడంగాని, అదేదో, ప్రేమ, అనుబంధం, మమకారం ఇలాంటివి కరువైపోతున్నాయి అంటే వింతకాదు. ఇద్దరూ సంపాదించేవాళ్లయితే మరోరకం పరిస్థితి. ఒకరికోసం మరొకరు అనేది లేదు.

ఏదిఏమైనా కుటుంబ జీవిత వ్యవస్థ పెనుమార్పులు చెందటం కొంత స్త్రీల నిర్దేశకత్వంతోనే అని అనవలసి వస్తుంది. ఈ రోజున ఏ టీవీ సీరియల్ చూసినా స్త్రీ పాత్రలు ఎంత వికృతంగా వున్నాయీ అంటే నిరంతరం ఒకరిని మరొకరు అంతం చేసేయడం, హింసించడం, పన్నాగాలు పన్నడం, మగవాళ్లను వాజమ్మలుగా వుంచడం, ఈ కార్యక్రమాలే తప్ప వేరే మంచి పనులు వుండవు. తెలియని వాళ్లకు కూడా ఈ అకృత్యాలను బాగా తెలిసేలా చేస్తున్నారు. ఇందులో చెడునే తొందరగా

గ్రహిస్తారుగదా!

ఈ నేపథ్యంలో వైదేహి జీవితం ఈ నవలలో తిరిగిన మలుపులు ఏమీ అసంబద్ధమూ, విచిత్రమూ కాదు. సర్వేసర్వత్రా ఇంచుమించు చాలామంది జీవితాలలో ఏర్పడుతున్నవే.

'ఈ వేకువ మీకోసం' సమకాలీనంగా నేటి పరిస్థితులకు అద్దం పడుతూ, చాలామంచి సందేశాన్ని అందించినది. ఎవరినీ ఎవరూ నిందించుకోకుండా కలిగేమార్పులను తమ ఆలోచనలకూ, ఆశయాలకూ అనుగుణంగా మార్చుకుంటూ తాము జీవిస్తూ ఎంతో కొంత ఇతరులకు కూడా మార్గదర్శకత్వం కావడం చాలా గొప్ప విషయం. సమాధానం చెప్పలేని ఎన్నో ప్రశ్నలకు ఇలాంటి వేకువ, సూర్యోదయం చక్కని జవాబు అవుతాయి. ప్రయోజనకరం అవుతాయి.

**– వి. కామేశ్వరరావు**
*హైదరాబాద్-76*

## చేదు అనుభవాలు

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

**అమ్మ** ఎంత పాతకాలపు మనిషి అయినా నాన్న ఎంత మొండివాడైనా ఆ తల్లితండ్రుల పెంపకంలో రెండున్నర దశాబ్దాలపాటు నేర్చుకున్న సభ్యతా సంస్కారాలను, విద్యాబుద్ధుల్నీ మరిచి వారిపట్ల హేయంగా ప్రవర్తించే పిల్లలకు ఒక కనువిప్పులాంటి నవల సూరేపల్లి విజయగారి 'ఈ వేకువ మీ కోసం'.

ప్రాణికోటిలో అత్యున్నతుడైన మనిషి అత్యంత కష్టసమయంలో పెనుగాలిలోని గడ్డిపోచలా సుళ్ళు తిరిగే మనసును నియంత్రించి సరైన పంథాలో నిర్మాణాత్మకమైన ఆలోచనల వైపు మళ్ళించగలిగినపుడు తను సుఖపడడమే గాక చుట్టూ ఉన్న వారిని కూడా సుఖపెడతాడు. ఇందుకు వైదేహి జీవితం చక్కని ఉదాహరణ. కని పెంచిన పిల్లల నుండి ఆమెకు ఎదురైన చేదు అనుభవాలు ఆమెనో చక్కని ఆశయంవైపు నడిపించడాన్ని రచయిత్రి చక్కగా చిత్రీకరించారు.

తన భర్త తనకు రాసిచ్చిన ఆస్తి కేవలం తన స్వంతమని స్వార్థపరులైన కొడుకులకు, కోడళ్ళకు వైదేహి నిష్కర్షగా, మనోనిబ్బరంతో ఎదిరించి వారి స్వార్థపూరిత ప్రతిపాదనలు సున్నితంగా తిరస్కరించిన తీరును వర్ణించిన పద్ధతి అమోఘం. బహుశా ఇదేనేమో స్త్రీకి నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యం అంటే.

అమిత పాత్ర ఉన్నంతవరకు హుషారు కల్గిస్తూ మెరుపులు మెరిపించింది. అందమైన పసిమొగ్గల బాల్యాన్ని చల్లని తాతయ్య, బామ్మల ఒడిలో పెరగనీయమనే భావన పరోక్షంగా చెప్పిన తీరు (సత్యమూర్తి, రాందాసుల ఉదంతం) అభినంధనీయం.

అయితే నవలలోని అన్ని సహాయపాత్రలు (కొడుకులు, కోడళ్ళు) ఒకే విధమైన వికృత మనస్తత్వాన్ని కల్గి ఉండడం వలన నవలపై ఒకరకమైన నెగటివ్ భావన కూడా కల్గవచ్చు.

పాత్రలన్నీ వేటికవే ప్రత్యేకత కల్గి ఉన్నాయి కాబట్టి ఎలాంటి జిగిబిగి లేకుండా నవల ఆద్యంతం సాఫీగా సాగిపోతూ చివరికంతా చదివిస్తుంది.

సంఘం కాలాన్ని వెక్కిరిస్తూ ఒక్క అడుగు ముందుకు వేసినా మానవ నైజంలో మార్పు తేవడానికి యుగయుగాలు పట్టవచ్చు.

**– సి.అరుణ**
నెల్లూరు

## అమానుషం

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

**మాతృదేవోభవ, పితృదేవోభవ** అంటూ కనిపెంచిన తల్లితండ్రులను పూజించి కన్న

ఋణం తీర్చుకోవల్సిన కొడుకులు, అందుకు విరుద్ధంగా, ఛీదరింపులతో, ఛీత్కారాలతో అనుక్షణం నరకయాతనకి గురి చేయడం నిజంగా అమానుషం. బిడ్డ కడుపులో పడింది మొదలుకొని ఆ బిడ్డ మీద ఎన్నో ఆశలు పెట్టుకుని, ఆ పుట్టేది మగ బిడ్డే కావాలని కలలు కంటూ ఎన్నో దేవుళ్లని మొక్కుతారు. ఆ బిడ్డని పెంచి ప్రయోజకుడ్ని చెయ్యడానికి ఎన్నో కష్టనష్టాలని భరించి తమ సర్వస్వం ధారపోస్తారు. అలాంటి త్యాగమూర్తులను, ఇంత నిర్దయగా, నిరాదరణకి గురిచేసిన ఈ కొడుకులు భవిష్యత్తులో వారు ఈ చేదు అనుభవాలు చవిచూడవలసి వస్తుందని మరచిపోతున్నారు. ప్రతి కొడుకు ఒకనాటికి తండ్రి కావలసిందే. తన తల్లితండ్రులకు చూపిన నిరాదరణ రేపు తనకి తప్పదని మరచిపోకూడదు. పిల్లలచే నిర్లక్ష్యానికి గురయిన ప్రతి తల్లితండ్రి బాధపడి బెంగపడి ప్రయోజనం లేదు. గుండె నిబ్బరం చేసుకుని తన లాంటి ఎంతోమంది వృద్ధులకు ధైర్యం చెప్పి వృద్ధాప్యం శాపం కాదు, వరం అని నిరూపించాలి. ఇంత గొప్ప సందేశాత్మకమైన కథను అందించిన రచయిత్రి సూరేపల్లి విజయగారికి ధన్యవాదాలు. మనిషిలో ఉండే మంచినీ, మానవత్వాన్నీ వెలికి తీసే శక్తి ఒక్క రచనకే ఉందనిపిస్తుంది. భర్తపోయి కొడుకులు, కోడళ్ల నిరాదరణకు గురిచేసినా కృంగిపోక, మనోనిబ్బరంతో అనాథలైన ఎంతోమంది వృద్ధ దంపతులను చేరదీసి ఆశ్రయం కల్పించి 'ఈ వేకువ మీకోసం' అంటూ జీవితపు చివరి దశలో వారికి చేయూతనిచ్చి చీకటి నిండిన వారి జీవితాలకు వెలుగునిచ్చిన వైదేహి పాత్ర ఎంతో ఉన్నతంగా ఉంది. కథలో ఒక్కొక్క సన్నివేశం మా మనసును కదిలించింది. పాత్రలని మలచిన తీరు చాలా బాగుంది. అమిత పాత్రలో ఉండే మంచితనం, హుందాతనం కథకి నిండుదనాన్ని ఇచ్చింది. విభావర్‌తో అమిత పెళ్లి జరగడం ఒక రకంగా పాఠకులను ఆశ్చర్యపరచింది. కారణం మొదటి పరిచయంలో నితిన్ అమితను ఎంతో ఆరాధిస్తాడు. నితిన్‌తోనే అమిత వివాహం జరిగితే బాగుండేది. ఇలాంటి సందేశాత్మక కథలను తరచు 'చతుర' ద్వారా అందించాలని ఆశిస్తున్నాను.

– వి. కృష్ణప్రియ
చీపురుపల్లి

## ప్రేమ తత్వానికి కొత్త వెలుగు

*(నాల్గవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

భారతీయ వైవాహిక వ్యవస్థ ఎంతో ఉన్నతమైనది. రెండు విభిన్న కుటుంబాలకు చెందిన వ్యక్తులను ఒక్కటిగా చేసి అవ్యాజమైన ప్రేమానురాగ బంధంతో ముడివేస్తుంది.

'ఈ వేకువ మీకోసం' అనే నవల పేరులోనే రచయిత్రి లక్ష్యం సూచన ప్రాయంగా తెలిసింది. కొత్తతరం ఆశలు, మొక్కవోని ధైర్యం, ఆచరణాత్మక దృక్పథంతో తొణికిసలాడే వైదేహి పాత్ర ఆదర్శవంతమైనది, స్ఫూర్తిదాయకమైనది. కీర్తిశేషుడైన భర్త ఆలోచనలు ఆమెను ఆనందతరంగితం చేస్తాయి. ఏరా అన్న భర్త ఆత్మీయమైన పిలుపు ఎంత ఆత్మీయతను, అనుబంధాన్ని వ్యక్తం చేస్తుందో మాటలకందని భావన. ఆ అనుభూతి అనుభవించేవారికే తెలుస్తుంది. ఆ సన్నివేశాలు చదువుతుంటే నాకు కన్నీటి పర్యంతమయింది. ఇది వాస్తవం. ఆమె చేసిన ఈ వేకువ మీకోసం ఆశ్రమ నిర్మాణం ఈనాటి తల్లిదండ్రులకు స్ఫూర్తిదాయకం.

రచయిత్రి సూరేపల్లి విజయగారు విభిన్నమైన ప్రేమతత్వాన్ని నిరూపించడానికి వేరు వేరు జంట పాత్రలను సృష్టించారు. సత్యమూర్తి దంపతులు బిడ్డల మీద మమకారంతో సంపాదించిందంతా ముందే పంచేసి నిరాదరణకు గురై గృహబహిష్కారం కోసం

కొడుకు కోడలు, నాటకమాడే స్థితికి తెచ్చుకున్నారు. కన్నప్రేమ పాప కనుపించకుండా పోయినపుడు వారికి అనుభవమవుతుంది. సులోచన శేషాచలం దంపతులు ఆత్మీయంగా ఆదరించేవారికోసం పలవరించారు. బంధుత్వం కన్నా మానవతావాదం గొప్పదని ఆత్మీయతను పంచిన వైదేహి పాఠకులకు అనుభూతిని కలిగిస్తుంది.

అమిత దూరమైనపుడు రాజారావు దంపతులకు కన్నప్రేమ అనుభవంలోకి వస్తుంది. అమిత బామ్మను ఆదర్శంగా తీసుకొని కొత్తతరానికి ఆదర్శవంతమైన సందేశమిస్తుంది.

బంధాలు, అనుబంధాలు, ఆత్మీయత, మానవతావాదంలాంటి సమున్నత భావావిష్కరణకు రచయిత్రి ఎన్నుకున్న కథ, రచనాశిల్పం అద్భుతం. కన్నప్రేమ బలమేంటో అనుభవైకవేద్యం చేయడానికి రచయిత్రి చూపిన ప్రతిభ రచనాశిల్పం అభినందనీయం.

– చెన్నా రెడ్డి శేషయ్య
ఒంగోలు

## నిత్యనూతనం

*(ఐదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

ఈ ప్రపంచంలోని సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అన్న కారల్ మార్క్స్ మాటలకు నిర్వచనం ఈ నవల. డబ్బుజబ్బు చేసిన కొడుకులు భర్త పోయి ఒంటరితనంలో కుమిలిపోయే తల్లికి తోడుండే బదులు ఆస్తి కోసం ప్లాన్‌వేసుకుని ప్రేమ నటించడం, ఆస్తిపంచి ఇచ్చాక ఆ తల్లిదండ్రులను ఇంటి నుండి తరిమేయడానికి నాటకాలాడడం మానవత్వం సిగ్గుపడే సంఘటనలు.

జీవితానికి అంతిమ మజిలీ అయిన శ్మశానంలో వృద్ధులందరూ కలిసి జీవితాన్ని పునఃప్రారంభించడం కొత్తగాను, వింతగాను ఉన్నప్పటికి సమస్య తీవ్రతను చెబుతోంది. ప్రధాన పాత్రధారిణి వైదేహి స్వగతం చాలా భావుకతగా, భర్తతో ఆమె అనుబంధానికి అద్దంలా ఉంది. "మీరు పిలిస్తే చితిలోంచైనా నడిచి వచ్చేదానిని" లాంటి వాక్యాలు మనసుని చెమ్మగిల్లేటట్లు చేశాయి. అమితకు తల్లిదండ్రుల దగ్గర తప్ప మరే వ్యక్తి దగ్గరా గాని, వృత్తిలోగాని ఎటువంటి సమస్య ఎదురుకాకపోవటం కాస్త ఆశ్చర్యకరమే.

బిడ్డలచేత వంచింపబడిన తల్లిదండ్రులే అందరూ ఇందులో. సిద్ధాంతపరమైన, వ్యక్తిగత స్వేచ్ఛాపరమైన తేడాలవల్ల, తరాల అంతరాలవల్ల కూడ తల్లిదండ్రులు బిడ్డలకు దూరమవుతున్నారు. ఇవేవీ ఇందులో ప్రస్తావించబడలేదు.

సుమారు 20సం.ల క్రితం ఆంధ్రప్రభ ఉగాది నవలల పోటీల్లో ప్రథమ బహుమతి వచ్చిన 'మొక్కలు పిలుస్తున్నాయ్' లోనే ఈ పేయింగ్ పేరెంట్స్ థాట్ వచ్చింది. అయినా మన జీవితాల్లో నిత్యం కనిపించే సమస్య, నిత్యాగ్నిహోత్రంలాంటి సమస్యకాబట్టి ఇది నిత్యనూతనమే.

– చాడ సుజాత
నెల్లిమర్ల

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.

Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

